# శ్రీరామ కథాకందము

## యుద్ధకాండ

(పద్యకావ్యము)





రచన :

**యడవల్లి వీరరాఘవస్వామి**

17-1-388/6, శ్రీలక్ష్మీనగర్ కాలనీ,

హైదరాబాద్-500 659.

This book is Published with the Financial assistance of Tirumala Tirupathi Devasthanams under their Scheme "Aid to publish religious books"

ప్రథమ ముద్రణ :
మార్గశిర – శ్రీముఖ నామ సం॥
డిసెంబరు, 1993

ప్రతులు : 1000



ప్రతులకు :
రచయిత
17-1-388/6, శ్రీలక్ష్మీనగర్ కాలనీ,
సైదాబాదు, హైదరాబాదు-500 659.

వెల : రూ. 40/-

ముద్రణ :
**సహ్యావతి ఆర్ట్ ప్రింటర్స్**
ఇం నెం. 1-1-517/బి/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాద్-500 380.
ఫోన్లు : 611413, 600547.

శ్రీః

# ఆత్మనివేదనము

భారతీప్రతిభా రామ
మారామం వేద సంస్కృతేః
అమరం వాఙ్మయం రామ
మాదికావ్యోజ్జ్వలం నుమః

# శ్రీరామ కథాకంఠము-యుద్ధకాండము

# విషయసూచిక

పుట

# సవరణలు

| పేజీ | పద్యం | పాదం | ఉండవలసినది |
|---|---|---|---|
| 1 | | | హనుమంతు |
| 25 | 125 | 3 | గృతక |
| 27 | 132 | 3 | కార్యము |
| 29 | 139 | 3 | గపరవశుండగు |
| 30 | 145 | 4 | భూమీసుత |
| 39 | 193 | 2 | నొసంగుము |
| 47 | 232 | 2 | దీర్ఘ |
| 88 | 435 | 4 | సమర |
| 121 | 600 | 2 | గరమున |
| 161 | 799 | 3 | చలింప |
| 187 | 933 | 3 | బాలక |
| 219 | 1089 | 3 | కపిసే |
| 280 | 1395 | 4 | గ్రసింప |
| 321 | 1599 | 2 | నయ్యెదె |
| 326 | | | రామాగమనము |

# శ్రీ రా మ క థా క ం ద ము

## యుద్ధకాండము

శ్రీరామచంద్ర! కరుణా
వారిధి! వారాశిసేతుబంధనచణధీ!
దారిత విబుధ విరోధీ!
దూరీకృత భక్త దోష! తోయజనేత్రా!

### శ్రీరాముడు హనుమంతు నభినందించుట

1. హనుమన్ని వేదితావని
తనయా వృత్తంబున ముదితస్వాంతుండై
యనిలాత్మజు దెస మెప్పున
గని యిట్లనె రాఘవుండు గారవ మెసగన్.

2. వినతాసుతుండు గరుడుడొ!
యనిలుడొ సేయంగలుగు మహాద్భుత కార్యం
బొనరించి తీవు శతయో
జనాయతాంబుధి దరించి చనుటన్ హనుమా!

3. సుర దుర్నిరీక్ష్య రావణ
పురంబున న్వెదకి భూమిపుత్రిక నరయం
దరమే మతిసత్త్వాగ్రే
సరుండ వగు నీకు దక్క జగతి నొరులకున్.

4. బలవంతుడయ్యు భృత్యుం
డలసుండై ధారుణిపతి యానతి నెల్లన్
ఫలవంతము సేయని వా
డిల నధముండంద్రు సుమ్ము నృపనీతివిదుల్.

5. నియతంబగు కార్యమె భూ
దయితు నభీష్టం బెఱింగి తత్సిద్ధికి గా
మెయికొని యొనర్చు భృత్యున్
నయజ్ఞు లంద్రు రవినందనా! మధ్యము గాన్.

6. నియతంబగు దానిన గా
క యుచితగతి ద దనుకూలకార్యావళియున్
గయికొని యొనర్చు వానిన్
ప్రియముగ నుత్తము డటంచు బేర్కొంద్రు బుధుల్.

7. హనుమం డ ట్లుత్తమ భృ
త్యునకుం దగినట్లు సేసి యొదవించె ముదం
బును నీకును నాకును నిజ
ఘన భుజ వీర్య బల దర్ప గరిమము పేర్మిన్.

8. అనితర సాధ్యంబగు న
ప్పని సాధించిన హనుమకు ప్రత్యుపకృతి యే
మొనరింప గల్గు వాడన్
దిననాథతనూజ! యిట్టి దీనస్థితిలో.

9. అరయగ నా సర్వస్వము
పరిరంభణమాత్రమె యని పల్కుచు నొగి దా
శరథి ప్రముదమున బులకిత
శరీరు డై కౌగిలించె జయ్యన హనుమన్.

**సుగ్రీవుడు రామునకు యోచన చెప్పుట**

10. అటు పిమ్మట శ్రీరాఘవు
డిటులనె యోచన సలుపుచు నినసందన! యెం
తటి కష్టం బయ్యె సునం
ఘటితం బయ్యె ధరణిజ గ న్గొనుట యిటుల్.

11. ఇకమీద శతసహస్రా
ధిక కపిసైన్యంబులు జలధి దరించుటకున్
సుకరంబగు దెరు వెయ్యది
యొ! కలత జెందు మది యీ మహోదధి గనగన్.

12. అనినన్ సుగ్రీవుండి
ట్లనియె న్వందన మొనర్చి యమితోత్సాహం
బున రాఘవ! రావణదై
త్యనివాసం బెఱుగ వచ్చె ననిలజు చేతన్.

13. కలతం జెందెద వేటి క
తులితపరాక్రముడవు రిపుదుస్సహతేజో
కలితుండవు ధీశాలివి
పలుధర్మంబుల నెఱుంగు వాడవు రామా!

14. పలుకకు మద్ధైర్య వచనం
బులు ప్రాకృత నరుని బోలె ముప్పగు నీ వ్యా
కులమున్ ద్యజింపుము కృత
ఘ్నులు సౌహృదముం ఖలె రఘుకులమణిదీపా!

15. అమితోత్సాహమునం గపి
సముదాయ మురకలు వేయు సంగరసంరం
భము మై త్వదీయ కార్యా
ర్థము నిశ్శంకముగ జొచ్చు దహనం బైనన్.

16. హరిసైన్యమ్మున కంబుధి
తరణోపాయము ఘటించి దయసేయుము ని
ర్జరవైరి రావణుండిక
ధర గూలిన వాడె యంచు దలపం జెల్లున్.

17. వననిధికి సేతుబంధన
మొనర్ప నియమింపుము కపియోధులతో నే
జని సీత దెచ్చెదన్ రా
వణు గూల్చి రయమ్మున నిక వ్యసనంబేలా!

18. దుర మొనరింపగ రిపు లె
వ్వరు నిల్వగలారు? దీర్ఘ బాణాసనమున్
గరమున ధరించి క్రోధో
ద్ధురుండ వై యెదుట నీవు తోచిన చోటన్.

19. వ్యసనంబున గార్యంబులు
పొసగునె! క్షత్రియుడు మందబుద్ధిన్ జరియిం
ప సరకు సేయుదురె జనుల్
వ్యసనంబు ద్యజించి పూను మర్థ విధులకున్.

20. అనుభవ మైనది చాలదె!
ఘనశోకము దీని వీడి కాంతాహర రా
వణ మారణ భీషణ మగు
రణక్రియన్ బూను మతితర క్రోధమునన్.

21. కనబడు చున్నవి నాకు శు
భనిమిత్తములు ధరణిజ యవశ్యము లభియిం
చును నీకు వే బలుకు లే
ల నిశ్చయం బిక జయంబు రణమున రామా!

**హనుమంతుడు రామునకు లంకా విశేషములు చెప్పుట**

22. అనినన్ రాఘవు డూరట
గని యి ట్లనియె హనుమంతు గని లంకాప
త్తనమున్ బరిశోధించితి
వనూనముగ నెఱిగినాడ వరిమర్మంబుల్.

23. ఎఱిగింపుము రావణు సై
న్యరహస్యములు బుర రక్షణ విధానములున్
గరి రథ తురగ పదాతుల
పరిమాణము లాయుధములు బల తత్త్వంబుల్.

24. అనినన్ వాయుసుతుం డనె
వినుము ప్రభు! వచింతు నసురబృందంబులు లం
క నెసంగు నభీప్సిత జీ
వనమున సంతృప్తిగ దశవదనుడు ప్రోవన్.

25. సువిశాలము లర్ధ్వములున్
రవిప్రభాకలితదివ్యరత్నస్ఫటిక
ప్రవికల్పితోన్నతమహా
భవనశ్రేణులు విహారవనులున్ దనరున్.

26. కరి తురగ రథ సమూహము
చరించు బురవీధుల బహుసంకులముగ సం
గరకౌతుకి దశముఖుడున్
బరిశీలించును జమూ నివహ మనుదినమున్.

27. జలధిపరివేష్టితంబై
న లంక దుర్గమత్రికూటనగశృంగమునన్
విలసిల్లు సమృద్ధజలం
బులు నదులు ప్రదక్షిణించు భూమిధరంబున్.

28. అవనీధరగహనవ్రజ
మవలన్ మార్గావరోధ మగుచు వెలయు న
య్యవి భాసించు సహజదు
ర్గ విశేషంబులుగ ద దసుర పురంబునకున్.

29. రావణ నిర్మిత మై యా
పై వెలయు సమున్నతంబు ప్రాకారము ము
క్తావిద్రుమ కాంచన భూ
షా వితతప్రభ నఖిల దిశల్ వెలుగంగన్.

30. నెలకొల్పిరి గవనుల పై
గులిశోపమ శరవిమోచకోద్దామము ల
త్యలఘు శిలామోచకపటు
వులు యంత్రమ్ములు శతఘ్నిపూరము తోడన్.

31. ఆ రాక్షసేంద్రు పురికిన్
ద్వారమ్ముల దారు నిర్మితకవాటము లౌ
ప్పారు జతుర్దిశల నచే
ద్యారూఢి ననేక రాక్షసాధిలములై.

32. శూలాసిధారులై పది
వేల దనుజయోధవరు లవిరశస్త్రశ్రద్ధన్
బాలింతురు ప్రాగ్ద్వారము
నా లంకాధీశు నాన యవిలంఘ్యముగన్.

33. దక్షిణ దిగ్ద్వారమ్మున్
రక్షింతురు చాప తోమరాద్యాయుధు లు
గ్రాక్షయ బలసంపన్నులు
రాక్షసు లొక లక్ష యనవరతమున్ రామా!

34. ఆయోధనచతురులు దీ
ప్తాయుధధరు లసురులు ప్రయుతాయుత సంఖ్యల్
గాయుదురు వారుణదిశ న
మేయపరాక్రములు పతికి మే లొనగూడన్.

35. చతురంగ బలంబులతో
దితిజభటావళి కుబేరదిశ గావన్ సు
స్థితమై యుండు ననిశమున్
బ్రతివీర భయంకరమయి న్యర్బుదసంఖ్యన్.

36. మీన గ్రాహ నివాస భ
యానకమై శైత్య దుస్స హాగాధ జలా
స్థానంబై కలదు పరిఖ
దానవపురికి సత తోర్మి తత ఘోషమునన్.

37. పురమధ్యంబున గరి రథ
తురంగ మారూఢులై యతుల విక్రమ శా
లురు సద్వంశభవ నిశా
చరు లుందు రగణితసంఖ్య సన్నద్ధులుగన్.

38. ఇది రావణు బలసంపద
చదివితి బలవ దసురుల నసంఖ్యాకముగన్
విదళించితి బ్రాకారము
బదఘట్టనముల నడచితి వారధి చయమున్.

39. పరిఖన్ బూడ్చితి గాల్చితి
పురమున్ గూల్చితి సమూలము విహారవనిన్
స్థిరసంకల్పుడ వై ని
ర్ధరింపు మిక జైత్రయాత్ర రావణవధకున్.

## యుద్ధయాత్ర

40. అని వాయు సుతుండు పలుక
నినసందను జూచి రాము డిట్లనె యనికిన్
జని విజయంబున్ గొనగా
ననువగు నభిజి న్ముహూర్త మారయ నిదియే.

41. ఈ దిన ముత్తరఫల్గుని
సాధనతార యగు నాకు సవితృవిభుండున్
రోదోంతరంబు సేరెడు
నాదిత్యతనుజ! చమూపయన మీ క్షణమే.

42. నడిపింపుము సైన్యము నీ
లుడు మున్నుగ గజ గవాక్షులున్ గవయుడు దో
డ్పడ మధు ఫల జల యుత మ
య్యెడు తెరువున ద్రుతగతిన్ గపీశ్వర! యిపుడే.

43. ప్లవగశ్రేష్ఠుడు ఋషభుం
డవార్యబలయుక్తుడు ధనదాత్మజుడు జనం
గ వలె నుభయపార్శ్వంబుల
దవిలి చమూ రక్షణోద్యత స్థిరబుద్ధిన్.

44. హను మద్భుజ పీఠారో
హణమున నేను జనుదెంతు ననుజన్ముడు ల
క్ష్మణు డంగదు భుజపీఠం
బున దోడుగ నడచి రా జమూ మధ్యమునన్.

45. కపిరాజ! ఛద్మ వేషులు
రిపుభటులు విషాక్తము బొనరించుటకున్ సి
ద్ధ పడుదు రధ్వస్థిత తీ
ర్థపాళి వే గనుల దెరు వరసి పోవ దగున్.

46. అనుచు న్మదల యొసంగ ని
ననందనుం డానతిచ్చె నగచర సైన్యం
బునకున్ బ్రస్థానము సే
య నపూర్వోత్సాహమున బయన మైరి కపుల్.

47. దుముకుచు గెంతుచు బర్విడు
చు మానులం బండ్లు ద్రుంపుచు న్మధువుల గ్రో
లి మదంబు పేర్మి హుంకా
రము ల్సలుపుచు జనె గ్రోతిరాణువ కడిమిన్.

48. నేనే హరింతు రావణు
బ్రాణంబు లటం చొకడన, వసుధాతనయన్
నేన కొనితెచ్చి యిచ్చెద
నా నిర్జరవైరి దున్మి యం చొక డనగన్.

49. ఇదిగో దుస్సహ మేరికి
మదీయ భుజశక్తి చూడు మా రావణు గ్రు
ద్దెద నెద వ్రయ్యగ నని బె
ట్టిదముగ నొక్కం డొకని నడిచె దృఢ ముష్టిన్.

50. ఆ రీతి నుద్భటమ్ముగ
బోలుచు జేరిరి ప్రగల్భవచనమ్ములు గ
ర్జారావమ్ములు గ్రిడలు
గేరింతలు సల్పుచు ధృతి గీశులు వార్ధిన్.

రావణు మంత్రాంగము

51. నయనానందము వని గూ
ల్చి యమిత సంఖ్యాక దనుజ సేన నడిచి ని
ర్భయముగ దనకున్ నీతి వ
చియించి పురి గాల్చి రామసేవకు డరుగన్.

52. సచివుల సేనాపతుల బి
లిచి సభకుంజేరి భయచలితుడై యా రా
త్రి చరపతి రావణుడు ల
జ్జచే నధోముఖుడగుచు బ్రసంగించె నిటుల్.

53. ఒక క్రోతి వచ్చి దుర్గము
త్రికూట పర్వత శిఖరి బురిం జొచ్చియు, జా
నకి వెదకి సుభద్రస్థితి
గకుత్స్థవిభు జేరె హృదయకంటక మగుచున్.

54. ప్రియ భామిని వార్త నెఱిం
గి యచిరకాలంబున బహుకీశుల తోడన్
స్వయముగ రాముడె వచ్చెడి
నో యుద్ధమున న జ్జయించి యుర్విజ గొనన్.

55. ఇపు డెద్ది సేయదగు బు
ద్ధి పాటవమ్మున బలుకుడు ధీరోచితమున్
నృపనీతి సమ్మతం బగు
నుపాయ మరి విజయ సాధ కోద్దామముగన్

56. జనులీ జగతి నరయగా
గనవత్తురు ము త్తెఱంగుగ వినుడు తల్ల
క్షణముల్ సెప్పెద, నుత్తము
లనంగ మధ్యములు మఱియు నధము లనంగన్.

57. ఎలమి సుఖ దుఃఖ సమభా
గు లగు హితులతో జతురులగు నమాత్యులతో
నలఘు సమాలోచనమున్
సలుపుచు దైవంబు నెడల నమ్మిక తోడన్

58. అనఘ ప్రయత్నమున్ సలు
పు నరుం డుత్తముడు, మధ్యముడు దానే యో
చన సేసి నిర్ణయించి జ
తన మారంభించు దైవతము నమ్మి మదిన్.

59. గుణదోషవిచారఁబున్
బొనర్పక యదృష్టయోగము న్నమ్మక పూ
నిన కార్యంబు విసర్జిం
చు నరుం డధముం డటం్రదు సూరిజనంబుల్.

60. అరయగ భేదాభి్రపా
యరహిత మై శాస్త్రదృష్టి నైక్యమ్ముగ ధీ
వర మైన మం్రతివర్గ ము
నరించు మం్రతాంగ మది యనఘ ము త్తమమున్.

61. నలువురు భిన్నాభి్రపా
యు లయ్యు గార్యావసరము యోచించుచు మం
్రతు లొనర్చు నేకనిర్ణయ
కలితం బది మధ్యమంబు గా జెప్ప బడున్.

62. ఏకాభి్రపాయంబని
లేక సచివులు దలకొక్క రీతిగ వాదా
వైకల్యము జూపగ గొఱ
గాకుండు నది యధమంబు గా గర్హిత మౌ.

63. మీ రెల్లరు బల వ్రదిపు
వీర విదారణ విధాన వేత్తలు సారో
దార మనీషాయత్తవి
చారు లపూర్వ ్రపతాప సాహస నిధులున్.

64. అని రావణుండు పృచ్ఛిం
ప ననియె సైన్యాధిపుండు బర్వతకాయుం
డనుపమబలుడు ప్రహస్తుడు
దనుజేశ్వర పాదకీలిత శిరస్కుండై.

65. నిను నీ వెఱుంగ బో కి
ట్లనెదవు ప్రభు! రాము డొక్క డల్పుడు నిన్నే
మొనరింపం జాలెడు స
ర్వ నిలింప కిరీట రత్న రంజిత చరణా!

66. మధుపాన మత్తులు నిరా
యుధు లై మన సైన్యనాథు లున్న యెడ జమూ
వధ సేసి పాఱిపోయిన
యధముడు గపి నెన్న నేల హనుమంతు నిటన్.

67. పంపుము న న్నీక్షణము ని
లింపచయము లద్ద మైన లిప్తల లోనన్
దెంపరి గపులన్ యమపురి
కంపెద నా రామలక్ష్మణాదులతోడన్.

68. అనినన్ బ్రహస్తు నట్ల బ
హునిశాచర సైన్య ముఖ్యు లుగ్రక్రోధం
బున బల్కిరి రామువధిం
ప నేన చాలుదును నన్నె పంపు మటంచున్.

69. ఘనబలుడు వజ్రహస్తుం
డనె శోణితసిక్తము పరిఘాయుధమున్ జే
తను బూని జయింతు సల
క్ష్మణు రాము హనుమ దలంప గా నేమిటికిన్.

70. ఇది కా దేని వినుము శ
త్రుదళన మొనరింప జెప్పుదు నుపాయ మొకం
డు ధరణి నుపాయశాలురె
కద! జయశీలు రని వినుతి గాంతు రరయగన్.

71. నరరూపంబులతో నే
గి రాక్షసుల మేము రాము గికురింతు మనే
క రథాశ్వసైన్యయుక్తిన్
భరతుం డరుదెంచు నంచు నమ్మ బలుకుచున్.

72. ఆలో నభోంతరంబున
వేలాదిగ గూడి దనుజవీరగణంబుల్
వాలాయుధులన్ గూల్తురు
శైలాశ్మ జ్వలన బాణ సంహతి చేతన్.

73. తమకుం దారె నశింతురు
సమూలముగ దాశరథులు సవితృసుతుడు సై
న్యముతో గూల, మనశ్శ
ల్యము బాసి సుఖింతు వీవు లంకానాథా!

74. అనినన్ ఘటశ్రవు సుతుం
దనియెన్ గుంభుడు గపిపతు లందఱితో ల
క్ష్మణసహితు రాము గూల్చెద
నను బంపుము దైత్యపతి! రణం బొనరింపన్.

75. అంతన్ వజ్రహనుండు దు
రంత క్రోధమున బల్కె నా రామున్ భ
క్షింతు ససైన్యమ్ముగ ని
శ్చింత సుఖింపు డిట మీరు చిత్తానుగతిన్.

76. అనిన ప్రహస్త రభస మే
ఘ నాదులును దుర్ముఖాతికాయ మహాకా
య నికుంభ మహాపార్శ్వా
ద్యనల్ప తేజులు సముద్యతాయుధు లగుచున్.

77. ఒక్కుమ్మడి లేచి నిలిచి
గ్రక్కున జని రాముతోడ గపిసైన్యంబున్
జక్కడతుము మే మెల్లర
ముక్క మిగిలి యంచు బల్కి రుగ్రస్వనులై.

విభీషణుడు రావణునకు హితము సెప్పుట

78. వా రందఱి జేతుల తో
వారించి విభీషణుండు వల్కె వినమితుం
డై రావణునకు దగవే
యీ రీతిం జేయను దనుజేశ్వర! మనకున్.

79. కన సామ దాన భేదము
లను త్రివిధోపాయము లభిలషితార్థము గూ
ర్పని యెడ గాలానుగుణము
గ నర్హము జతుర్థ మంత్రడు గార్యవిధిజ్ఞుల్.

80. దండ ప్రయోగమున క
ర్హుండె తలప రాఘవుడు? విరోధము దా బూ
నం డెన్నడు మనపై శాం
తుండు వినీతుడు రఘుకుల తోయధి శశియున్.

81. శ్రీసతి కీడై యాశ్రమ
వాసము గావించు రామభద్రుని భార్యన్
మోసము సేసి హరించితి
రా సీతన్ రాము డేమి యపకృతి సేసెన్?

82. ఖరదూషణాదులం గూ
ల్చె రాఘవుం డందు రేమొ! సేయం దగు నె
వ్వారి కైన నాత్మరక్షణ
ఖరుండు దానై చనండె కాకుత్స్థునిపై.

83. రామ పరాక్రమ తత్త్వం
బేమియు నెఱుగక శలభము లేత్తెర తోడన్
ధూమధ్వజు పై జనుగతి
రాముని పై కేగ దలతురా! దుర్మదులై.

54. అకయుగ విషయాసక్తులు
విరక్తులు ప్రమత్తులు శిశు వృద్ధులును, బర
సత్రవైరులు విధిహతులౌ
నరేంద్రుడు లెడ దండనీతి నయముగ జెల్లున్.

55. రాముడు జితేంద్రియుండు మ
హామహిమోదారుడున్ దయాపరుడు జగ
త్క్షేమంకరుండు సుగుణో
ద్దాముడు జయశీలు డఖిలధర్మవిదుండున్.

56. ఊహింప దరమె రాఘవు
మాహాత్మ్యము విక్రమంబు, మర్కటు డొక డా
వైహాయసపథి యై పుర
దాహము సేయు టెపు డైన దలపం బడెనే?

57. పరసతి హరించుట యశో
హరంబు దుష్టంబు దుర్ణయంబున్ దుఃఖా
కర మాయుఃక్షయకర మా
ధరాజ భయహేతు వయ్యె దనుజుల కెల్లన్.

58. ధరణిజ నర్పింపం దగు
శరద్రవి మరీచి జాల సన్నిభ శరముల్
బరగించి రాముడు భవ
చ్ఛిరముల్ గూల్పకయ మున్న దితిజాధిపతీ!

89. హరియూధంబులు లంకా
పురి జొచ్చి కలంచి ధ్వంస మొనరింపక ము
న్న రయమ్మున సీత నొసగు
టరయగ మే లగు ప్రభు! యసురావళి కెల్లన్.

90. రామకరశరాసన ము
క్తామోఘ పతంగ పన్నగమ్ములు గములై
తామస రాక్షస భేక
స్తోమంబు గ్రసింప కుండ దొందర బడుమీ!

91. వినమితగాత్రుడ వై రా
మ నరేంద్రునకున్ క్షమాకుమారిక నర్పిం
పని చో ఘోరవినాశము
దనుజాళికి దాపురించు దథ్యము కాగన్.

92 రాజవు జ్యేష్ఠభ్రాతవు
పూజార్హుండవు మహితతపోనిష్ఠుడవున్
దేజోధనుడవు హిత మీ
యోజం బలికితి సుహృజ్జనోచితరీతిన్

93. కోపము నరునకు దుర్భర
తాపావహమగు నశించు ధర్మార్థంబుల్
గోపము ద్యజించి ధర్మము
జేపట్టుము కీర్తి యెసగు జేకురు సుఖముల్.

94. అనుకంపన్ జూనుము రా
మునకున్ జనకజ నొసంగుము సపుత్ర సుహృ
జ్జనముగ జీవింతము గా
కనుచు విభీషణుడు మ్రొక్కె నాశరపతికిన్.

95. నయమును హితంబు దనుజా
న్వయ సుఖజీవన వివర్ధనంబుల్ మది బూ
ని యనుజు డట్లాడంగ వి
నియు బదులాడక తొలగిచనె దశాస్యు డటన్.

96. మఱునా డుషోదయానం
తరమున ధర్మార్థనిశ్చితస్వాంతుండై
యరిగెన్ విభీషణుడు దై
త్యరాజనిలయమ్మున కుచితాలంకృతి తోన్.

97. గిరిశృంగోన్నతము మహా
పురుషపరిగ్రహ మమాత్య ముఖ్యావృతమున్
బరమాయుధ ధర బహ్వా
ప్త రాక్షస జనైక నిత్య పరిరక్షితమున్.

98. సువిభక్తమహాకక్ష్యము
సువర్ణమణిభూషణాభిశోభితమున్ రూ
పవిశేషాధఃకృత స్వ
ర్భువన ప్రమదా విలాసము మనోజ్ఞంబున్.

99. కులగజ నిశ్వాస వ్యా
కులీకృతానిలము శంఖఘోషారణితం
బు లసత్తూర్యనినాదా
కలితము సేరం జని దశకంఠు భవనమున్.

100. రవియభ్రపథంబున్ జొ
చ్చు విధంబున జొచ్చి భూమిసుర వేదోక్తి
ప్రవచన పఠన క్రతు మం
త్ర విశేషాశీర్వచో విధాన మరయుచున్.

101. అంతర్గృహస్థిత మహా
కాంత్యుజ్జ్వల సింహపీఠికాధిష్ఠితు నే
కాంతసచివావృతు సము
ద్ధాంతు దశముఖుం గని సముదాచారమునన్-

102. జయ జయ నాదం బొనరిం
చి యగ్రజహితానుకూల చింతారతుడై
నయము వినయంబు గదుర వ
చియించెను విభీషణుం డుచితకార్యంబున్.

103. అన్నా దశముఖ! వినుమిటు
లెన్నడు నీ వా తరణికులేశ్వరు భార్యన్
సన్నుత పతివ్రత పుడమి
కన్నియ నయవంచకంబు గా దెచ్చితివో-

104. ఆనాటినుండి మన లం
కానగరం బెల్లచోట్ల గనబడు చుండెన్
నానావిధముగ దుశ్శకు
నానీకము పౌరతతి భయాకుల మయ్యెన్.

105. చెలగు నుభయసంధ్యల న
క్కలకూతలు కర్ణభేదకమ్ముగ గృధ్రం
బులు గుములు గుములుఁగ బ్రవ
ర్తిలు నే ప్రొద్దును విమాన గృహ శిఖరములన్.

106. కన్నుల నీ రొలికించుచు
నున్న వవనతంబు లై హయోత్తమము లవి
చ్ఛిన్నముగ గరులు గురియవు
మున్నుం బలె మదజలంబు పోడిమితోడన్.

107. హోమాగ్ని ప్రజ్వరిల్లదు
ధూమమె కాని నిరతంబు దోచెడు బవనాం
ధోమండల మగ్నిగృహా
రామంబుల గడు భయంక రాకారములన్.

108. శునకము లాదిగ మాంసా
శను లౌ క్రూర మృగ వితతి జన నిలయ పురాం
గణముల మ్రోయుచు నున్న వ
శనిధ్వనుల, వ్రాలు వాయసము లిండ్ల పయిన్.

109. సుమనోహరం బశోక వ
నము ధ్వంసం బైనది మరణము పొల్పడె నీ
కౌమరుం డక్షుడు నిర్ద
గ్ధమయ్యె బుర మీ కతమున గంటివె యన్నా!

110. ఒక చిన్న క్రోతి సేసిన
దె కడుంగడు భీప్రదముగ దెల్లము కాగా
నిక రామబాణముల లం
క కేది గతి యౌనా! దలపగ మెయి వడకెడున్.

111. ఈ యపశకునమ్ములకున్
బ్రాయశ్చిత్తముగ నా పరాత్పరునకు సీ
తాయోష నొసంగం దగు
నా యూహ కొలంది చెప్పినాడ దశాస్యా!

112. ఇవియె శుభం బనుచు నెఱుం
గుదు రెల్లరు గాని నీవు క్రోధవశుడ వ
య్యెద వని చెప్పరు నీకు సు
హృదుండ దమ్ముండ నగుట యేనె వచింతున్.

113. అరయగ గామము క్రోధము
నరకద్వారంబులు సుమి! నశియించున్ సో
దర! లోభకారణమ్ముగ
బరమోదారగుణవైభవం బది యెల్లన్.

114. యోచింపు మిద్ది నీకుం
దోచిన తెఱగున గులంబు దుర్దశకుం బా
లై చెడకుండెడు నట్లుగ
దీచతురత సేయుము నను దెగడకుము ప్రభూ!

115. అనినన్ రోషంబున రా
వణుం డనియె నేమి భయము వచ్చెన్ లంకే
శున కిప్డు నీదు హిత మె
వ్వనికిం గావలె నశుభము పల్కకు మింకన్.

116. అనుచున్ దృక్తాసనుడై
చనె జవసత్త్వాఢ్య తురగ సజ్జిత మౌ కాం
చనరథమున బౌర జన జ
య నినాదము లంబర మెగయగ గొల్వునకున్.

రావణుడు మంత్రుల నుపాయంబడుగుట

117. సభ జేరి రావణుడు బు
రభద్రత పటిష్ఠ మై వరల జేయ జమూ
విభు నాజ్ఞ సేసి పిమ్మట
సభాసదుల తోడ దా బ్రసంగించె నిటుల్.

118. జయలబ్ధి నంద గంటిన్
బ్రియంబున సహాయము నెఱపి భవాదృశ దు
ర్జయ యోధులు తోడ్పడ నె
ల్లయు గార్యంబుల జగంబుల యశంబొదవెన్.

119. అరయగ బ్రియాప్రియములున్
మఱి సుఖదుఃఖములు గష్టనష్టంబుల తీ
రెఱుగం గల రీరు లస
చ్చరితులు ధర్మార్థకామసంకట మైనన్.

120. ఆనాడె చెప్ప వలసెం
గానీ నా తమ్ము డసమ కదన విధానా
నూన ప్రజ్ఞుడు వచ్చెన్
దా నేడె ఘటశ్రవుండు త్యక్తసుషుప్తిన్

121. పతితో వనవాసము సే
యు తరుణి సీత గికురించి యొంటిగ నున్నన్
గృశకయతివేషమున దె
చ్చితి దుస్సహ కామ దగ్ధ చిత్తము తోడన్.

122. కన్నెత్తి చూడ దా యమ
న న్నెప్పుడు, భర్తృచింతనము వీడక శౌ
ర్యోన్నతుడు వచ్చి రాముడె
తన్నుం గొను నన్న యాశ దగిలిన బుద్ధిన్.

123. శరదిందునిభానన బం
గరుబొమ్మయు బృథునితంబ కన దర్చిష్మ
త్తరణి ప్రభా కలిత దే
హ, రమ్య, జానకి మయకృత యగు మాయయగున్.

124. గడు వడుగంగ నొసంగితి
విడువక వేధించు చుండె విరితూపుల గా
ము డనారతంబు నన్ను
న్నుడమి జయించియు ననంగు నోర్వం జాలన్.

125. తన భార్యన్ దొంగిలితె
చ్చి నా ననుచు గ్రోధ మూని చేయంగల వీ
ర నఖాయుధ వాహిని తో
డ నబ్ధి దరి జేరె రాము డాహవమునకున్.

126. కేవలము క్రోతి మూకల
తో వననిధి దాట గల్గి దుర మొనరింపం
గా వచ్చు టేమి రాముడు
రావణు పురి కంచు దలపరాదు వినుండీ.

127. ఏనాటి కేది సంభవ
మో నేర్వ దరంబె? క్రోతి యొక్కండె గదా
యానాడు వచ్చినది మన
పై నబ్ధిం దాటి యాహవం బొనరింపన్.

128. సురపతి గెల్చిన నాకున్
నరు డన నేమి భయము? కదనంబున రామున్
దిరముగ గెల్చెద మీ రె
ల్లరు దోడ్పడ దోర్బలంబు బ్రస్తుతి కెక్కన్.

129. ఐనను యోచన సేయుడు
జానకి నా రాఘవున కొసంగక రవిపు
త్రానీకిని దాశరథుల
తో నిర్జించు వెర వొండు దుర్వారముగన్.

130. మదనజ్వరపీడితు డై
న దనుజనాథు పరిదేవనంబు న్వినగా
నుదితక్రోధవశుండై
బదు లాడె ఘటశ్రవుండు భావస్ఫూర్తిన్.

కుంభకర్ణుడు రావణు బోధించుట

131. సుతులున్ దమ్ము లమాత్యులు
పృతనాధీశులు సుహృ ద్వరేణ్యు లనేకుల్
మతిమంతు లుండ నీ యి
చ్ఛ తెఱంగున జేసి తప్పు చాపల్యమునన్.

132. ఇపు డాపద పొడసూపగ
నుపాయముం జెప్ప గోరుచుంటివి మము దై
త్యపతీ! కార్యము మున్నె తె
లుప జేయమె త్వద్ధితానురూపము గాగన్.

133. విషమిశ్రితామిషము సుమి
విషయసుఖాపేక్ష నీవు ప్రియభావమునన్
మిషసేసి తెచ్చినయది క
లుషయుతము బరసతి దొంగిలుట నీచంబున్.

134. చేయదగునేది? యేయది
సేయం దగ దంచు మున్నె చింతింప వలెన్
ధీయుతి, మది దోచిన దే
దో యొనరించి వగవ ఫల ముండునె పిదపన్.

135. అవిచారమతిన్ వర్తిం
చి విషమఫలయోగ మొదవ జింతించు నరుం
డవివేకి సుకరముగ న
య్యవిచారపరుం జయింతు రరివర్గంబుల్.

136. అపచారం బొనరించితి
వి పరాంగన దొంగిలించి విస్మృత నృప ధ
ర్మపథంబున నైనను నీ
దుపక్షమె వహింతు రాముతోడి రణమునన్.

137. ఏకోదరుండ గావున
నా కియ్యదె ధర్మమగు రణాంగణమున ను
గ్రాకారుడ నై మ్రింగెద
నా కపిసైన్యంబు నెల్ల నంతకు లీలన్.

138. ఒక బాణంబును నావం
కకున్ బ్రయోగించి వే యొక శరము జ్యావ
ల్లికి గూర్చు నంత లోనన్
గకుత్స్థవిభు మ్రింగివైతు గలత బడకుమీ!

139. రిపులు నశింప నఖిల రా
జ్యపాలనమ్ము నెరపుము స్వస్థుడవై భో
గపరవశుండవు నై ధా
త్రిపుత్రి చిరకాలము ద్వదధీనము గాగన్.

140. నరసురదుర్జయుడవు నీ
వరాతివిజయుండ నేను హరివీరులతో
దురమున గెలుపో ముక్తియొ
వరంబు నీ తోడిదె యనుభవ మౌ నాకున్.

మహాపార్శ్వుడు రావణునకు ధైర్యము చెప్పుట

141. అని పల్కు కుంభకర్ణు వ
చనంబుల నిగూఢ ధర్మ సార మెఱుగ జా
లని రావణుండు రక్తన
యను డయ్యె, బతి కిటులనె మహాపార్శ్వుడున్.

142. క్రూరవ్యాళాచరిత మ
హారణ్యము జొచ్చి కాననైన మధువులన్
దోరమ్ముగ గ్రోలక వెన్
బాఱు నరుడు మూర్ఖుడు సుమి బలభిద్వైరీ!

143. వీరుండవు శాత్రవ సం
హారకుడ వఖిలజగన్నియంతవు గలడే
శూరుడు నియామకుడు నీ
కారయ వేఱొకడు ముజ్జగంబుల లోనన్.

144. రిపుజాలంబున్ దలద
న్ని పూర్ణకాముడవు గమ్ము నీరేజదళా
క్షి ప్రథుజఘనభారాలస
విపులాత్మజ నాక్రమించి ప్రియభోగములన్.

145. రాముం డడ్డము వచ్చిన
మే ముంటిమి కుంభకర్ణ మేఘధ్వనులున్
సౌమిత్రి తోడ గూల్తుము
భూమిసుత ననుభవింపుము యథేచ్ఛ నికన్.

**రావణుడు తనకు బ్రహ్మ యిచ్చిన శాపమును దెల్పుట**

146. అనినన్ మెప్పున గని రా
వణుం డనె వచింతు విను మ్మ పరమరహస్యం
బు నొకండు, పుంజికస్థల
యను నచ్చరకాంత యొకతె యగ్నిశిఖయొ నా-

147. కమలజు సన్నిధికిం జను
సమయమ్మున గని భయవివశత్వంబున న
న్ను మొఱంగి చన బలిమి వ
స్త్రము లూడ్చి రమించితి స్మరతాపవశుడనై.

148. బలవద్రతిచే లోలిత
నళినిం బలె వచ్చు నంగనం గని ధాత్రం
దలుకన్ శపించె నతులన్
బలాత్కరించిన దల లిక పగులు నటంచున్.

149. విధిశాపభయము చేతన్
విధువదన బలాత్కరింప విముఖుడ నౌదున్
సుధ తోచియు దుర్గమము వి
షధరశిరోలంకృతంబు సన్మణి వోలెన్.

150. వరుణేంద్రాగ్ని ప్రముఖా
మర నాయకులం జయించి మానిత లంకా
పుర దాసుల జేసిన నా
కు రాము డొకలెక్కయె పలుకులు వే యేలా?

151. గిరికందరసుప్తంబు మృ
గరా జనగ మృత్యువె యనగా దగు నన్నున్
బరమక్రోధున్ రాఘవు
డెఱుంగ కెదిరింప వచ్చు నేనియు వినుమీ!

152. మగటిమి జూపి మహిం గూ
ల్పగల, ద్విజిహ్వముల బోని బాణప్రతతిన్
మొగిలు గుఱియు గతి నేను బ
రగించు టెఱుగడు నరుండు రాఘవు డహహా!

**విభీషణుడు మఱల రావణునకు హితము సెప్పుట**

153. అనినన్ విభీషణుం డి
ట్లనె నెదిరి బలంబు మనబలం బెఱుగక యి
ట్లనుచుంటిరి రామునితో
నని యన బూటంతు లాడు టది కాదు సుడీ!

154. వినుడు వచింతు మహాపా
ర్శ్వ నికుంభ ఘటక్రశ వేంద్రజయులున్ దుది రా
వణు దేని గెల్వ జాలరు
రణాంగణమ్మున మహాత్ము రామప్రభువున్.

155. ఉలుక ప్రగల్భము లాడక
ధరణీజ నొసంగు దేగి దాశరథికి ద
చ్ఛరములు మీదు శిరము లు
త్తరింపకయ మున్న దత్పదసమాశ్రయులై.

156. అరయగ నధార్మికుడు సుర
పురవాసము సేతయు బ్లవముం గొనకయ సా
గరము దరింపం జాలుట
యు రాము గెల్వం గలుగుటయు నసాధ్యములౌ.

157. ఉగ్ర స్వభావుడైన ద
శగ్రీవుడు నేడు రాక్షస వినాశన కా
ర్యాగ్రేసరు డయ్యె హిత
ప్రగ్రహమున సచివు లైన వారింప రాకో!

158. అవనీతనయామోహా
ర్ణవమ్మునం గ్రుంగు దనుజనాథు మహోత్సా
హవచోగతి ద్రోతురె రా
ఘవ బడబానల ముఖంబుగా సైన్యపతుల్.

159. హిత మహితంబును స్వ పర బ
లి తారతమ్యంబులు గురు లఘు భేదములున్
క్షితిజనరాజక్షేమ ము
చి తానుచితములును సి ద్ధ్యసిద్ధుల నెల్లన్.

160. చింతించి సమగ్రమ్ముగ
నెంతయు ధర్మ సుఖ భోగ వృద్ధ్యర్థము భూ
కాంతునకున్ భయరహిత
స్వాంతంబున జెప్ప వలయు సచివుడు నీతిన్.

161. అనినన్ గోపంబున మే
ఘనాథు డనియె జనక! దశకంధర! మన యీ
యనఘాన్వయంబున విభీ
షణు డెట్లు జనించె భీరుజన తాగ్రణియై.

162. నరు డొక్కడసి దుర్వాదుడు
బరాక్రమోపేతుడున్ బ్రభావయుతుండున్
బరదుర్జయుడంచును నె
న్నారీతులం బొగడు వంది యో మాగధుడో!

163. ఓయి విభీషణ! మమ్మీ
లా యీరీతి భయపెట్ట నాశింతువు దై
తేయనికాయాగ్రణినై
ఆయోధనకర్కశుండ నగు బెఱుగ వాకో!

164. దిక్కరి కుంభంబులు బలు
వ్రక్కలు సేసి సురనాథు బదసేవకు గా
స్రుక్కించితి దైత్యపతుల
జక్కడచితి ద్రుంప లేనె సామాన్యనరున్.

165. అనిన వ్యథాపీడితుడై
యనియె విభీషణుడు పుత్రకా! బాలుడవున్
గుణదోషవిచారము సే
యనోపని యకృతమతివి దురాగ్రహి వరయన్.

166. నీ కేల రాజసభ గా
ర్యాకార్యవివేచనంబు రాజున కహితం
బౌ కరణి బ్రసంగించుట
నీకుం బితృసౌఖ్యము వరణీయము కాదే!

167. అవినీతి పథంబున వా
గ్వ్యవహారము సల్పు నీత డాత్మజరూపం
బు వహించు నమిత్రుడు సు
మ్ము వధింపం దగదె యిట్టి ముష్కరు నన్నా!

168. అపమార్గు లధర్ములు భూ
మిపాల కాహితులు వీరు మే ల్గూర్పని వీ
రి పలుకులు ద్రోసిపుచ్చి య
నపాయముగ నిమ్ము రామునకు వైదేహిన్.

169. యశము లభించు సుఖంబుల్
వశమున నుండంగ నాయు వభివృద్ధి యగున్
నిశిచరకుల మభ్యున్నత
దశ సెందు విబుధులు దృప్తి దనరారునెడన్.

**రావణుడు విభీషణుని బరిత్యజించుట**

170. అనినన్ గుపితుండై రా
వణు డీరీతి ననియె నతిపరుషముగ, విభీ
షణ! యెఱుగుదు నీ లోకం
బున దాయాది స్వభావము సమస్తంబున్

171. వసియింప వచ్చు గుపిత వి
ష సర్పములతోడ జెల్మి సల్పం దగు శ
త్రుసమూహమ్ములతో వి
శ్వసించి దరి జేర్పరాదు జ్ఞాతుల నెపుడున్.

172. మోదంబు నొందుదురు దా
యాదులు దమవారి కెగ్గులైనన్ సుఖ కీ
ర్త్యాదుల నున్నతి వరలం
గా దుఃఖంబున నవమతి గావింతు రొగిన్.

173. భావించి చూడ గడు మా
యావు లసూయాపరులు భయంకరులున్ దు
ర్భావులు ప్రచ్ఛన్నహృదయు
లై వర్తింతురు జగంబులం దాయాదుల్.

174. నేను సుఖించుట యోర్వం
గా నోపక యిట్టు లీవు గపటమ్ముగ నె
న్నో నీతులు వల్లింతువు
దానవకీర్తిహరణాయతదురుద్యోగీ!

175. అష్టైశ్వర్యము లిచ్చి య
భీష్ట సుఖము భోగ మిచ్చి యిమ్మగ జూడన్
దుష్టాత్మ! నాదు హృదయా
భీష్టవ్యతిరేకి వైతివి నయవిహీనా!

176. అమితైశ్వర్యసుఖానుభ
వము నాకడ బడసి యిప్డు పరుజేరగ సి
ద్ధమగుదు మధువానిన మధు
పము సుమము బరిత్యజించు పగిదిం దులువా!

177. నినడింతురు బాహ్యమ్మున
కనారతహితకరు లట్టు లరయగ సుంతై
నను జేయ రురిమియున్ గురి
యని శరదభ్రరము లట్టు లై దుష్టసఖుల్.

178. తమ్ముడవు గాన బ్రదికితి
విమ్మెయి నాడియు సహింప నిట్టి దురాలా
పమ్ముల బో మ్మెందేని బు
రమ్మున్ వీడి, రజనీచరకులద్రోహీ!

179. పురి నుండి చావ నేటికి
ద్వర నేగుము నీదు జీవితమ్మున కెచటన్
బరమార్థమ్ము గలదొ దు
శ్చరితా! యచ్చోటికె పరశౌర్యవిభీతా!

విభీషణుడు రావణుని వీడి రాముని శరణు జొచ్చుట

180. నను వీడి పొ మ్మనెడు న
న్నను రోసి విభీషణుండు నల్వు రమాత్యుల్
వెనుకొన నభమ్మున కెగసి
ప్రణామము ల్సేసి యిట్లు వచియించె నొగిన్.

181. ఉచి తానుచితమ్ము లరయ
క చిత్తము న్నిగ్రహింపక యథేచ్ఛ జరిం
చుచు నా పలుకు హితంబున్
విచార మొనరింప కిట్లు నిందింతు ననున్.

182. అగ్రజుడవు గావున నీ
వాగ్రహమున బలుక బాధ నందను శ్రీరా
మోగ్రశరాహతి నీదు ద
శగ్రీవములున్ జెడు నని సంతాపింతున్.

183. మీ రొనరించు నధర్మము
కారణముగ దైత్యు లెల్ల గాలుని ప్రోలున్
జేరగ నుంట భరింప
న్నేరక వచియింతు నిట్లు నీకు హితంబున్.

184. తలపగ బ్రియవాదులు శ్రో
తలు గోకొల్లలు లభింత్రు ధారుణి హితవా
దులు శ్రోత లిర్వురన్ జే
 రి లభించు టసాధ్యము విధికృత మే మందున్?

185. నా మాట రుచింపక న
న్నీమెయి బొమ్మంటి విష్ట యేగెద భవది
చ్ఛామార్గమున బ్రదుకు వెర
వే మైనను జింతసేయు మే కాంతమునన్.

186. మఱియొక్కమాట సెప్పెద
బరుడు పరాత్పరుడు రామభద్రుం డతడే
శరణం బనుము చెడకు మీ
దురహంకారులు వచించు దుర్భాషలచే.

187. చిత్తస్థైర్యరహితులు
న్మత్తిన మిత్తి కెఱగా జనెడి వారును, ధీ
సత్తము లాడు హితంబున్
హత్తింపరు మదికి నీవు న ట్టైతి వయో!

188. స్వస్తి యసురేంద్ర! రావణ!
స్వస్తి యని విభీషణుండు సచివుల తోడన్
నిస్తులధర్ముడు చనె న
న్నే స్తంబు బరిత్యజించి నీతి పథమునన్.

189. అగణితదేహప్రభలన్
గగనంబు వెలుంగ సచివకలితుండై వ
చ్చు గదాధరు రాక్షసు జూ
చి గభస్తితనూజు డాత్మ జింతించి వెసన్.

190. అదె యెవ్వడో నల్వురగూ
డి దైవమార్గమున వచ్చెడిం గంటిరె! య
స్మదనీకినీబలం బెఱు
గ దశాస్యుం డంపె నేమొ కపివరులారా!

191. అనినన్ విని వారును మా
కనుజ్ఞ నిడు మిప్పుడ చని యంతకు జేర
న్చనుతుము దద్దనుజాధము
లనంచు నుత్సాహపూర్ణులై పలుకు నెడన్.

192. విన వచ్చె నభ్రమున భా
షణ మిట్లని, రావణు ననుజన్ముడను విభీ
షణు డను వాడ న్వచ్చితి
ననఘాత్ముడు రాము నాశ్రయమ్మున కర్థిన్.

193. ధరణీతనూజ గౌరవ
పురస్సరమ్ముగ నొసంగుము రఘువిభున కం
చు రహిన్ దెల్ప దశముఖుడు
పురి వెడలించె నను క్రోధపూరితమతియై.

194. ఎఱిగింపరె రావణసో
దరుడు విభీషణుడు వచ్చె ద్వన్మహిత శ్రీ
చరణాశ్రయమున కని దా
శరథికి, మ్రొక్కెద నిదె, కపిసత్తము లారా!

195. ఆ వచనమ్ము లిన్ని సు
గ్రీవుడు హనుమత్ప్రభృతిహరీశులు దో రా
వే వేగం జని రాఘవ
భూపిభునకు విన్నవించె ముదల యొసంగన్.

196. పగవాని సోదరుడు వ
చ్చె గపీశ్వరులార! నాదు చెల్మికి శరణం
చు, గయికొనుటొ పొమ్మనుటో
తగ వెద్దియొ తెల్పు డీరు ధార్మికమతులై.

197. అని శ్రీరాము డడుగ రా
జనీతి బరికించి చూడ శాత్రవు బంధుం
డును శాత్రవుండె యగు బొ
మ్మనుటయె మే లనియె నొక యమాత్యుండు వెసన్.

198. మనవేగులు లాఘవమున
జని యరయ న్వలయు రాక్షస వచో ముఖ భా
వ నయన చాలన భంగుల
మనోగతం బనియె నొక్క మంత్రి స్ఫుటముగన్.

199. అన్ననె త్యజించి వచ్చుట
నెన్నంగ గృతఘ్నుడె యగు సీతండు ప్రభూ!
మున్నుగ బరీక్షసేసి న
యోన్నతు డగునేని గొనుట యుక్తం బరయన్.

200. కపటోపాయము చేత రి
పు పక్షముం జొచ్చి భేదములు గల్గంజే
సి పిదప దరి యొదవంగ ద
లపెట్టుదు రపకృతి నమ్మరా దీదృశులన్.

201. భ్రాతృపరిత్యాగము ని
ర్హేతుకముగ దేశకాలదృష్టి ననుచితం
బై తోచు వీనిరాకయు
సీత దసురు గుప్తచారు డే కానోపున్.

202. వీనిం బట్టి వధించుట
యే నిజ మారయ సమయవిహితకృత్య మగున్
గాన దగు వారి నంపం
గా ననుమతి యిడు మటం చొకం డనియె కృధన్.

203. అనుచున్ మైం దాంగద శర
భ నభోమణి తనయ జాంబ వత్ప్రముఖుల్ దో
చిన తెఱగు గాగ బల్కన్
హనుమం డనె నిట్లు రామునకు సాంజలియై.

204. నీ యెఱుగని దేది ప్రభూ!
యీ యఖిల జగంబుల హిత మెయ్యది ధర్మం
బేయది న్యాయా న్యాయము
లేయవి కార్యం బకార్య మేయది రామా!

205. నీకుం జెప్ప వలంతిని
గా కున్నను జెప్పవలసె గారుణ్యరసా
లోకనముల నీ వడుగగ
గైకోగదె! రామచంద్ర! కాకుత్స్థమణీ!

206. ఇత డన్నతోడి భేదము
కతమున నరుదెంచు టొప్పు గా గనబడు, సం
స్తుత ధర్మబుద్ధి యగు పెజి
గితి నే నా నాడు లంక కేగిన వేళన్.

207. సీతమ్మ తల్లి పలికెన్
నాతోడ ననల విభీష ణాత్మజ సెప్పెన్
నీతులు దశకంఠున కని
యాతడు విన దయ్యె మోహితాత్ముం డనియున్.

208. ఖరదూషణాదు లెల్లర
దురమున నీ వొక్క_రుండ దున్మట, వాలిన్
హరియించి సూర్యపుత్రున్
ధరణీపతి జేయుటయు నిత డెఱుగ బోలున్.

209. అలుకన్ వహించి నీవా
పలలాశను గూల్ప భూరి వానర సైన్య
మ్ములతో సాగర తీర
స్థలికిన్ జనుదెంచుటయు నిత డెఱిగి యుండున్.

210. తమ యన్న సేసిన య కృ
త్యము ధర్మాకృతివి నీదు నవిషహ్య పరా
క్రమ మాహాత్మ్యమ్ము లెఱిగి
యమలమతిన్ వచ్చి యుండు నాశ్రయవాంఛన్.

211. తలపంగ నింక నొక్కటి
గల దింధు దశాస్యు నీవు గలన దునిమి య
ర్మ్యలి రాజ్యము దన కీయం
గల వం చాశ పడె నేమొ కరుణావార్ధీ!

312. కనరాదు మర్మ మింతై
నను జేష్టా రూప భాష ణాదుల యందున్
జనుదెంచునె నిర్భీతిగ
మన చెంతకు వీడు దుష్టమతి యే యైనన్.

213. నిను నమ్మి వచ్చిన విభీ
షణు జేకొని యాదరించి సఫలు నొనర్పం
జను నీకు మిత్రలాభం
బున జయ మగు నంచు వాయుపుత్రుం డనగన్.

214. ఇననంద నాదులు వచిం
చిన యర్థమ్ముల మది సునిశితముగ బరిశీ
లన సేసి రాఘవుం డనె
దననిశ్చయ మీ విధముగ ధర్మైకమతిన్.

రాముడు విభీషణున కభయ మిచ్చుట

215. పరిశీలించితి మీరం
దఱు నియ్యెడ దేశ కాల ధర్మార్థ పుర
స్సరముగ వచించి నట్టిది
సురవైరి విదళన కార్య చోదిత మతులై.

216. ముద మయ్యె గాని విను, డా
పద బాపు మటంచు గోరి వచ్చిన వానిన్
సదయాత్మ గైకొను టె శా
స్త్రధర్మముగ జెప్పరె నయ తత్త్వార్థ విదుల్.

217. శరణార్థుల దీనాత్ముల
గరుణామతి నాదరించి కాపాడుట యే
వరణీయధర్మ మెన్నగ
ధర సత్యపరాక్రము డగు ధరణీపతికిన్.

218. శరణాగతరక్షకు డను
బిరుదంబు వహించి మేటివీరుడు గాను
ర్వర వినుతి కెక్క యెట్లీ
శరణార్థిన్ బో మ్మని యయశంబున్ గొందున్?

219. మరణభయార్తుం డగుచున్
శరణము గోరి యరుదెంచు శాత్రవుఁ డైనన్
బరిరక్షింపవలయు నా
త్మరహస్యవిదుం డఘం బొందవు దద్వికృతిన్.

220. శరణార్థి బ్రోవ వలయున్
మరణాంతకమైన నట్లొనర్ప కుపేక్షా
పరు డయ్యేనేని తానే
భరింప గా నగు దదీయ పాపము లెల్లన్.

221. అమలం బగు వ్రత మూనితి
"త్వమేవ శరణం మమ" యను వా డెవ్వని నే
ని ముదంబున గొని సర్వభ
య ముక్తు నొనరించి ప్రోతు ననిశం బంచున్.

222. కొనిరం డి య్యెడకు విభీ
షణుండె కాదు జనకాత్మజ హరించిన రా
వణు డైనన్ శరణము గో
రె నేని యభయం బొసంగి ప్రీతిన్ బ్రోతున్.

223. అభయప్రదానము న్విని
విభీషణుండు దివినుండి పృథ్వీస్థలికిన్
రభసమున డిగ్గి రామ
ప్రభు పాదాబ్జమ్ముల కతిభక్తి ప్రణతుడై.

224. వినయమ్మున నిట్లనె ప్రభు!
దనుజేశ్వరుడు దశకంఠు దమ్ముడను విభీ
షణు డనగ బరగుదున్ రా
వణు డవమానించె గ్రోధవశుడై నన్నున్.

225. ఆరు దెంచితి సర్వజగ
చ్ఛరణ్యు ని న్నాశ్రయింప ధనధాన్యములున్
బురమును దారసుతాదుల
బరిత్యజించి రఘురామ! పావన నామా!

226. శరణము నాకు భవచ్ఛ్రీ
చరణమ్ములె నాదు సర్వసౌఖ్యములున్ రా
జ్యరమయు బ్రాణంబున్ దా
శరథీ! భవదధీనములు విచారింపంగన్.

రాముడు విభీషణుని లంక కభిషిక్తు జేయుట

227. అనినన్ సుమధుర భాషణ
మున నూఱట గల్గ జేసి పురుషప్రవరుం
డనె శ్రీరాఘవు డనురా
గ నిభృత వీక్షణము లెసగ గా నాతనికిన్.

228. తెలుపుము లంకానాథుని
బలసంపద యేమొ సైన్యపతుల విశేషం
బులు తక్కుంగల యోధుల
కలరూపము లెట్టివియొ సఖా! మా కనినన్.

229. దశకంఠానుజు డిట్లనె
దశరథనందన! వచింతు దశముఖుడు చతు
ర్దశభువనమ్ముల దామస
వశుడై పీడించు బ్రహ్మ వరముల బలిమిన్.

230. సుర యక్ష కిన్న రోరగ
వర గంధ ర్వాసురుల కవధ్యుడు గాగన్
వర మిచ్చె బ్రహ్మ వానికి
బెఱవారల లెక్క గొనడు వీఱిడి యగుచున్.

231. ఆ రావణు పుత్రుడు మే
ఘారవు డింద్రవిజయుండు కదనాంగణ హో
మారాధిత హుతవాహ స
మారబ్ధ బలాతిరేక మథిత ద్విషదున్.

232. పొలికలను జొచ్చు గోధాం
గుళిత్రమున్ సుదృఢ దీర్ఘకోదండము ని
స్తుల దుర్భేద్య కవచమున్
వల నొప్ప ధరించి రాఘవా! వా డరయన్.

233. సురనాథ ప్రతిముడు సం
గరం బొనర్ప జను గుంభకర్ణుడు మత్త
ద్విరదం బనగ దశముఖా
వరజుడు నా కగ్రజుండు వాడు రఘువిభూ!

234\. రణకుశలుండు ప్రహస్తుం
డనువాడు చమూవిభుడు మహాబలుడు జయిం
చె నతం డెదిరించి ధనద
గణాధినాథు మణిభద్రు గైలాసగిరిన్.

235\. మఱియు మహాపార్శ్వ మహో
దరులు నకంపను డతిబల దర్పోద్ధతు లు
గ్రరణ వ్యాపారములన్
సరితూగుదు రద్దిశాధినాథుల తోడన్.

236\. పదివేలకోట్లు గల ర
య్యా దనుజపురి మాంసశోణితాహారులు దు
ర్మదు లిచ్ఛారూపులు దశ
వదనుడు గెల్చెం దివిజుల వారల బలిమిన్.

237\. అనినన్ రాము డనె విభీ
షణ! శ్రుతపూర్వంబు లివి దశాస్యకృతంబుల్
వినుమోయి కూల్చెద ప్రహ
స్తునితో రావణు బుధద్విషు దురాచరణున్.

238\. నిను లంకాసామ్రాజ్య
మ్మున కభిషేకింతు మిత్రపుత్రసహితు రా
వణు దున్మెదు బాతాళం
బున కేగిన బ్రహ్మలోకముం జొచ్చిననున్.

239\. మఱలి యయోధ్యాపురి కరు
గ రావణు సబాంధవంబుగ ససైన్యముగా
ధరగూల్పక మఱ్ఱిప్పియసో
దరులానగ జెప్పుచుంటి దథ్యము సుమ్మీ!

240\. అని రాఘవు డన సాష్టాం
గనమస్కృతి జేసి నిల్చి గద్గదకంఠం
బున బల్కె విభీషణు డి
ట్లని కన్నుల సమ్మదాశ్రు లవిరళములు గాన్.

241\. అనికిన్ జొచ్చిన తఱి యో
పినరీతి సహాయపడుదు బృథ్వీశ్వర! రా
వణసైన్యవ్యూహచ్ఛే
దనమ్మునన్ రిపుమథనవిధానం బందున్.

242\. అనిన బ్రహర్షోత్ఫుల్ల వ
యనుడై రాఘవుడు రావణానుజు నాలిం
గన మొనరించి యశో వ
ర్ధను లక్ష్మణు జూచి సుమధురవచోఫణితిన్.

243\. తమ్ముడ! లక్ష్మణ! యిప్పుడ
తెమ్ము మహోదధి జలమ్ము దితిజేశ్వరు రా
జ్యమ్మున కభిషేకింపుము
రమ్మన దల యొగ్గి యాదర మ్మెసగంగన్.

244. కపి లవణాబ్ధిజలంబుల్
గొనితెచ్చి రవితనయాదులు ముదంబు మెయిన్
గన నభిషేకించె విభీ
షణు లంకానాథుఁ గాఁగ సౌమిత్రి వెసన్.

245. అవల హనుమ ద్విభీషణ
రవిపుత్రులుం గూడి సాగరమ్ముఁ దరింపం
గ వెరవు యోచన సేయం
గ విభీషణు డిట్లనె దినకరసూనునకున్.

246. కపివాహిని లంక కరుగ
నుపాయ మొక్కండె రాముఁ డుదధిన్ బ్రార్థిం
చి పడయువలె మార్గము సూ
ర్యపుత్ర! సాగరు డవశ్య మ ట్లొనరించున్.

247. ఇనవంశసంభవులు సగ
రనందనులు చేత మున్ను రత్నాకరు డొం
దె నపూర్వవృద్ధి రామున
కొనరింపడె యిట్టి సేవయు గృతజ్ఞుండై?

248. రవిజుడు రామున కెఱిగిం
చె విభీషణు వాక్యము, హృది జేర్చిన యనుజుం
డవు ననగ సమ్మతించి ర
ఘువరుం డంబుధి తటమున గుశల శయించెన్.

## శుకుని దౌత్యము

249. శుకుఁ డను రాక్షసు బిల్చి ద
శకంఠుఁడు వానర సైన్యసంఘమ్మున న
ర్కకుమారునకున్ దెల్పు మ
ని కొన్ని వాక్యములు సెప్పి నియమింపంగన్.

250. ఆ రాక్షసుఁ డభ్ర పథవి
హారుండై యబ్ధి దాటి యహితస్కంధా
వారమ్మున సుగ్రీవ మ
హారాజుం గని వచించె నసురోక్త మిటుల్.

251. హరియూథనాథ! లంకే
శ్వరుండు సందేశ మంపె సౌహృదమున న
య్యరిభీషణు వాక్యమ్ముల
తెలుం గెలింగెంచు విన్ము స్థిరమతి వగుచున్.

252. ఆరయఁగ ఋక్షరజసున
కౌరసపుత్రుండ వీ వహస్కర తేజ
శ్శ్రీరూపుడవు పులస్త్యకు
మారుఁడ, నే, సోదరులము మన మి ర్వురమున్

253. సామాన్య నరుండగు నా
రామునితో జెల్మి సేసి ప్రణయమ్మున సం
గ్రామమున దోడు వచ్చితి
వీమెయి నీ కౌనరు లబ్ధి యేమియొ దీనన్.

254. బల సంపన్నుండవు స
త్కుల్రప్రసూతుడవు నరుని దొఱగి చనన్ గా
గలదేమి రాజ్యసౌఖ్యం
బులు నీకుం గొఱయె తలపుము వివేకమునన్.

255. ఆ మానవ కాంతామణి
పై మక్కువ దెచ్చుకొంటి భావింపగ నీ
కేమి యనిష్ట మొదవె పో
రేమిటికిన్ గీశనాథ! వృధగా మనకున్.

256. సురదుర్భేద్యము లంకా
పురంబు త్రైలోక్యవిజయభూషితుడ న్నే
నరయగ జయింప లే రె
వ్వరు నను రాము డన నెంత వగవుము బుద్ధిన్.

257. హాయిగ గిష్కింధ కరుగు
మోయి! సుఖాంబుధి లహరుల నోలాడుము నీ
కాయోధనప్రయత్నము
సేయంగా నేటికి దశశీర్షుని తోడన్.

258. శుకు డి ట్లాడుట విని యో
ర్వక క్రోధోద్రిక్తవానరగణంబుల్ బ
ట్టి కరాఘాతమ్ముల గొం
కక మర్దింపంగ "రామ! కావవె! రామా!

259. రావణు పంపున దూతగ
నై వచ్చి యతండు సెప్పు మన్నది నే సు
గ్రీవునకుం దెల్పగ న
న్నీ విధి బాధింత్రు గావవే దాశరథీ!

260. దూత యవధ్యుం డన్నది
నీతి యెఱుంగనిదె రామ! నీ విట నన్నీ
క్రోతుల మూక వధించెడు
నా తెఱగు నిజంబ పల్కినాడ రఘువిభూ!"

261. అనుచున్ మొఱయిడు శుకుని వ
చనమ్ము లాలించి రామచంద్రుడు దౌత్యం
బున వచ్చిన శుకు విడువుం
డని యానతిసేయ విడిచి రాతని గీశుల్.

262. వానర బాధా ముక్తుం
డైన శుకుం గాంచి వాన రాధిపు డనె, లం
కానగరి కేగి రావణు
తో నిట్లను మోయి నా హితోక్తులు గాగన్.

263. ఏనాడేనియు స్నేహము
గానం బడదు మనకు దశకంధర! యరయం
గా నా కహితుడు వాలికి
బ్రాణ స్నేహితుడ వగుట బగఱవె నాకున్.

264. పరకాంతారతుడవు దు
శ్చరిత్రుడవు నీచమతివి చపలుడవు వివే
క రహితుడవు భూమి సుతన్
హరించితివి మోసగించి యవివేక వృత్తిన్.

265. ఉపకారము సేయవు నా
కెపు డేనియు నాకు మిత్ర మెట్లౌదువు దు
ష్టా! పరాత్పరుండు రాముని
కపకారివి బుధవిరోధి వైతివి దనుజా!

266. తునిమెద లంకాపురి జే
రి నిన్ను సైన్య సహితంబు మృతి తప్పదు రా
వణ! నీకున్ భువనత్రయ
మున నెం దేగినను రామ ముక్తాస్త్రములన్.

267. పతి దరిలేని యెడ హరిం
చితి వొంటిగ గాన నున్న సీతమ్మ వధిం
చితివి ముదుకడు జటాయువు
నతిత్వర లభించు దత్ఫలానుభవంబుల్.

268. బ్రదుకంగ నిచ్చ గలదే
ని దాశరథి గొల్వుము ధరణీసుత నర్పిం
చి దశాస్య! యం చనగ జని
యె దివి కెగసి శుకుడు దానవేంద్రుని కడకున్.

### శ్రీరాముడు సముద్రుని గొల్చుట

269. అరయ భుజగ భోగాభము
వర కేయూ రాంగద ప్రభా భాసితమున్
బర మాంగ నాభిమృష్టము
ధరణీతనయా శయోపధానీకృతమున్.

270. హితజన పరమానంద మ
హితలోక భయంకరంబు మృగమద సంవా
సితమున్ దక్షిణభుజ మా
ని తరణికుల భూషణుండు నియతవ్రతుడై.

271. జలనిధితీరం బందు గు
శల శయనించి మరణంబొ సాగర తరణం
బొ లభించు గాక యనుచున్
జలధీశుం గొల్చె రామచంద్రుడు నిష్ఠన్.

272. ఆమెయి మూడు దినంబులు
రాముడు జపియించె సాగరానుగ్రహ వాం
ఛామతి, దర్శన మొసగడు
రామునకున్ సాదరమతి రత్నాకరుడున్

### రాముడు సముద్రునిపై గోపించుట

273. తను మన్నింపడు సాగరు
డనుచు మహాక్రోధపూరితాత్ముండై చ
య్యన రాముడు చేత శరా
సనమున్ దాల్చి యొనరించె జ్యాఘోషంబున్

274\. రామ ధనుర్జ్యాఘోషము
భీమం బై పరగ వడకె విశ్వము భూత
గ్రామము చేష్టారహితము
గా మూసెన్ రవి గిరిప్రకర మల్లాడెన్.

275\. శరసంధాన మ్మొనరిం
చి రాము డనె దమ్మునకు శుచిప్రవతి నై సా
గరదేవు నుపాసించితి
దరి సెన మీయండు పీడు దర్పితమతియై

276\. విన్నపము వ్యర్థ మయ్యెన్
సన్నుతులు సమర్థు లయ్యు శాంతాత్మకులై
యున్న ఫలం బిట్టిదె వా
రి న్నెవ్వరు సరకుసేయ రీ లోకమునన్

277\. తన్నుం దా బొగడు కొనుచు
నన్నువలం దటిమి కొట్టి నయవంచకుడై
యన్నిట దండంబు నెఱపు
న న్నరునిన్ గారవింతు రఖిల జనంబుల్.

278\. వినయము మూర్ఖుల యెడ గుటి
లు నెడ న్నీతియు గుపితనరునకు న్నయబో
ధన మొనరించుటయున్ జవి
టినేల బీజములు వేయు టే యగు ననుజా!

279. ఈ సాగరు శోషిల్లం
జేసి పథం బేర్పరింతు సేనాతతికిన్
నా సాయకముల లంకా
వాసుని పై దాడి వెడలి బవర మొనర్పన్

280. అనుచున్ ప్రజ్జ్వల దుగ్రా
స్త్రనిచయ మడరింప సాగె దశరథసుతు డ
వ్వనినిధి పయిన్ రయోద్ధతి
ఘనపథ మంటెన్ జలము లెగసి తద్ధతికిన్

281. కలగుండు వడియె నక్ర
మ్ము లాది జలచరవితానము మహారావ
మ్ముల వీచె ప్రభంజన మూ
ర్ములు సుడులు వడంగ నెగసె బొగలు శరాగ్నిన్

282. అంతన్ రాఘవుడు సము
ద్ధాంతము బ్రహ్మాస్త్రము గొని ధన్వము నాక
ర్ణాంతంబుగ దిగిచి నదీ
కాంతోరస్థలము నేయ గా నుంకింపన్

283. ధరణి చలించె ధరిత్రీ
ధరమ్ము లూగెన్ దిశావితానంబు దమో
భరితం బయ్యె సహస్కర
మరీచి జాలము లశని సమములై తోచెన్

284. ఘోర ధ్వని జెలరేగెన్
మారుతముల్ నేల గూలె క్ష్మారుహ చయముల్
నీరదము లురిమె దివిని మ
హారవముల భూతవితతి యాక్రోశించెన్.

**సముద్రుడు రామునకు సేతుబంధనోపాయము జెప్పుట**

285. కమలదళాక్షుండును ర
క్తమాలికాంబరధరుండు కాంచనభూషా
సమలంకృతుండు వైడూ
ర్యమణిస్నిగ్ధప్రభాపరాజిత తనుడున్.

286. సితముక్తాహారవిభూ
షితుడున్ గౌస్తుభసమానచంద్రతోద్భా
సితవక్షుండును నగుచు ను
దితు డయ్యె నెదుట సరిత్పతి కృతాంజలియై.

287. అమల స్వర్గర్భ క్షవ ర
త్న మౌక్తిక ధగద్ధగాయిత తనుడు గంగా
యమునా ప్రభృతి నదీ నద
రమణీ పరిసేవితు డయి రామున కెదుటన్.

288. అరుణుండు మేరుధరణీ
ధరమున నుదయించు పగిది దద్వార్ధి జలాం
తరమున బొడమిన యా సా
గరుం డనియె నిట్లు వినయకలితస్వరుడై.

289. పురుషోత్తమ! విన్నప మవ
ధరింపుము జలాగ్నివాయు ధరణీనభముల్
పరికింప మేఱ మీఱుచు
జరింప వింతేని నైజ సద్ధర్మముగన్.

290. అలఘు శిఖా సంకలిత
జ్వలనుడు హిమ శీతలత్వ భావము గనునే
జలధి కగాధత్వము సహ
జలక్షణం బద్ది వీడ సాధ్యమె నాకున్.

291. ఈ మహాన్ప్రకృతులు మ
ర్యాద దోల్లంఘన మొనర్ప నట్లుగ జూడం
గా దగు జగత్ప్రభుండవు
సాదరబుద్ధి బరికింపుమా! శ్రీరామా!

292. జీవింపన్ బహువిధ జీ
వావళి నాయందు నేను స్తంభించినచో
జీవమ్ము బాయు నయ్యవి
కావింపం జాలనట్టు కమలదళాక్షా!

293. కలడు కపిసేన లోనన్
నలుండనగ విశ్వకర్మనందను డాతం
డలఘుండు శిల్పశాస్త్ర కు
శలుండు పితృసముడు రామచంద్రనరేంద్రా!

294. సేతువు గట్ట బనుపు మీ
వాతని సైన్యంబు లేగ ననువుగ సుదృఢం
బౌ తీ రొనర్తు దారు శి
లాతతి నాలో జలంబులం దేలు గతిన్.

295. కపివాహినీచయంబు ని
రపాయముగ లంక జన సహాయపడుదు దై
త్యపతిన్ గూల్పగ నేగు మ
ని పల్క రత్నాకరున కనియె రాము డిటుల్.

296. ధనువున గూర్చిన యీ శర
ము నేమి సేయుదు వచింపుము వృధ జనన్ రా
దనినన్ సముద్రు డిట్లనె
మనోహరమ్ము ద్రుమకుల్య మన నాయందున్

297. కల దొక దేశ ముదగ్దిశ
గలుషాత్ములు ఘోరదుష్టకర్మరతులు ద
స్యులు నాభీరులు గలరట
ఖలు లవ్వారి సహయుక్తి కంటక మయ్యెన్

298. పరగింపుము బ్రహ్మాస్త్రము
హరింపు మస్మ త్సుఖాపహారుల వారిన్
ధరణీధవ యన నంగీ
కరించి యట్లు యొనరించె గాకుత్స్థు డాగిన్

కపిసేన వార్ధి దరించుట

299. నతుడై ముదమున నంత
ర్హితు డయ్యె నదీపతి పృథివీశుడు నలు నా
నతి సేసె సేతుబంధన
మతిత్వర నొనర్ప రవిసుతాదులు మెచ్చన్

300. దారువులు భూరిశిలలున్
దోరమ్ముగ దెచ్చి వైచి తోయధి లోనన్
దారమ్ములు గొలబద్దలు
తీరుగ బట్టి కపు లైదు దినముల లోనన్

301. యోజనశతాయుతము దశ
యోజన విస్తృతము గాగ నుత్సాహమునన్
యోజిత మొనర్ప నది వి
భ్రాజిత మయ్యెన్ జలధికి బాపట యో నా

302. కమనీయకాంతి సంకలి
తమై ప్రకాశించె నద్భుతంబుగ నబ్ధిం
ద్రము నం దది యభ్ర ద్యో
తమాన స్వాతీ పథ సముదాత్తం బగుచున్

303. సుర కిన్నరులున్ విద్యా
ధర కింపురుషులు దపసులు తండము లై య
చ్చెరువున గాంచి రపూర్వము
బరమాద్భుత వార్ధిసేతుబంధన మెలమిన్.

304. ఆ రీతిగ నిర్మించిన
వారధి పైన బయనించె వానరచయముల్
మారుతియు నంగదుండున్
శ్రీ రాఘవలక్ష్మణుల గొని కడిమి నడువన్.

**శ్రీరాముడు లక్ష్మణునకు యుద్ధ సూచనలం దెల్పుట**

305. నలనిర్మితసేతువునన్
జలనిధి దరియించి రామచంద్రుం డనె ని
ట్టు లనుజు లక్ష్మణు తో బె
క్కులు గానం బడెడు దుశ్శకునముల్ కంటే.

306. భైరవ రవమున వీచున్
మారుతము ధరారుహములు మహి ద్రెళ్ళి పడున్
నీరదములు గురియు నసృ
గ్ధారలు ఖరవర్ణముల గగనమున గుములై.

307. చలియించు శైలశిఖరం
బులు మహి కంపింప సాగు మ్రోయు సృగాలం
బులు భీషణమ్ముగ వియ
ద్వలయం బపరదిశ రక్తవర్ణం బయ్యెన్.

308. రవిమండలంబునం దో
చు విస్ఫులింగమ్ములు జలజుడు శోభాశై
త్యవిహీను డయ్యె ద్విజతతి
రవి కెదురు నడచు భయంకరారావములన్

309. సమరము వర్తిల్లుట ని
క్కమునుజ! వానిసా సృగస్థి కర్దమ భూయి
ష్ఠమగున్ ధారుణి యసన్యో
న్య మారణోద్దామ వానరాసుర తతిచేన్.

రాముడు లంకానగర వైభవమీక్షించుట

310. అనుచున్ రాముడు రవినం
దన కుముద హనూమ దంగద ప్రముఖ కపి వీ
ర నికాయము తో జనె రా
వణు లంకానగర వైభవ దిదృక్షాత్మన్

311. చెలగె గపిసైన్యజయఘో
షలు సమరోత్సాహ కృత భుజాస్ఫాలన కా
హళ భేరీ తూర్య రవం
బులు గర్జనలున్ జలధిసముద్ఘోషము నా

312. ఆ మహితాత్ముడు రాముడు
సౌమిత్రికి చెప్పె ని ట్లచలశృంగమునన్
ధీమంతుండు మయుడు శో
భామయముగ దీర్చె దీని వాసవపురి నా

313. సితమేఘమాలికాసం
వృతాంబరము వోలె బరిడవిల్లు నిది సమం
చితముగ గనుము విమానా
కృతి ప్రశోభిత మనోజ్ఞ గృహ కలితంబై.

314. సుమ ఫల భరిత మహీరుహ
సముపేతం బై కుబేర చైత్రరథోద్యా
నము దలపించు పుర మిది శ్రు
తి మధుర గానమ్ము సేయు ద్విజసంఘంబున్

315. అవిరళ మధుపాన కలిత
వివశత్వంబున సుమముల వీడవు షట్పా
దవితతి చివుళ్లు మేసి య
నవరతము గుహూ రవము లొనర్చుం బికముల్.

316. విభజించె నంత రాముడు
గభస్తి సుతుతోడ సైనికప్రకరంబున్
బ్రభుత వెలయ వ్యూహాకృతి
గ భవిష్య త్సమర కార్య కౌశల్యమునన్

శుకసారణులు రావణునకు రామసైన్య వివరములు చెప్పుట

317. అవిశంకమతి న్వచ్చె ర
ఘుపీరు డంబునిధి దాటి క్రోతులతో నం
చు వినిన రావణు డత్యం
త విస్మితుండు భయవిచలితాత్మండునునై

318. శుకసారణుల బిలిచి వా
ర్ధికి సేతువు గట్టె నంట శ్రీరాముడు భూ
రి కపిప్రవరుల తో లం
కకు జేరువ యయ్యె నంట కథయొ! నిజంబో!

319. పరిశీలింపుడు మీ రరి
గి రయమ్మున సైన్యబలము గీశపతుల తీ
రెరిగి చనుదెం డటంచున్
బరపిన వా రేగి వచ్చి పల్కి రతనికిన్.

320. కనబడు మహార్ణవము భం
గి నపారముగ గపిసేన గిరినిభులున్ వ
జ్రనఖుల్ గలారు లెక్కిం
ప నసంభవ మయ్యె మాకు బలలాశివిభూ!

321. మ మ్మెఱిగి పట్టి ప్రభు! నీ
తమ్ముండు విభీషణుండు దండింప గడం
గ మ్మే దినీశ డనురా
గమ్మున విడిపించె స్వేచ్ఛ గా జను డంచున్.

322. ఎఱిగితిమి రామ సైన్య బ
ల రహస్యంబులు శరంబుల పటుత్వంబుల్
ఖరదూషణులన్ బదివే
వుర వాలిన్ గూల్చిన తెరువు గపులు సెప్పన్.

323. శరనిధికిన్ సేతువు గ
ట్టిరి దారు శిలా వితతి గడిందిగ దోచున్
బరమాద్భుతం బగుచు ను
ర్వర నశ్రుతపూర్వ మద్ది లంకానాథా!

324. రాము నెదిరించి గెల్చుట
సామాన్యము గాదు జనకజ నొసంగుట యో
ఆ మానవు గెల్వఁగ సం
గ్రామమున కితోధికమ్ముగ బ్రయత్నంబో.

325. సలుపు ముచితమ్ముగ యశో
విలసితముగ నంచు బల్కి విని దశకంఠుం
డలుకన్ వహించి యిట్లనె
'పలువలు! కీర్తింత్రు శాత్రవ జయోన్నతులన్.

326. కంఠమ్ము లుత్తరింతు, న
కుంఠిత వీర్య ప్రతాప గుణ వంతుడ వై
కుంఠుం డేనియు నీ దశ
కంఠున కెదురొడ్డు వాడె కదనస్థలిలో?

327. జానకి నొసంగుదునె యభి
మానంబు న్వీడి యల్పమానసు లౌ మీ
రా నాకు నీతి చెప్పుట?
నేను రణంబె యొనరింతు నిశ్చయమతినై.

328. ఒరీ! సారణ! వానర
వీరుల దెలిసితి నటంటివి వచింపుము దు
ర్వార బల పరాక్రమ వి
స్ఫారుడ నౌ న న్నెదిర్ప జాలిన వారిన్.

329\. అనుచున్ సౌ ధోపరి తల
మునకున్ జని కీశసైన్య ముఖ్యుల జూపం
గ ననుజ్ఞ సేయ గా సా
రణు డిట్లనె రావణునకు ప్రభు! చూడు మటుల్.

330\. వా డాయోధనకుశలుడు
పీడండు రణస్థలంబు బెట్టిద మైనన్
వాడు శరభుండు నిర్భయు
డై డీకొను నెట్టి దోర్బలాధికు నేనిన్

331\. అనితర సాధ్యుడు ధీరుడు
హనుమంతుం డాత డగ్ని కాహుతి సేసెన్
మన లంక రామభక్తు డ
తని శౌర్యోద్ధతుల వేఱ దడవగ నేలా!

332\. వానర సేనాపతి యడు
గో నీలుడు భూరి సింహ ఘోషా ప్రచల
న్నానా వన వారణ లం
కా నగ రోర్వీధరుం డగణ్యబలుండున్.

333\. విపులోద్యద్భుజు డంగదు
డు పద్మకింజల్క వర్ణుడు ఘనుం డుద్వే
ల పరాక్రముండు సురరా
జపౌత్రు డవ్వాడె పిల్చు సమరంబునకున్.

౩౩౪. వననిధికిన్ సేతువు దీ
ర్చిన వాడు నలుండు వాడె రిపుసూదన శ
క్తినిధానుడు తానె రణం
బున ని న్నోర్వం దలంచు భుజబలగరిమన్.

౩౩౫. శీతాద్రి వోలె గనబడు
శ్వేతుం డుగ్ర ప్రతాపశీలి జగ ద్వి
ఖ్యాతుడు నిస్తుల ధీ సము
పేతుడు యుద్ధచపలుండు వీరుం డతడే.

౩౩౬. కుముదుండు వాడె యాభీ
లము వాని పరాక్రమంబు లక్షల కపిసై
న్యము వెంట దెచ్చె నాతం
డమరారి వధాకృతాత్ము డై యసురేశా!

౩౩౭. రంభుం డడుగో యుద్ధా
రంభమ్మున కెదురుసూచు రాక్షసవధకై
శుంభద్విక్రముడున్ గజ
కుంభోరస్కుడు వనాట కోటి విభుండున్.

౩౩౮. యుద్ధార్తి యగుచు నిల్చెడు
నుద్ధుర తేజుండు వాడె యోధాగ్రణి దీ
వ్య ద్ధాత్రీధర దేహుడు
క్రుద్ధాత్ముండు పనసుం డరిభయంకరుడున్.

339. రిపు భీషణుండును మద
ద్విప కల్పుండు వినతుండు వీరుం డవ్వా
డ పరాజితుడు సముద్దాం
త పాద ఘట్టన రజోకృత శిలోచ్చయుడున్.

340. గవయ గవాక్షులు గజుడు శ
తవలియు గ్రథనుడు ప్రమాథి దంభుడు మైంద
ద్వివిదులు సన్నాదుడు నన
గ విదిత బలశాలు రరుగొ కపియూథపతుల్.

341. భల్లుకగణాధి నాథుం
డల్లడుగో జాంబవంతు డసమబల స్థై
ర్యోల్లాసుడు బ్రహ్మసుతుడు
కల్లోల మొనర్చు శత్రుగణ మవలీలన్.

342. రణకేసరి కేసరి యన
గ నతండె ప్రచండశౌర్య గర్వాటోపుం
డనితర సాధ్యుడు హనుమం
తునకున్ జనకుండు వాడు దోర్దర్పమునన్.

343. అనుచున్ విరమించెను సా
రణుండు శుకు డిట్టు లనియె ప్రభు! ఆవంకన్
గనవచ్చు నీల నీరద
తనూ విలాసుండతండె దశరథసుతుడౌ.

344. ఆ రాముని కవ్వల కృ
ద్ధోరగముం బోలె నిల్చి యూర్పుల్ నిగుడం
గా రౌద్రదృష్టి లంకా
ద్వారం బీక్షించు రాము దమ్ముం గనుమా!

345. ఆవంకం జూడుము సు
గ్రీవుడు వానరవిభుండు శ్రీరామునకున్
జే పిచి యేదొ చెప్పెడు
దావక పుర గోపు రాగ్ర దర్శకు డగుచున్.

346. ఆ గతి వారలు శ్రీరా
మాగణ్య చమూ పరాక్రమ విశేషములన్
బాగుగ దెల్ప వరబల మ
హాగర్వాంధు డసురుం డహంకృతి మీఱన్.

347. నాయెదుట న్నిల్చి రిపు ని
కాయము స్తోత్రంబు సేయు గలుషాత్ములు మీ
కాయువు మూడినదియ కా
నీ యుష్మత్పూర్వసేవ నెంచి క్షమింతున్.

348. పొం డావల కంచు దశా
స్యుం డవ్వారి నదలించి యోచన సేసెన్
గొండొక మార్గంబు సచివ
మండలితో గూడి రిపుల మానం బడపన్.

### రావణుడు సీతను మోసమున బెదరించుట

349. అసురాంగనాసమావృత
యసురేశభయార్త రాఘవాంఘ్రియుగధ్యా
నసమాహితచిత్త మహిసు
త సీత కడకేగి పల్కె దశకంఠు డిటుల్.

350. సుర కిన్నర విద్యాధర
తరుణీమణు లూహ నైన దలపంగా నే
రరు మహిత రావణాంతః
పుర మహిషీ వైభవంబు బూర్ణేందుముఖీ!

351. అట్టి మహాయోగము నీ
కట్టెదుట న్నిల్చియున్న గనబోవవు జే
పట్టినవాడె ఘనుండని
గట్టిగ నమ్మితివి నరు నౌ కల్పాయుష్మన్.

352. పాపము రాముడొ గీముడొ
కాపాడు నటన్న యాశ గన్నెత్తవు నా
వైపు తలోదరి! నీకున్
బ్రాపగు నం చాశపడిన వా డికలేడే.

353. బలశాలి నన్న భ్రమ గ్రో
తుల తోడ న్వచ్చి విడిసి దోయధి తీర
స్థలి నీ రాముడు పిశితా
శుల శక్తు లెఱుంగ లేక సుప్తుం డయ్యెన్.

354. నిశివేళ నాదు సైనికు
లశనుల తెఱగొప్ప దాకి య వ్వానరులన్
నిశితాయుధహతి గూల్చిరి
కనిమసగి వసుమతి నెత్రు కాల్వలు వారన్.

355. సుగ్రీవుం డిప్పుడు త్రుటి
తగ్రీవుం డయ్యె దారితాంగుడు భల్లూ
కాగ్రణి నికృత్త బాహు ప
దగ్రంధుం డంగదుండు ధర బొర్లాడున్.

356. దారితహనువై హనుమడు
ధారుణి గూలె గుముదుండు దధిముఖుడు మహా
వీరులు మైంద ద్వివిదుల్
బోరన గ్రిద్దె ధరిత్రి రుధిరస్రవులై.

357. కరవాల ప్రహరణ చా
తురీ నిధానుండు చెలగి దోర్దర్పమునన్
మెఱసి ప్రహస్తుకు ఖండిం
చె రాఘవు శిరంబు నొక్క శితఖడ్గహతిన్.

358. దనుజోద్ధతి నాగన్ జా
లని కపు లెల్లరు భయాకులత బాఱిరి ల
క్ష్మణుతోడ దఱిమి కొట్టిరి
సునిశిత నారాచముల నసురవీరవరుల్.

359. గతి యెవ్వ రింక ధరణీ
సుత! నీకు న్నేనుదక్క శోకించినచో
మృతు డైన వాడు వచ్చునె!
పతిగా నను స్వీకరించి పడయుము సుఖముల్.

360. చూడు మిదియె రాముశిరము
చేడియ! బాణాసనంబు చేత ధరించున్
వాడిది చూడుము దబ్బర
లాడుట కా దంచు నా దశాస్యుం డంతన్.

361. కనుసైగ సేయ మ్రొక్కుచు
వినయమ్మున సీత ముందు బెట్టె శిరంబున్
ధనువును విద్యుజ్జిహ్వుం
డను దనుజుడు రావణుండు హర్షం బందన్.

362. అరుణాధరపల్లవమున్
సరసీరుహ దళ విశాల నయనంబులు జం
దురు బోలు నెమ్మొగంబున్
శిరమున జడలున్ గని ధరణీసుత యంతన్.

363. తనపతి రాము ముఖంబే
యనుచున్ భ్రమియించి సోలె హా! రామ యటం
చును విగతస్పృహయై ధా
త్రిని బిమ్మట గొంతవడికి స్పృహ జేకూరన్.

364\. విలపించె గురరి బోలెన్
ప్రళయాంతక దుర్నిరీక్ష్య భాస్కర తేజో
విలసితుడ విట్టి దశ కె
ట్టులు పా లైతివి రిపులు గడుంగడు బొంగన్.

365\. ఇది నా జేసిన పాపమె
మదీయ భాగ్యంబు నష్ట మై పోవగ నీ
కిది సంభవించె గాకు
న్న దానవు డొకండు ని న్నైనకునె! రణమునన్.

366\. వనముల కేగం బూనితి
వి నీవు గై కేయి సెప్ప బిత్రాజ్ఞం దీ
ర్చు నెపమ్మున, మృత్యువునై
చనుదెంచితి వెంట సేవ సల్పెడు మిషచే.

367\. దైవజ్ఞులు దీర్ఘాయువ
పీవంచుం బల్కు వింటి హృదయేశ్వర! యిం
కేవిధి ఘటిల్లె నిది యా
దైవజ్ఞుల ప్రజ్ఞ లెల్ల దబ్బర లే నా!

368\. పరిణయపు న్వేళ మృదు మ
ధురమ్ముగా "వెంట నుండుదు నిరంతర మం
చు" రహిం బల్కిన దానిన్
స్మరించి కొనిపొమ్ము నాథ! నను నీతోడన్.

369\. పరిరంభింతు నితఃపూ
ర్వరహోవేళల సుగంధిల శుభప్రద వ
స్త్ర రుచిర భవ త్తనువు నా
థ! రామ! చిక్కెనె సృగాలతతి కి ప్డకటా!

370\. ఆబాల్యప్రియసహచరి
నై బాహ్యాంతర్విశుద్ధ నై మెలగుదు నా
తో బలుకవు పృథివీవర!
నా బాముం గాన విద్ది న్యాయమె! నీకున్

371\. క్రతుసంచయంబు గావిం
చితివి సుదక్షిణము గాగ శిష్టులకుం జే
సితి వెన్నొ దానములు భూ
పతి వయ్యు న్నోచ విపు డపరకర్మలకున్.

372\. దుర్విధి నే మందు ప్రభూ!
సర్వజ్ఞుండవు నుపాయశాలివి జగతీ
నిర్వాహకుండ వాపద
నేర్వం గా ణాల వైతి నిశియం దకటా!

373\. జీవింపదు కౌసల్యా
దేవి సుతుం డీ పగిది మృతిం బొందుటయున్
రావణగృహంబున న్నే
నీ విధి దుఃఖిత నగుటయు నెఱిగిన యేనిన్

374. క్రైక దురుద్యోగమునన్
సాకేత త్యాగ గహనసంచార ప్రే
మాకరసతీవియోగము
లే కాక లభించె నీకు మృతియున్ నాథా!

375. ఏనుం జీవించుట వృథ
ప్రాణంబులు వాసి భర్తృపదసన్నిధికిం
గా నరిగెద రావణ! మది
బూనుము నాకీ సహాయముం బొనరింపన్.

376. సతికి పతిన్ గూర్చు టది సు
కృతంబ నా నాథుతనువు గీలింపుము పే
ర్మి త దుత్తమాంగమునకున్
జితి బేర్పించి పతితోడ జెచ్చెర జొత్తున్

377. ఆ గతి జానకి దుఃఖో
ద్వేగమ్మున బనవుచుండ దితిజేంద్రునకున్
వే గొకడు వచ్చి "ప్రభు! మీ
యాగమన మమాత్యవర్యు లాశింతు" రనన్

378. రభసమ్మున జనె నాతడు
సభాస్థలికి ముఖ్యకార్యసంగతుడై శ
త్రుభయంబున మాయా రా
మభద్రుని ధను శ్శిరములు మాయము లయ్యెన్.

379. మోహిత యై భయ మంది వి
దేహాధిప పుత్రి సీత దీనాస్యమునన్
హాహాకారము సేయగ
నా హావళి జూడ లేక యకలుషమతియై.

380. సరమ యను నాశరతరుణి
దరియంగా వచ్చి పల్కె ధరణీతనయా!
విరమింపుము శోకము నే
నరసితి నీ విభుడు గుశలి యై యుండంగన్.

381. మాయలమారి దశాస్యుడు
మాయాకృత రామ చాప మస్తకముల నీ
కా యోజ దెచ్చి చూపెన్
హేయం బగు దుష్టవాంఛ హీనాత్ముండై.

382. మాయాకల్పితము లగుట
మాయము లయ్యెన్ దనుజుడు మఱుగై పోగా
నీ యసురసృగాలమ్ములు
డాయ గలవె పురుషసింహు డా రఘురామున్.

383. ఆశ్రితమందారుడు లో
కశ్రుతవీరుండు శక్రకల్పుండు దిగం
తక్రాంతకీర్తి సుగుణగ
ణాశ్రితు డా రాఘవున్ జెనకుదురె యసురుల్.

384. రావణసభాంతరంబున
ప్రోవై వీరే మొనర్తురా తెలిసి వత్తున్
నీ విట నిశ్చింతాత్మన్
భావింపుము రామభద్రు పదపద్మములన్.

385. అనుచు వియద్గమనమ్మున
జనిన సరమ మఱలి వచ్చి జానకి కనె రా
వణదైత్యుని మంత్రాంగం
బును వింటి నదృశ్యరూపమున గమలాక్షి!

386. అంబునిధి దాటి కపిసై
న్యంబులతో వచ్చె రాము డాహవసన్నా
హంబున నని యాలించి భ
యంబున సమరప్రయత్న మారంభించెన్.

387. గజ వాజి స్యందన భట
వ్రజమ్ముల సమీకరించి పదిలము సేయిం
చె జనగృహంబులు గోట బు
రుజులున్ దుర్గములు బలనిరూఢంబులుగన్.

388. రావణుని తల్లి కైకసి
యావిద్ధుడు వృద్ధమంత్రి యా దైత్యున కెం
తో వివరించిరి నిగ్రహ
భూవరున కొసంగి కులము ప్రోవు మటంచున్.

389. హనుమంతుడు లంకం జే
సిన యద్భుతకార్యములు నిశిచరుల ఖరదూ
షణులన్ బదివేవుర గూ
ల్చిన రాము పరాక్రమంబు సెప్పిరి సుదతీ!

390. విన నని భీష్మించెన్ రా
వణుండు రణనిశ్చయంబె ప్రకటించె బునః
పునరుక్తముగా ని న్నీ
య ననియె లోభి ధన మీయ నను చందమునన్.

391. జీవించి యుండగా నీ
బోవడు రామునకు నిన్ను మూర్ఖాగ్రణియై
చావే నిశ్చిత మింకన్
రావణునకు రామ కర శరాఘాతములన్.

392. విలపింప బోకు మింక ర
ఘులలాముడు నీ విభుండు కూల్పం గలడా
పలలు నచిరమ్మున సుఖ
మ్ములు సెందుదు వీవు భర్త పొం దొదవంగన్.

393. నీ సిలికన్నుల జిగిన్
గానం బడు భర్తృయోగ కల్యాణోత్సా
హానూనశుచిప్రభలె య
యోనిజ! విభు రాక వేచి యుండుము ధృతితో.

394\. ధరణీసుత నా విధమున
సరమ యనునయించుచుండ సాగర ఘోషో
ద్ధుర గర్జా భేరీ తూ
ర్య రవంబులు మిన్ను ముట్టె నత్యుగ్రములై.

395\. ధరణీతల మెల్లయు ద
ద్దరిల్ల వానర చమూ వితతి యాగతి శం
ఖరవంబుల్ గర్జలు సే
య రాక్షసచముపు మహ ద్భయాకుల మయ్యెన్.

396\. తమయేలిక సేసిన దో
షమూలముగ దప్పదు మృతి, శాఖామృగసై
న్యము భీమబలం బని దై
న్యమునం గ్రుంగె సురరిపు భటావళి యెల్లన్.

మాల్యవంతుడు రావణునకు హితము సెప్పుట

397\. వానరకృతభీషణ గ
ర్జా నాదము లాలకించి రావణు డనియెన్
సేనానాయక మంత్రి గ
ణానీకము గాంచి భీషణరవోద్భటుడై.

398\. ఆ విధి నా దుష్టనరుం
డా వననిధి దాటి వచ్చె నగణిత కపి సే
నావారముతో నంటిరి
నే వింటి, ననంతరకరణీయంబునకున్.

399. స్థిరవిక్రము లయ్యును నా
నరు నద్భుత విక్రమంబు నయశీలగుణం
బెఱిగియు గను ల్దెఱచి చూ
తురు గాని కడంగరు రణదోహలబుద్ధిన్.

400. అని నిందించిన బ్రాహ్మం
డును గైకసికిన్ బితృవ్యుడున్ బలవంతుం
డును నైన మాల్యవంతుం
డనె నిటు లాశీః పురస్కృతాలాపమునన్.

401. నాలుగు విద్యలు నేర్చిన
పాలకుడు బల ప్రభావ వైభవమున దో
ర్లీల రిపువిజయుడై చిర
కాల మనుభవించు రాజ్య కలిత సుఖంబుల్.

402. తనకన్నన్ బలవంతుడు
తనకు సమానుండు నైన ధారుణిపతితో
దన కుచితంబగు సంధియ
చను, కదనమ్ము తగు నన్య సందర్భములన్.

403. ఇది రాజనీతి పాటిం
ప దగున్ జయశీలు డైన క్ష్మాపతి, నీ కి
ష్టపు దశరథాత్మజు తోడన్
గదనము సరి కాదు సంధి కర్తవ్య మగున్.

404. వర మగు దపఃఫలంబుగ
సుర కిన్నర యక్ష రాక్షసుల చే నీకున్
మరణము గాదని యిప్పుడు
దురం బది ఘటిల్లె నరులతో గ్రోతులతో.

405. తొలి నీ చేతన్ బన్న
మ్ముల పా లైన ముని సత్రములు సురవర్గ
మ్ములు సాధులు నీదు వధా
ర్థులు రామజయార్థు లైరి దురమగు నేనిన్.

406. కనబడు చున్నవి పెల్లశు
భనిమిత్తంబులు పురమున భవ దపజయ సూ
చనలుగ జయంబు ధర్మం
బునకున్ జేపడుట సత్యము జగద్ధితమున్.

407. లీలా మానుష రూపము
దాలిచి భువి నవతరించె దశరథ సుతుడై
శ్రీలక్ష్మివిభు డనగా
నాలింతు విరోధ మేల? యా రామునితో

408. ధరణిజ హరించి తెచ్చుట
విరోధ మేర్పడియె నీకు విఖ్యాతయశుం
డరి సూదను డగు నా దా
శరథికి సతి నిచ్చి చెల్మి సల్పు మతనితో.

409. కాలోచితముగ గార్యము
నాలోచింపుము సుఖంబు యశము స్వర్గా
వాలంబులు గా బెంపగు
లీల జరింపుము మహాబలి! వివేకమునన్.

రావణుడు మాల్యవంతుని నిందించుట

410. అనినన్ రావణు డాగ్రహ
మున గడు నిందించె నిట్లు ముష్కర బుద్ధిన్
గొని పల్కెదు వీ గతి న
ల్పునిగా భావింతు నన్ను లోకప్రభునిన్.

411. వనముల కేతెంచె నతం
డు నిజపితృనిరస్తుడై యుడుగని వ్యథం జెం
దినమతి గతిలేక భుజం
బున విలుదాల్చి యభిమానము ద్యజించి వెసన్.

412. వా డొక వీరుండని కొం
డాడెదు యాదృచ్ఛికముగ నటవీస్థలి జెం
డాడెన్ గొందఱ నా సై
దోడుల, బంధించె నబ్ధి తోయౌఘంబున్

413. సురపతి గ్రుక్కించితి ది
క్కరి కుంభంబులు బగిల్చి, కైలాసధరా
ధరమున నోడించి కుబే
రు రథంబున్ గొంటి, దాసులు సుమి దిగీశుల్.

414. చెలగితి నెదురన్నది లే
క లోకనాథుండ నగుచు, గామించిన యా
జలజాక్షి సీత నిత్తునె
వలిముఖులకున్ నరులకు వంచుదునె తలల్?

415. పండితుడ వఖిల శాస్త్ర వి
దుండవు, నిను బోలు వాడు దుర్వాక్యాలా
పుం డగునె యసూయాగ్ర
స్తుండో శత్రుజనప్రేరితుడో కాకున్నన్

416. త్వర జూతువు గాని మదీ
య రణోద్రేకంబు వానరావళితో దా
శరథులు దలల్ దెగి పడన్
ధరగూలుట, పల్కు వల దధైర్య వచనముల్.

417. అను న మ్మూర్ఖుని కెదురా
డ నోప కమ్మాల్యవంతు డరిగె దలన్ వం
చి నిజావసథము జేరగ
దను జాధీశుండు పల్కె దండపతులకున్.

418. రణసన్నద్ధుండై ని
ల్చె నా నరుండింక, దాడి సేయంగల డె
ల్లి నిఖిలసైన్యము సిద్ధము
గ నమర్పుడు సకలకీలక స్థానములన్.

419. తూరుపు దిశన్ బ్రహస్తుడు
వారుణ దిశ నింద్రజిత్తు వర్తిల యమ ది
గ్ద్వారమున మహా పార్శ్వుడు
సారణు డుత్తరదిశ శుక సహితుం డుండున్.

420. పురి నడుమ విరూపాక్షుడు
తురగ స్యందన యుత రణధుర్యులతో గా
పరి యగు, స్వయముగ నే ను
త్తర దిశ రక్షించుచుందు దగు సైన్యముతో.

421. అనుచున్ దగు నాజ్ఞ లొసగి
యనీకినుల మోహరించి హర్మ్యంబునకున్
జనె రావణుండు పుర ర
క్షణ సన్నాహమ్ము లరసి సంతుష్టుండై.

### శ్రీరాముడు రణవ్యూహ నిర్ణయము సేయుట

422. హనుమత్సుగ్రీవ కుముద
పన సాంగద నీల జాంబవంతులు మైందుం
డును ద్వివిదుండు మొద లీ్వ
రనికాయము తోడ రామలక్ష్మణు లుండన్.

423. చనుదెంచి చెప్పె బుర ర
క్షణ సన్నాహమ్ములన్ దశాస్యుం డొనరిం
చిన తీరు విభీషణు డం
త నిజామాత్యుల్ వచించిన విధానమునన్.

424. అనుసరణీయ విధానం
బనవరతాక్లిష్టకర్మడగు రాముడు యో
చన సేసి వానరేంద్రున
కనె లంక న్ముట్టడింప ననువగు తీరున్.

425. తూరుపున బ్రహస్తునితో
బోరును నీలుండు, వాలి పుత్రుండు యమ
ద్వారమున మహాపార్శ్వుని
వారుణదిశ రావణి దలపడు వాయుజుడున్.

426. అలుక గదుర నుత్తరదిశ
నిలిచి దురాత్ముండు దుర్వినీతుండు తపః
కలితవర గర్వమత్తుడు
పలల విభుం దాకి కూల్తు స్వయముగ నేనున్.

427. వనచరపతి సుగ్రీవుడు
దనుజేశ్వర సోదరుం డుదగ్రుండు విభీ
షణుడున్ భల్లూకపతియు
జని పురగుల్మమున బోరు సల్పంగ వలెన్.

428. సమరము సేయ వలె గపులు
తమ తమ స్వాకృతుల తోడ దా మెల్లరకున్
దమవారల గుర్తింపగ
నమరు నభిజ్ఞ యది వాన రాధిపు లారా!

429. హనుమ త్సుగ్రీవులు ల
క్ష్మణుండు నీలాంగదులును మన చెల్మి విభీ
షణుడు న్నెనును గదనము
పొనర్తుము మనుష్యరూపముల దెలియుండీ!

**శ్రీరాముడు సువేల నధిరోహించుట**

430. అనుచుం దగు విధి గట్టడి
నొనర్చి రాఘవుడు చనియె నుత్సాహముతో
నినతనయాదులు దో రా
మనోహర సువేల శైల మాలావళికిన్

431. ఆ నిశి సువేల పర్వత
సాను శిఖర వికసిత తరు శాఖా వాసా
నూన మనోజ్ఞ శకుంత వి
తాన కలస్వాన రంజిత స్వాంతుండున్

432. నవవికసిత కువలయ గం
ధవాహ మృదు శీత మారుత సుఖ స్పర్శా
వివశాంగుండును జ్యోత్స్నా
ధవళిత లంకా విలాస దర్శన రతుడున్.

433. అద్యతన భావి సమర స
ముద్యమ జయలాభ బంధ ముక్తావనిజా
హృద్య శర చ్చాంద్రీ హా
సోద్యన్ముఖ దర్శ నాశ యోత్సాహియు నై.

434. కదపె సుఖమ్ముగ ననుజ
న్మొడు తోడుగ రాము డంత బూర్వదిశన్ వె
ల్వడె సంధ్యారుణకాంతులు
కడుకొని చెలరేగె బక్షిగణ కలరవముల్

435. కమల సుగంధ భరిత మల
య మారుతము వీచె, రాము డంగద సుగ్రీ
వ మరు త్పుత్రాదులతో
సమరవిధానము విమర్శ సలుపుచు నుండన్.

సుగ్రీవుడు రావణునితో ద్వంద్వ యుద్ధము సేయుట

436. సైనిక సంచలన ధ్వని
నానావిధ శంఖ తూర్య నాదంబులు లం
కానగరవీధుల న్వీన
సైనన్ దృష్టి లడరించి రచ్చోటునకున్.

437. అంబరచుంబి మహాసౌ
ధంబున మణిరత్నరాజితకిరీటము మూ
ర్ధంబున భాసిల్లగ నీ
లాంబుదకాయుండు రావణాసురు గనగన్.

438. అనిలోద్ధూత దవదహన
మనంగ గోపమున రేగి యర్కజు డత్ర
మ్మున నెగసి వామపాద
మ్మున దన్నె దశాస్యు మకుటభూషిత శిరమున్.

439. రవిపుత్ర పాద తాడిత
దివిజారి శిరోవిభాసి దివ్యకిరీటం
బు వసుమతి దొరల తద్ర
త్న వజ్ర వైడూర్యములు చెదరె నల్దెసలన్.

440. ఆగ్రహమున నెదిరించె ద
శగ్రీవుడు ద్వంద్వయుద్ధచాతుర్యమునన్
సుగ్రీవు బరస్పరహన
నో గ్రంబుగ బోరి రిర్వు రుద్ధతి మెఱయన్.

441. డాయుచు దూరము జని ప
ట్టీయక తొలగుచు నొరు నొరు నేమార్చుచు బి
ట్టేయుచు జేతులు సాచుచు
గాయము గుంచించుచు వెనుక కొగి నొదుగుచున్.

442. పిడికిట బొడుచుచు గ్రుద్దుచు
బుడమి బడం ద్రోసి యెగసి భుజబంధంబుల్
సడలగ గ్రుమ్మచు దన్నుచు
నుడుగక చిత్రభ్రమణము లొనరించుచునున్.

443. ఆలీఢ మండల ప్ర
త్యాలీఢ పదమ్ము లెఱిగి యల వైష్ణవమున్
హేలగ వైశాఖంబును
గాలోచితముగ నెఱపుచు గపియు బలలుడున్.

444. వ్యాయామ కర్క శాంగు ల
మేయబలులు గడగి వ్యాఘ్రమృగరాజములో
తోయధులో మత్తగజము
లో యన బోరిరి పిరుతివకుండ జలమునన్.

445. తనువెల్ల నెత్తు గారగ
వనచరవల్లభుడు దానవవిభుండున్ బూ
చిన కింశుకమ్ము లనగన్
గనవచ్చుచు నల్పిరి కదనము బీరమునన్.

446. ఆయెడ దానవ నాథుడు
మాయ బ్రయోగింప బూన మర్కటపతి వై
హాయస వీధి కెగసి తా
వాయుగతిం జనియె రాఘవ విభుం జేరన్.

447. ఇంతటి సాహసమున్ గా
వింతువె నా కెఱుగ రాక వీరుండవు దు
ర్దాంతుండవె యయ్యు దశా
స్యాంతికమున కొక్కరుండ వరుగం దగునే?

448. రాజులకుం గూడని దీ
యోజం దామె చనుట కపియూథేంద్ర! నయ
భ్రాజితు డగు భటు నంపం
గా జను సుమి! యిట్టి దౌత్యకార్యము లైనన్.

449. ధరణిజయు దమ్ములున్ నే
నరయగ దావక సహాయ మాధారముగా
దరియింప జూతు మాప
చ్ఛరనిధి సేయకు మికిట్టి సాహస మెప్డున్.

450. అనుచున్ రాముడు మృదువుగ
నినసందను మందలింప నిట్లనియె నతం
డు నతుండై దుష్టుడు రా
వణు జూడ న్గోప మిటికి వచ్చె ప్రభూ! మదిన్.

451. ఇరుగడ దరుణులు వింజా
మరలన్ గొని వీవ గొల్వ మధ్యంబున నా
దురితాత్ముడు నీ కాంతా
హరుండు రాజిల్లు టోర్వ నైతిన్ రామా!

452. నరులును గ్రోతులు సుర దు
ర్నిరీక్ష్యు డగు ద న్నెదిర్ప నేర్తురె యనుచున్
దురహంకృతి యగు దశకం
ధరునకు జవి చూపితి రఘుదాసు బలంబున్.

453. రావణ వధముం జేయగ
నీవ తగుదు వం చుడిగితి నే నను నా సు
గ్రీవుం గౌగిట గొని ముద
మావహిలగ రాఘవేశు డభినందించెన్.

## అంగదుని రాయబారము

454. గిరినుండి డిగ్గి రాత్రిం
చర పురమున్ ముట్టడింప సన్నాహంబుల్
బరికించి రాజనీతిన్
స్మరియించి యుపాయవిదుడు క్ష్మావిభు డంతన్.

455. యువరాజగు నంగదు బి
ల్చి వచింపుము రావణునకు జిత్తస్థైర్యం
బవలంబించి యనుచు గొ
న్నివాక్యములు సెప్పి యనుప నింగి కెగయుచున్.

456. క్షణమున రావణు జేరం
జని పల్కె నతండు వాలినందనుడన్ రా
మనృపతి దూతగ వచ్చితి
నను నంగదు డండ్రు విన్ము నా ప్రభు వాక్కుల్.

457. అడవుల నుండంగ మమున్
గడుదూరముగ జన జేసి కైతవకలితా
త్ముడవై హరించితివి నా
పడతి ధరాత్మజ, యధర్మ వర్తన నిరతిన్.

458. సుర కిన్నర గంధర్వుల
బరమ తపస్వుల జగచ్ఛుభంకర కార్యై
కరతుల బతివ్రతల నెం
దఱినో బాధించి తీవు దర్పితమతివై.

459. నీ కింక ధరిత్రీరా
జ్యైకసుఖము లంతరించె నాయువు మూడెన్
లోకత్రాసకరుండవు
పోకార్చెద నిన్ను నిశిత పుంఖక్షతులన్.

460. నినుగూర్చి భవత్కృత పా
పనిష్కృతిం గూర్చి నిన్ను బరిపూతుంగా
నొనరించెద మదధీనం
బు నీదు జీవితము పంక్తిముఖ! తలపంగన్.

461. తుదిసారి చూచుకొనుము భ
వదీయ పుర వైభవంబు భావంబున కిం
పు దలిర్ప సల్పుకొను మౌ
ర్ధ్వ దైహికక్రియలు గూడ రావణ యిపుడే.

462. భండన విద్యల మేటి మ
గండ నటంచున్ నిలింప గంధర్వాళిన్
జెండితి నంచున్ గర్వాం
ధుండవు నీ బలము నా యెదుట జూప దగున్.

463. నా పాదంబులు వట్టి మ
హా పూజ్యులసచ్చరిత్ర నవనీతనయన్
నా పొంతం జేర్పుము నీ
పాపము లెల్లన్ క్షమించి బ్రతుకగ నిత్తున్.

464. అటు కాదేనియు రావణ!
యెట కేగిన నైనను వ్వధించెద నిను నా
పటుశస్త్రంబుల నని సే
యుటో! శరణం బనుటో బుద్ధి యోచింపు మికన్.

465. అనినన్ బంధింపుడు వీ
ని నంచు రావణుడు క్రోధ నిర్భరమతి నా
ర్వ, నలువు రసురభటుల్ హు
మ్మనుచున్ లంఘించి తాకి రయ్యంగదునిన్.

466. తులువల నా నల్వుర జే
తుల నిరికించుకొని యంగదు డకుంఠిత దో
ర్బలమున దివి కెగసి ధరా
స్థలి గొట్టగ నెత్తు రుమిసి చచ్చిరి వారల్.

యుద్ధారంభము

467. అంగదుని రాయబారము
సంగత ఫలదాత కాక చన రాము డికన్
సంగరమె కార్య మని విం
టింగొని కావించె జ్యాధ్వని నభం బద్రువన్

468. సమరారంభము సేయం
గ మహీపతి యాన తిచ్చె గదలుం డంచు
న్గ్రముగ జమూపతి ప్రోత్సా
హముసేయగ నురికె వానరాశి వడి వడిన్

469. శిలలున్ భూరి మహీరుహ
ములు గొని పదఘట్టనముల భూతల మ్మదురన్
గళగర్జాధ్వని యభ్ర
స్థల విస్ఫోటం బొనర్ప జనిరెల్ల కపుల్.

470. తూరుపు దిశ నీలుండున్
వారుణదిశ కేగి వాయునందనుడు యమ
ద్వారంబున నంగదుడున్
వారక గూల్పం గడగిరి ప్రాకారంబున్.

471. అనుజన్మ గూడి యుత్తర
మున నిల్చెన్ రాఘవుండు మొనకుం గాపై,
దనుజాధిపుండు రావణు
డని సేతకు నానతిచ్చె నాత్మభటులకున్

472. జయము జయము రామునకున్
జయము సుమిత్రా సుతునకు నగచరపతికిన్
జయము జయమంచు నవిరత
జయధ్వనులు సేయుచు గపిసంచయ మెల్లన్.

473. ప్రాకారకుడ్యముల కెగ
బ్రాకుచు గోపురముల గరపదఘాతములన్
బ్రాకుల శిలలన్ గూల్చెడు
నా కపులం జూచి రావణాసురు డంతన్.

474\. కోట బయటికిం బోయి వ
నాటుల దాకగ ముదల యొనర్చ నిశాటుల్
మేటిమగలు జతురంగ బ
లాటోపమ్మున జయవిజయ ధ్వను లెసగన్.

475\. భేరీ కాహళ పటు శం
ఖారవములు వీర యోధ గర్జలు గజఘీం
కారములు దురంగమ హే
షా రథచక్ర ధ్వనులును జ్యాఘోషంబుల్.

476\. చెలగ బురి న్వెల్వడి ని
స్త్రుల చాప పరశ్వ థాసి తోమర శూలా
దుల జెండాడిరి కపిమూ
కల పీకం దాకి దశముఖ జయార్థముగన్.

478\. కులిశ ప్రతిమాన నఖ
మ్ముల గుండెలు వ్రచ్చి వాలముల జుట్టి ధరా
స్థలి గొట్టియు గనుగ్రుడ్లు పె
కలించి వదనముల గీరి కపు లుగ్రముగన్.

478\. తలపడి పోరి నిశిచరా
వళి గూల్చిరి చెలగి మత్తవారణదంతం
బులు పెరికి ముష్టిఘాతం
బుల వాజుల గూల్చిరి భగ్నము సలిపిరి మొనన్.

479. ఆ రీతి దుములయుద్ధము
ఘోరంబుగ సాగ ధరణి గూలి రసంఖ్యుల్
దారిత కర పద మస్తకు
లై రాక్షసులున్ గపులు రణాంగణ మందున్.

480. పరసైన్యహంత యంగదు
నురమ్మున గదా ప్రహార మొనరించె మదో
ద్ధురుడై రావణి, యచల
స్థిరుడై యంగదుడు కూల్చె దితిజు రథంబున్.

481. చెలరేగి ప్రజంఘుం దను
పలలుడు సంపాతి నేసె బాణత్రయి నా
వలముఖు దేచి ప్రజంఘున్
బొలియించె సుదీర్ఘ సాల భూజ క్షతులన్.

482. బలశాలి జంబుమాలి క
నలి రథశక్తి వ ఘుచె బవనతనయు వక్ష
స్థల మవియ బావనియు గర
తలమ్మునం జఱచె వాని దద్రథ గతుడై

483. తనపై భయంకర రాకా
ర నాదముల తోడ వచ్చు ప్రతపను నీక్షిం
చి నలుండు రయమ్మున జని
కనుల్ పెఱికివైచె శితనఖమ్ముల చేతన్.

484. కావరము పెంపున శితశ
రావళి నదరించుచు వివృతాస్యుండై రా
గా విదళించె బ్రఘను సు
గ్రీవు డదరి సప్తపర్ణ వృక్షము చేతన్.

485. ప్రకటపరాక్రమమున న
గ్నికేతు సుప్తఘ్న రశ్మికేతువులున్ సా
యక తతి బరగించిరి య
జ్ఞకోప సహితముగ రామచంద్రు పయి వెసన్.

486. దరహాసభాసితాస్య ద
దరించె రాముడు శరంబు లన్నాల్గు నిశా
చర మస్తకంబులు దృటిన్
దర ద్రెళ్ళె గవోష్ణ రుధిర ధారల తోడన్.

487. బలితపు బిడికిటి పోటుల
నలవోకగ గూల్చె మైందు డశ్వంబులతో
నిల వజ్రముష్టి యను న
ప్పలలుం డెదిరించి బాణవర్షము గురియన్.

488. నీలాభ్రంబు పయి గిరణ
జాలము బరగించు తపను చందం బలరన్
నీలు పయి నికుంభుడు శర
జాలమ్ము బఱపి నిలిచె హసన్ముఖు డగుచున్.

489. నీలుం డయ్యది సైపం
జాలక వడి నేగి రథ్య సారథి యుతుగా
గూలిచె నికుంభు శితకర
వాలమ్మున భగ్న మయ్యె బదహతి రథమున్.

490. అశనిప్రభు డను వాని గు
లిశదేహుండు ద్వివిదుం డలిగి దారుణ భూ
రి శిలా మర్దితు జేయం
గ శితశరము లేసె వాడు గపిదేహమునన్.

491. సాలం బొక్కటి చేతం
దాలిచి ద్వివిదుండు రేగి దర్పోల్లాసుం
డై లీలగ దాడింపన్
గీలాలము గ్రక్కి కూలె నేల నసురుడున్.

492. కాంచన శిలీముఖంబుల
జంచద్గతి బఱపి తనువు జర్జరితము గా
వించెన్ విద్యున్మాలి యు
దంచద్విక్రము సుషేణు, నంత నతండున్.

493. పొలివోక నిల్చి దారుణ
శిలాప్రహారమ్ముల గవిసె సుషేణు నుర
స్థలి వైచెం గద బలలుడు
వలముఖుడు నొక్కెదె దానవ తనువు దానన్.

494. కీలాల ముమిసి విద్యు
న్మాలి గతాయుష్కు-డయ్యె ధాత్రిం బడి లాం
గూలాయుధుం డరిగె పీ
రాలాపము లాడుచు నసురాళి గవియగన్.

495. ఆగతి ఘోరం బగుచున్
సాగె రణంబు కపి రాక్షస బలంబులకున్
భూ గగన వ్యాప్తములై
మ్రోగె ద దుత్సాహ జన్య భో భో రవముల్.

496. తలలు తెగి కూలినను బరు
వులు మానని మొండెముల నపూర్వాభరణో
జ్జ్వల కర చర ణాద్యంగ శ
కల వా హాస్య గ్ధురుల వికట దృశ్యంబై.

497. కనవచ్చు రణాంగణమున
వినవచ్చె నభంబు ముట్ట వికృతాంగ కపి
క్షణదాచర కృత హాహా
స్వనంబులు శివారుతములు సంకులములుగన్.

498. అంత దివాకరు డపర ది
శాం తర్గతు డయ్యె జగతి సాంధ్య మలమె దు
ర్ధాంత వినూత్న బలా త్త ప
రంతప తేజులు నిశాచరవరుల్ కడకన్.

499. దురమునకుం గడగి కపీ
శ్వర మండలి గని మసంగి జక్కడచిరి దు
ర్భరముగ బోరిరి రాత్రిం
చర మర్కట భేద మెఱుగ జాల కవశులై.

500. ఒరు నొరు హింసింపన్ సా
గిరి రక్కసు డీవు నీవు కీశుడ వంచున్
హరి రాక్షస భటవర్యులు
బరస్పరము రమ్ము రమ్ము పొఱకు మనుచున్.

501. యమశత్రు మహోదరులు శు
క మహాకాయు లతిభీమకర్ముడు వీరుం
డు మహాపార్శ్వుండును దు
ర్దమబాహుబలుండు వజ్రదంష్ట్రుడు నాగన్.

502. నుతి కెక్కిన దైత్యచమూ
పతు లార్వురు కడగి బాణవర్షంబు మహో
ద్ధతి గురియించిరి రామ
క్షితి నాథుం గవిసి చిమ్మ చీకటి వేళన్.

503. మెఱపులు మెఱసిన రీతిన్
బరంతపుడు రాఘవుండు బాణము లయ్యా
ర్వురిపై బరగింపగ బా
రిరి వారలు ప్రాణ భయ పరీతాత్మకులై.

504. పఱపె జ్వల ద్బాణపరం
పర రాముడు రాక్షసాళిపై ధారుణి ద్రె
ళ్ళిరి శిరములున్ గరమ్ములు
జరణము లూరువులు దెగి యసంఖ్యాకముగన్.

505. శర దంబరంబు డంబున
విరాజితం బయ్యె నప్డు వియదధ్వం బా
సురవైరులపై రాముడు
బరపిన జ్వలితాగ్రహేమబాణౌఘమునన్.

506. వనచరులం ద్రుంపుచు రా
వణపుత్రుం డింద్రజిత్తు ప్రబలుండై యే
చిన యోర్వలేక డాయం
జని వాలిసుతుండు క్రోధ సాహసములతోన్.

507. హరులం జంపి సిడంబున్
ధరణి బడంగొట్టి యత్యుదగ్రుం డగుచున్
గరవాలంబున సారథి
శిరంబు ఖండించి రథము శీర్ణ మొనర్పన్.

### రామలక్ష్మణులు సర్పశరవిద్ధులగుట

508. చనె నంతర్హితుడై రా
వణి కదనాంగణము వీడి వైహాయసవీ
థి ననీకిని యెల్ల నుతిం
చె నంగదు భుజాబలంబు స్థిరచిత్తమ్మున్.

509. యువరాజు పరాజితు జే
సె వియచ్చరవైరి నింద్రజిత్తు ననుచ రా
ఘవున కెఱింగించిరి హ
ర్ష విస్ఫురిత నేత్రులు గపి సైన్యాధీశుల్.

510. రాముడు వారల కిట్లనె
నామోదం బయ్యె గాని యసురుడు బహుమా
యామర్మవిదుడు దూర్తుం
డామెయి బోవడు ప్రమత్తులై యుండకుడీ!

511. ఎటునుండి వచ్చి తాకునొ!
కుటిలుం డాతండు గాచుకొని యుండుడు మీ
రట నెల్ల రంగదు భవ
త్పటుశక్తిం గార్యసిద్ధి దనరు జనుండీ!

512. అనుచుండ వచ్చి పడె ల
క్ష్మణుపై శ్రీ రాఘవు పయి సర్పశరంబుల్
గణనాతీతముగ నభ
మ్మున నుండి క్షణమ్మున బద భుజ బంధములై.

513. ధరణి బడి రవశులై దా
శరథులు హెచ్చె గపిరాజు సైన్యంబున శో
కరవంబులు దుష్ట నిశా
చర దూషణ మార ణోగ్ర శరపాతాళుల్న్.

514. ఎదుట బడి పోరు సల్పం
గ దుష్కరము గాన దశముఖసుతుం డీ రీ
తి దనుజమాయ బ్రయోగిం
చి దశరథాత్మజుల నొంచె ఛీ ఛీ యనుచున్.

515. కపియోధు లందరు విషా
దపరీతాత్ము లయి యవనతవదనులై ని
ల్చి పురుషవరేణ్యులు బరం
తపు లగు దాశరథుల సవిధంబున నుండన్.

516. ఈ రీతి నింద్రజిత్తనె
నా రూపము గాంచలేరు నా పలుకులనే
మీ రాలింప గలరు కపు
లార! దురం బెట్లు సల్ప నగు నాతోడన్?

517. మీ రెల్లరు గనుచుండగ
నీ రాముని లక్ష్మణు బడనేసితి నింకన్
వారక నిల్చెడు మిమ్మున్
దారుణి గూల్తు సమర మది తాన ముగియగన్.

518. చచ్చిరి రాముడు దమ్ముడు
జచ్చిరి సుగ్రీవ పవనజ ప్రభృతి కపుల్
వచ్చె రిపుసైన్య మెల్లయు
నిచ్చ మెయి సుఖింపు మం చనెద జనకునితో.

519\. అనుచున్ సునిశిత బాణము
ల నేసి నొప్పించె రామ లక్ష్మణులన్ బా
వని ముఖ కపివీరుల రా
వణపుత్త్రుం డుద్ధతి మెయి బరిహాసమునన్.

520\. హతులైరి దశరథమహీ
పతి సుతులను నింద్రజిత్తు పలుకు ల్విని నం
దితులై యొనర్చిరి దితిజు
లతివేలముగ జయ జయ మహాధ్వానములన్.

521\. ఇనజుఁడు విషణ్ణచిత్తం
బున వందురు చుండ దైత్యముఖ్యుండు విభీ
షణు డిట్లనె గను మీ పా
వనమూర్తుల గనబడ వశుభ నిమిత్తంబుల్.

522\. వదనాబ్జంబులు వాడవు
చెదరవు చిర్నగవులు ముఖసీమల బ్రభ మా
యదు కన్నుల బరిశీలిం
ప దుష్ట లక్షణములె యివి మార్తాండ సుతా!

523\. వీరు సజీవు లగుట నిజ
మారయ గల్పించె నిట్టు లారడి దుష్టుం
డా రావణి నమ్మకు వా
డీ రాజకుమారుల బొలియించు ఘనుండే.

524. మీ రిట ముహూర్త మోపిక
గా రాముం డ దనుజన్ము గనుచుండుడు దు
ర్వార పరాక్రమ ధుర్యులు
వీరును దేరం గలారు స్పృహ లభ్యంబై.

525. అనుచున్ ధైర్యంబు గఱపె
నినజునకు విభీషణుండు హృదయమ్మున రా
ముని గొనియాడుచు నహి మో
క్షణమునకుం గా నిరీక్ష సలిపిరి కపులున్.

526. జయ గర్వాటోపమ్మున
రయోద్ధతుం డింద్రజిత్తు రాక్షసపతి వి
స్మయముం జెందగ బల్కె వ
ధియించితి రాము గూల్చితి ద దనుజన్మున్.

527. సర్పశర విద్ధులుం గా
నర్పణ సేసితి ధరిత్రి కవ్వారల దో
ర్దర్పము మెఱయగ జనక! య
హర్పతి తనయాదులు వెఱగందుచు నిల్వన్.

528. ఇచ్చ మెయి బ్రవర్తింపుము
వచ్చిన వారె పవనాత్మజ ప్రముఖులు వై
యచ్చర నర వానరులన్
వచ్చెడు వా డెవడు నీకు బగవా డింకన్.

529. అనినన్ హర్షించి దశవ
దనుండు ఋరి జాట బంచె దర్పంబున నం
దన విజయోత్సవమున్ భూ
షణావళి బహూకరించి సంతుష్టి మెఱిన్.

530. అంతట బోక నిశాచర
కాంత త్రిజట జీరి పుష్పకమ్మున సీతా
కాంతన్ గొని చూపు మనియె
నెంతయు గసి దాశరథుల మృతదేహములన్.

**నాగపాశబద్ధులైన రామలక్ష్మణుల జూచి సీత విలపించుట**

531. అనుడున్ త్రిజటయు నట్టులె
యొనర్చె వైహాయసమున నుండి రణోర్విం
గని సుప్తు లట్లు శయనిం
చిన యా రాఘవుల గాంచి సీత యదలుచున్.

532 విలపించె నిట్లు హా రా
మ! లక్ష్మణా! హా! విధి కృప మాసెనె! యశనుల్
దలపై బడుగతి దుర్వా
ర్తలు విన నయ్యె గడు దుర్భరంబులు గాగన్.

533. పారము గన రా నంతటి
వారిధి బంధించి దాటి వచ్చియు నాథా!
యీ రీతి బడితె లంకకు
జేరువ గోష్పాద మంత చిన్న మడుగునన్.

534. వరుణైంద్రాగ్నేయములన్
మఱి బ్రహ్మశిరంబు నాగ మహితాస్త్రము లొం
దిరి రామ లక్ష్మణు లవియు
కొఱగా కున్నయవె రిపుడు కోట్లల నేయన్!

535. సతివై క్షితినాథుండగు
పతికిన్ బట్టాభిషేకభాగ్యంబును సం
తతియున్ గాంతు వటంచున్
క్షితిసురు లన్న విక నెట్లు నిక్కంబు లగున్.

536. చరణముల బద్మరేఖలు
తరుణుల కత్యంత భాగ్యదంబు లగు నటం
దురు సాముద్రికు లయ్యవి
పరిస్ఫుటంబులు మదీయ పాదము లందున్.

537. సమములు సూక్ష్మములున్ గే
శములు, భ్రువులు నా కరయ నసంగతములు నీ
లములున్, జంఘలును సువృ
త్తములున్ రోమరహితములు దనరు న్నాకున్.

538. అవిరళములు రదములు శం
ఖ విలోచన పాద గుల్ఫ కర యుగ్మము లూ
రువులు గరము బటువులు ప్రే
శ్నివియున్ స్నిగ్ధంబులు ననువృత్త నఖములున్.

539\. తలపంగ మగ్న చూచుక
ములు బీనమ్ములు నవిరళములు నాదు కుచం
బులు మాంసలములు వక్ష
మ్ములు పార్శ్వమ్ములు ముఖాబ్జము శుచిస్మితమున్.

540\. ఇల దాకుం బద పాదాం
గుళులు, సమగ్రములుగ నెసగుం జూమి యవరే
ఖ లరయగా నచ్ఛిద్ర సు
లలిత కర చరణతలంబుల ననూనమ్ముల్.

541\. మణిసన్నిభ మగు నన్మ
త్తనువర్ణంబు, మృదువులగు దనురుహములు నా
భి నతం బగు నివి శుభల
క్షణముల్ గాగ వచియింత్రు కన్యల కరయన్.

542\. ఈదృశ శుభ లక్షణ తతి
చే దనరారుట జలనిధి సీమిత సామ్రా
జ్యాదీశ్వర రాజ్ఞీ యో
గాదు లౌదవు నా కనిరి ధరామర వర్యుల్.

543\. విధవాయోగము లే దని
రి ధవుండు బహు సవన ప్రవృత్తుం డై యే
లు ధరిత్రి జిరం బనిరి వి
తథీకృతము లౌకొ్కొ యవ్వి దైవ వశమునన్.

544. ఎదుట బడి పోరె నేని జ
గదేకధానుష్కు రాము గవిసి జయింపం
గ దరం బెవ్వరి కగు మా
య దాల్చి పడవైచె గాక యసురుడు వారిన్.

545. ప్రాణమ్ములలో బ్రాణము
గా నీ మహితాత్ము రాము గన్నది కౌస
ల్యానారీమణి యెట్టి వి
ధానంబున నునయింప దరమగు నావెన్.

546. ఇక రెండు మూడు దినముల
వికృతానను రావణు నరిభీకరముగ గూ
ల్చి కలత దీర్తువు నా కని
యొకింత ధృతి బూని యుంటి నుసురులు నాథా!

547. ఇక నెట్లు పాయ నేర్తు ద
శకంఠు జెర, మరణ మొండె శరణం బగు గా
ని కలదె వేర తెరు వనుచు
సకరుణముగ నేడ్వ, ననె ద్రిజట భూమిజకున్.

త్రిజట సీతనూరార్చుట

548. అవనిజ! వగ గూరిన దా
న వగుట జక్కగ గనుంగొనం జాలవు రా
ఘవుల ముఖభంగిమల దో
ప వెట్టి యవలక్షణములు బరిశీలింపన్.

549. హాయిగ నిదురించెడు వా
రో యనగా గానబడుదు రో యంగన! యా
మాయల మారి శరంబుల
కే యసువుల్ గోల్పడు బలహీనులె వీరున్?

550. కపిసైన్యంబులలో దుః
ఖ పరీతులు గానబడరు కదన సముత్సా
హ పరవశులె గాని వనిత!
నృపు డీల్గిన నిట్టు లుందురె చమూనాథుల్?

551. ఈ వగ నిర్హేతుక మగు
బావనమూర్తులు జగచ్ఛుభంకరు లీ తే
జోవైభవు లోడుదురే
రావణి యను నొక్క యల్ప రాక్షసు చేతన్.

552. పదిల మొనర్చు కొ మ్మిక
హృదయమ్మును, నీ విభుండు రిపు విజయోత్సా
హ దృగభిరాముడు గూర్చున్
ముదంబు నీ కనతికాలమున నూరడుమా!

553. అనుచు ద్రిజట యుపదేశిం
చి నివర్తించి కొని చనియె సీత విమాన
మ్మున న య్యశోకవని సాం
త్వన వచనము లాడి తేర్చె భాస్వన్ముఖి గాన్.

**రామలక్ష్మణులు బంధముక్తులగుట**

554\. వానర యూధపతుల్ పవ
మానతనయ పనస నీల మైంద ద్వివిదుల్
భానుసు తుడు గ ర్తవ్య వి
ధాన స మాలో చనమున దర్కిం చు నెడన్.

555\. వానర భిష గ్వరుండు సు
షేణుం డిట్లనె రవిసుతు చెంత కరిగి, యీ
మానవ నాథుల దేర్పం
గా నను వైన వెరవొండు కలదు వినుండీ!

556\. మును దేవాసుర యుద్ధ
మ్మున దేవగురుం డవితథముగ బూని చికి
త్స నొనర్ప బ్రతికిరి నిలిం
పనాథ భటవితతు లెల్ల మంత్రౌషధులన్.

557\. వరమహిమము లోషధులన్
దిరముగ క్షీరాబ్ధి ధారుణి ధరప్రస్థాం
తర వితతి బొదుకొల్పి ర
మరులు జగచ్చోభన కర మానసు లగుచున్.

558\. రవిసుత! సంజీవకరణి
యు విశల్యకరణియు నాగ నున్నవి తద్ది
వ్య వనౌషధి చయమున న
య్యవి తెప్పింపుము చికిత్స కవిలంబముగన్.

559. అనుచుండ వచ్చె నప్పుడు
వినతాసుతుడు గరుడుండు విన్వీథి గరు
జ్జనిత ప్రభంజ నోద్ధూ
త నీర దాంబుధితరంగ తరు సంచయుడై.

560. గరుడుని దర్శన మైనం
త రాఘవ తనూ నిబంధిత మహా దర్వీ
కర జాలము విచ్చె నహ
స్కరప్రభావళి దమిస్ర జాలము బోలెన్.

561. పాప శర బంధ ముక్తిన్
బ్రాపిత చైతన్యు లగుచు రఘువీరుల్మి
హోపశమనంబు దేజో
ద్దీపనముం గనిరి వైనతేయుని స్పర్శన్.

562. వినతాసుతునకు రాముడు
వినతుం డై యిట్టు లడిగె విపదంబుధి గూ
రిన మము గాపాడితి వి
ట్లనుకంపం బూని మోద మయ్యె న్నాకున్.

563. అరయ సుపర్ణుండవు ది
వ్య రత్న స గ్గంధ కాంచ నాంబర భూషా
ధరుడవు తేజోవంతుడ
వెరుంగ బలుకుము మహాత్మ! యీ వెవ్వడవో!

564. నిను జూడగ మా జనకున్
గని నట్లగు మానసమ్మున కనిన గరుడుం
డనె దశరథనందన! నీ
కనురూప సఖుండ ద్వి ద్ధితాచారుండన్.

565. గరుడుడ వినతా తనయుడ
నరివర్గంబున్ వధించి యవనీతనయన్
జెఱ విడిపించి యయోధ్యా
పురి రాజ్య సుఖంబు లందుము యశం బెసగన్.

566. అనుచు ననుజ్ఞం గైకొని
వినతా సుతు డేగె నభ్ర వీథి జయజయ
ధ్వనులున్ భేరీ తూర్య
స్వనములు గర్జలును జెలగె వానర తతులన్.

రావణుడు ధూమ్రాక్షుని యుద్ధమున కంపుట

567. పరమ ఉరిమి నట్టులు సా
గరములు ఘోషించి నట్లు కపిచము పుగ్ర
స్వరముల మ్రోయుచు రాత్రిం
చరముఖ్యుల గూల్ప గడగె సత్త్వాధికమై.

568. వానర సైన్యోద్ధుర గ
ర్జా నాదములు న్నిశాచర చమూ కృత హా
హా నాదములున్ బెల్లై
దానవ నాథ శ్రవణ విదారకములు గాన్.

569. మనసు చెదరిన దశగ్రీ
వునకున్ వేగు లరుదెంచి భుజగ శర విమో
చన మందిరి రాముడు ల
క్ష్మణుం డని వచింప బ్రాణ సంకట భీతిన్.

570. వర దత్త ఘోర దర్వీ
కర శరముల్ నిష్ఫలములు గా బోయె నటం
చురగమ్ము భంగి రోజుచు
బరమ క్రోధమ్మున దశవదనుం డంతన్.

571. బలవ ద్రాక్షస సేనా
కలితుగ ధూమ్రాక్షు నంప గాకుత్స్థులతో
దలపడ గర్వోన్మత్త
ప్రలాపముల నేగె వాడు బహ్వాయుధుడై.

572. వరుణ దిశా ద్వారమునన్
బరతెంచు సురారి వీరవాహిని గని వా
నరు లుగ్రత పై బడి సం
హరించిరి శిలా ధరారు హాఘాతములన్.

573. దివి కెగసి పైకి దూకి న
ఖవితతి వదనముల గీటి ఖరదంష్ట్రల ను
ద్దవిడిన్ గండలు పీకి ప
దవైచి పిడికిట బొడిచి యదంచి రసురులన్.

574. కరవాల శూల తోమర
పరశ్వథ ముసల గ దాసి బాణాసన ము
ద్గర పట్టిస చక్రాదుల
హరిసైన్యము గూల్చి రసురు లగణిత సంఖ్యన్.

575. కపులు విజృంభించుచు పా
దప భూరి శిలా ప్రతతుల దాడించి యనే
కపకుంభ రథ ధ్వజ ర
థ్యపాద సూత రథికాంగ దళన మొనర్చన్.

576. కలగి కదన స్థలి న్ని
ల్వ లేక వె న్నిచ్చి భీతి పాఱ దొడంగన్
నిలు నిలు డంచున్ దటిమి క
షలు చెండాడిరి దివిజరిపు భట ప్రతతిన్.

577. మొన వెన్నాటుట గన్నం
తనె ధూమ్రాక్షుండు క్రోధ తామ్రాక్షుండై
ఘన ఘోషం బొనరించుచు
ఘనల శర వ్రాత మేసి యదరె గపులపై.

578. అక్షయ శర వర్షమున ర
ణక్షితి కం ఠోద రాస్య నాసా పద బా
హ్వక్షి కటి పుచ్ఛ జం ఘా
పక్షాంగ క్షత హత బహు వానర మయ్యెన్.

579. దవ దహనుండు చెలగి శు
ష్క వనం బేర్చు క్రియ రాక్షస శర వ్రాతం
బు వనాట తతి దహింపం
గ వివశ మై నాశ మయ్యె గపిచము వచ్చోన్.

580. అంత ననిలాత్మజుం డ
త్యంత క్రోధానల ప్రత ప్తాంగుం డై
పొంతం గల సాలంబున్
సొంతంబుగ బెఱికి విసరె నసురు శిరమునన్.

581. తునియ లొనరించె దాని గ
గనమ్ము నంద దనుజుండు గఱకు శరములన్
ఘనవేగమ్మున, శిలవై
చిన నట్ల యొనర్చె వాడు చిర్నగ వొలయన్.

582. తరువును శిలన్ బ్రబగ్న మొ
నరించి ధూమ్రాక్షు డనిల నందను పై వై
చె రయంబున గద నయ్యది
యురమ్ము దాకినను నోర్చి యుద్ధతి మెఱయన్.

583. గిరిశృంగం బొకటి పెక
ల్చి రయమ్మున వై చె దనుజు శిర మవియంగా
గరువలి సుతుండు చయ్యన
నరదము ను గ్గయ్యె సాశ్వమై సూతునితో.

584. తత్తరమున ధూమ్రాక్షుం
దత్తరి లంఘించె భూమి కనిలాత్మజుడున్
మొత్తె శిరంబున దా ను
ద్యత్తీవ్ర గమను డగుచు దత శిలా శకలిన్.

585. పలలాశి శిరము పలు వ్ర
క్కలై స్రవించె రుధిరంబు కాల్వలు గాగన్
జెలగెన్ హాహా కారం
బు లసురసైన్యంబుల వలముఖ గర్జలతో.

రావణుడు వజ్రదంష్ట్రు బంపుట

586. అనిలజు చే ధూమ్రాక్షుడు
రణమున నీల్గుట నెఱింగి రావణుడు మనం
బున జింత నొందియు రణ
మ్మున కనిపెన్ వజ్రదంష్ట్రు మూర్ఖుం డగుచున్.

587. దశవదన ప్రేరితుడై
దశరథనందన వధా కృతాత్ముండై చే
రె శమన దిగ్ద్వారం బం
త శతాంగము నెక్కి వజ్రదంష్ట్రు డురవడిన్.

588. అతులోద్యతాయుధధరులు
దితిజభటుల్ వెంబడి జని దీవ్యత్తేజో
ధృతిశాలి యంగదు బలం
బుతో గవియ ఘోర మయ్యె బో రిర్వురకున్.

589\. అంగదుడు వజ్రదంష్ట్రుడు
బొంగారు రణక్రియాసముల్లాసమునన్
సంగర మొనర్చి రన్యో
న్యాంగక్షతులన్ సలుపుచు నత్యుగ్రముగన్.

590\. దారుణ శిలీముఖము ల
వ్వారిగ నేసి యసురుండు వాలితనయు వ
క్షోరస్థలి నొప్పింపన్
ధీరత భగ్నం బొనర్చె దే రంగదుడున్.

591\. విరథుండు వజ్రదంష్ట్రుడు
ధరిత్రికిం డిగ్గి వాలితనయున్ గదచే
శిరమున మోదియు దలపడె
నురవడి లంఘించి మల్లయుద్ధమ్మునకున్.

592 ఇరువురు యుద్ధవిశారదు
లిరువురు బలవంతులున్ జిగీషువులు బర
స్పర హనన నాకాంక్షల బో
రిరి పెద్దయు తడ వస్పృ క్పరీ తాంగములన్.

593\. దనుజుండు క్షీణ బలు డగు
ట నెఱిగి వాలిసుతు డుత్కటమ్ముగ వాల
మ్మున జుట్టి మోదె బెనుశిల
దనుజాంగము దునియ లై చెదరె న ల్దెసలన్.

594. శకలీకృత దేహుం డై
వికృతమ్ముగ జచ్చిన రిపువీరు గని కపి
ప్రకరము గర్జింప గకా
వికలై పాఱిరి దనుజులు భీతి గదురగన్.

**రావణుడు యుద్ధమున శకంపను బంపుట**

595. ఆలమున వజ్రదంష్ట్రుడు
గూలుట రావణు డెఱింగి క్రోధ వశుండై
శైలస్థిరుం డకంపను
దోలెన్ బహుసైన్యయు క్తి దుర మొనరింపన్.

596. దాశరథులన్ జయింపుము
గీశ చమూ పతుల నెల్ల గీడ్వా టొందం
జేసి జయంబున్ గొని నా
యాశలు సఫలంబు సేయు మని బోధింపన్.

597. విపులం బగు తేరున గ
శ్యపాత్మజ ప్రబ నకంప నాసురు డేగెన్
గపిసైన్యము పై నురవడి
కృపాణ చా పాది రణ వరిక రాన్వితుడై.

598. రణ సన్నద్ధత బిశితా
శను లేతెంచగ, గపులును శౌర్యోద్రేక
మ్మున మార్కొనిరి తత శిలా
వనిరుహ ధరులై మహారవ సముద్భటులై.

599. కర చరణంబులు శిరము లు
దరంబులున్ వక్షములు విదారితములు గా
దరుచర రాక్షస భట యూ
ధ రోదన ధ్వనుల దిగ్వితతి మ్రోసె గడున్.

600. హరివిల్లు బోని చాపము
గరమున బూని యసురుం డకంపను డంతన్
శరవర్షము గురియ గపుల్
బరువెత్తిరి తాళలేక పావని కడకున్.

601. ఒడకు దోడకు డంచున్
గాడుపు కొమరు డభయ మొసగ న్నిలిచ్చి కపుల్
దాడించిరి రక్కసులన్
బోడిమి ధరణీరు హోత్క పుంజంబులచే.

602. అనిలజుడుం జెలరేగి య
శని సమ ముష్టుల బొడిచియు జరణంబులతో
ద నురములు బగుల దన్నియు
బెనుజెట్లం గొట్టియు గెడపెం బెక్కండ్రన్.

603. శర తరు నిర్భిన్నాంగులు
దరుచరులున్ రాక్షసులు వ్యధాకులు లగుచున్
బరు విడ సాగంగ నెగయు
ధరాపరాగమున గ్రమ్మె దమ మెల్లెడలన్.

604. కను గాన బడని యాంధ్యం
బున రాక్షస సేనలున్ గపులు మోహితులై
యనికిం గడంగిరి జన ని
ధనంబె ధ్యేయముగ స్వ పర తర్క రహితులై.

605. క్షతగాత్ర సైనిక చయో
ద్గ తాస్ర ధారల రజో వితాన మడంగన్
దితిజులు గపులున్ దలపడి
రతిభీషణముగ జయేచ్ఛ లారడి వెట్టన్.

606. అంతట నకంపనుడు దు
ర్దాంత పరాక్రమ మెసంగ నడరించె హనూ
మంతుని పై శరజాలము
సంతత వర్షాంబు ధార చందం బొప్పన్.

607. ఉరువేగంబున ననిలజు
దరి మూర్ధము మోదె బుష్పి తానోకహ సుం
దర ధరణీధర శృంగము
గరమ్మునం బూని క్రోధ కంపిత తనుడై.

608. భిన్నశిరస్కుం డై పడె
న న్నిర్జరవైరి ధాత్రి, హనుమయు గర్జిం
చె న్నఖి లాశా గహ్వర
భి న్నాదంబున దనుజులు బిట్టార్వంగన్.

609. రిపు వీర కంపన ప్రథి
త పరాక్రమ శాలి కూలె దానవ యూధా
ధిపవరు దకంపనుం డని
ప్రపీడిత స్వాంతు డైన రావణు డంతన్.

రావణుడు ప్రహస్తుని బంపుట

610. దనుజ ప్రధాన సైన్యా
ధినాథు రావించి పల్కె దివిజుల నోడిం
చిన వాడవు నీ కెదుటన్
రణమున గా లూన దుర్భరం బెవ్వరికిన్.

611. నరులున్ గపు లల్పులు దా
శరథి ననుం గెల్చు పేద సమరంబున గూ
లురు నిన్ను బోలిన రణో
ద్ధుర ప్రచండ ప్రతాప దోహలు లంచున్.

612. మది నమ్మి యుంటి గానీ
విదళించుచు నుండిరి మనవీరుల నాక్రో
శిదశపతులు ధూమ్రాక్షా
ది దనుజ నాయకు లరిగిరి దివికి ప్రహస్తా!

613. ఇక మనకున్ యుద్ధ మొన
ర్పక తప్పెడి దేమి? యింటి వాకిటికిం గొం
కక వచ్చిన రిపుడు వధిం
పకుండునె! రణంబు నేను మానిన నైనన్.

614. రణమున జయంబో యపజయ
మొ నిర్ణయించుట యసాధ్య మొకవేళ జయిం
చినను న్ జయింప వచ్చు, రి
పు నెదుర్కొను టె తగు ధర్మముగ నెంతు మదిన్.

615 ఐనను శూరుండవు వి
జ్ఞానివి నృపనీతి శాస్త్ర చతురుడవు ప్రహ
స్తా! నాకు హితుండవు భయ
హీనుడ వై తెల్పు మిప్పు డేయది తగునో.

616. అనినన్ ప్రహస్తు డిట్లనె
దనుజేశ్వర! మున్నె నిశ్చితం బయ్యెను రా
మునకున్ ధరణిజ నొసం
గనిచో ననివార్యము రణకార్యం బనుచున్.

617. సచివులు సైన్యాధీశ్వర
నిచయంబు రణ ప్రయత్న నిర్వాహకులై
రి, చిరయశోఽబ్ధికి, నిపు
డుచితా నుచిత ప్రశంస యోగ్యం బగునే?

618. నిరతంబు జూతువు సమా
దరబుద్ధి నమాత్య వర్గ దండపతుల న
న్నరిగెద దార సుతాదుల
బరిత్యజించి యని సేయ భవ దర్థంబై.

619. కను మే విధమున గ్రుక్కిం
తునొ యన్నర వానరాళి దురమున నంచున్
జనె బహ్వాటోపమ్మున
ననేక రథ గజ తురగ భ టాన్వితుండై.

620. అని సేయ జనె బ్రహస్తుడు
దనుజ భట జయ జయ సంతత ధ్వనులు న్వి
ప్రనిచయ మహ దాశీర్వా
దన భేరీ కాహళ నినదంబులు నెసగన్.

621. అంత బ్రహస్తు సచివులు న
రాంతక కుంభహనులున్ మహానాదుడు ధీ
మంతుడు సమున్నతుండున్
దంతుల పై జనిరి తోడు దర్పం బొప్పన్.

622. సమధిక సమ రోత్సాహము
న మర్కట చమూ వినాశనము సేయగ న
య్యమరారులు గడగ నెది
ర్చి మైందుడు నలుండు నిల్వరించిరి పెలుచన్.

623. అసుర ప్రయుక్త నానా
నిశితాస్త్రపరంపర ధరణిం గూలిరి ము
క్త శిరస్కులు నిర్భిన్నాం
గ సంధులై పెక్కు ఋక్ష కపి సైన్య భటుల్.

624. తరువుల గొట్టియు గొండ శి
ఖరముల వైచియును ఖర నఖ ప్రతతులచే
నురముల జీల్చియు భిదురో
గ్ర రద ప్రవిదారి తాంగులం జేయుచునున్.

625. పిడికిటి పోటుల బొడిచియు
బుడమి బడ నైృచి పాదముల ద్రొక్కియు జే
నడిచియు రాకాసుల ను
క్కడంచిరి కపు లని వారి తౌద్ధత్యమునన్.

626. శిర మవియ రువ్వె ద్వివిదుడు
నరాంతకున్నొక్క భూరి నగ శృంగమునన్
గరిమన్ గూల్చె సమున్నతు
ధరణీస్థలి దుర్ముఖుండు దరు తాడితుగాన్.

627. వృద్ధుండు జాంబవంతుడు
క్రుద్ధుండగుచున్ బెనుశిల గొట్టి యెదందన్
యుద్ధోన్మాదు మహా నా
దోద్ధతు జక్కడచె దుర్మదు మహానాదున్.

628. మో రాహవ ధూర్వహు డా
తారుండు విశాల సాల ధరణీరుహ భి
న్నోరస్కు జేసి కూల్చెన్
ధారుణి గుంభహను దైత్య దర్ప నిధానున్.

629. ఆ రీతి నల్వురుం గపి
వీరుల చేత న్మడియుట వీక్షించి సుప
ర్వారి పదతాడిత మహా
క్రూర భుజంగం బనంగ రోషోద్ధురుడై.

630. ఘోరమ్ముగ గర్జించుచు
ధారుణి తల మద్రువగన్ రథంబు బఱపుచున్
జ్యా రావము వైరి హృదయ
దారణ మొనరింప నదరి తతవేగమునన్.

631. ఆశీవిషోపమ ప్రద
రాసారము గురియ వానరావళి యుసురుల్
బాసె న్వేలకు వేలుగ
ద్రాసంబున బారిరి రణరంగంబున్యల్

632. నీలుం డడ్డం బై కపి
జాలము మఱలించి తాకె సాహస మొప్పన్
మూ లోన్మూలిత గగన స
మాలింగిత సాల హస్తు డగుచు బ్రహస్తున్.

633. ధను వా కర్ణాంతముగా
నొనర్చి జ్వలితాగ్ని సన్నిభోగ్ర శరంబుల్
దనుజుండు వైవ నీలుని
తనువున్ దూసి పడె నవ్వి ధరణీస్థలిపై.

634. శరదంబు ధార నోర్చుచు
స్థిరత న్నిల్చు వృషభంబు చె న్నలరగ ద
చ్ఛర వర్ష మోర్చి నీలుడు
తరు ప్రహారమున గూల్చె దనుజు హయములన్.

635. తురగముల గూల్చి నీలుం
డురవడి లంఘించి భగ్న మొనరించె నిశా
చరు కార్ముకంబు కాంచన
పరిష్కృతంబు సుర సంఘ బాధాకరమున్.

636. విరథుండు భగ్న చాపుం
డు రయోద్ధతు డై ప్రహస్తుడు న్మోదె గపిన్
ఖర ముసలంబున జెక్కు చె
దరక పడిం గలియబడె నతండు దనుజుపై.

637. ఒరు నొరు అక్కుచు గీఱుచు
ఖర దంష్ట్రిల చేత మేని కంద లసృజ్ని
ర్ఝరములు సెలంగ బీకుచు
నటిముటి బోరిరి దురాగ్రహా వేశమునన్.

638. నీలోద్వ్యద్ఘాతంబుల
దాళం జాల కసురుండు ధైర్యము జలముం
దూలి ముసలంబు గొని లాం
గూలాయుధు నురము గాడి కూల్పం జూడన్.

639. ఆ యెడ జూచి కపిచమూ
నాయకు డనిల గమనంబున శిలం గొని నా
గాయుత బలుడై వైవన్
వేయి తునక లయ్యె దనుజవీరు శిరంబున్.

640. ఆ రీతి బ్రహస్తుడు వడ
గా రాక్షస సైన్య వితతి గ్రందై హాహా
కారము లుప్పతిలె జయ జ
యారావము లెగసె మింటి కగచర సేనన్.

రావణుడు యుద్ధంబున కరుగుట

641. తన సైన్యాధ్యక్షుడు దా
రు ణాశ్మఘాతమున గూలె గ్రోతుల చేతన్
రణమున నక్కట యనుచు భ
య నిపీడితు డై దశవద నాసురు డంతన్.

642. బిరుదు గల యూధపతు లం
దరు జచ్చిరి కపులచే రణంబున బర దు
ర్భర విక్రము లన్నర వా
నరులన్ దొడరంగ నే జన న్వలె నింకన్.

643. అనుచుం దలంచి కదనాం
గణంబు సేరం జనె దశకంఠుడు భాస్వం
త నిభ ప్రభాస్పద స్యం
దనాధిరూఢుండు భూరి ధన్వ ధరుడు నై.

644. అతికాయ మహాకాయ ప్ర
భృతులు సుతులు దోడు రా ననే కోద్ధుర దం
తి తురంగ స్యందన భట
యుతుడై యరిగె సురవైరి యుద్ధ మొనర్పన్.

645. ఆ రీతి నేగుదెంచెడు
నా రాక్షసనాథు జూచి యాశ్చర్యమునన్
శ్రీరాము డనె విభీషణ!
సారభుజుం డెవ్వ డితడు చనుదెంచు నిటుల్.

646. భూత గణంబుల తోడన్
శీతాద్రి న్వీడి వచ్చు నిటలాక్షుం డా
భూతాధిపుండు రుద్రుడొ!
యీతని తేజంబు బర్వె నెల్లం దిశలన్.

647. అనిన విభీషణు డిట్లనె,
నినవంశపయోధిచంద్ర! యీతడె సుమి రా
వణుడు సితచ్ఛత్ర విభా
సి నిర్జరగణంబు గెల్చి చెలగెడు వాడున్.

648. ఆ వెంటన్ గల యోధులు
రావణపుత్రు లతిరథులు రణభీషణులున్
గ్రావాకారు లుదగ్ర భు
జావష్టంభులు నజేయ శక్తి కలితులున్.

649. అన రాఘవు డనె నీ దు
ర్వినీతు డెదురుపడె నాకు విడుతునె యస్మ
ద్ఘనశర జాల జ్వాల నేం
ధనంబు సేయక విభీషణ! యిపుడు వీనిన్.

650. సీత నపహరించిన దు
ర్జాతుడు వీ డిక తొలంగి చను మచ్చేతో
జాత మహాక్రోధము నే
డీతని వధ తోడ జగము లే పారంగన్.

651. అనుచున్ ధను శ్శరములున్
దనుత్రముం బూని నిల్చె దాశరథి మహా
రణసన్నద్ధుండై ల
క్ష్మణు తోడ నిశాచ రాగమనముం గనుచున్.

652. అట దశకంఠుండు సము
ద్భట సంగ్రామ క్రియా కృతాత్ముం డై చెం
గట వచ్చు వీర యోధుల
కిటు లనె బురరక్షణంబు హితకార్య మగున్.

653. చను దటు మీ రందరు ప
ట్టణమున్ గాపాడుకొనగ టక్కరి క్రోతుల్
ననుదెంచి యెట్లు పురి నా
శన మొనరింత్రొ! యిట కేన చాలు దరులకున్.

654\. అని వా రందఱి నంపి క
దనం బొనరప్పంగ నేగె దాశరథుల తో
దను జాధీశ్వరు డొక్కఁడు
ధను ర్మహానాద మవిరతంబుగ బర్వన్.

655\. ధరణీతల మద్రువగ బ్ర
స్ఫుర ద్రయోద్ధతి శతాంగము న్బఱపుచు వి
స్ఫుర దుగ్ర శర శరాసన
ధరుడై వచ్చు దశముఖు నదల్చి రవిజుడున్

656\. కుసుమిత వివి ధావనిరుహ
మనదృశ ధాతు ప్రభా దు రవలోకము శై
లశిఖరముం గొని వైవగ
నసురుండు దునిమె బహు నిశి తాంబక వితతిన్

657\. ఎన్ని తరువులన్ వైచిన
నన్నిటి దున్మె దశవదను డర్కసుతుండున్
సన్నిధి కేగి సిడంబున్
దన్ని కలత పెట్టె సూతు దశముఖు నెదుటన్.

658\. పవి నిభ నిశి తాగ్ర శరం
బు వింట సంధించి దానవుం డేయ మరు
జ్జవమున నయ్యది సుగ్రీ
వు వక్షముం దూసి పడియె భూమీస్థలిపై

659. అశని సమం బగు త త్తీ
వ్ర శరాఘాతమ్ము చేత రవిజుడు తేజం
బు శమింప గూలె ధరణి వి
వశుడై రాత్రించరాధిపతి ముద మందన్

660. సుగ్రీవు పాటు జూచి దు
రాగ్రహ వశులై నభ గవయ, గవాక్షాదుల్
నిగ్రహ మేది గవియగ, ద
శగ్రీవుండు విదళించె శర సంహతులన్

661. పరమ భయంకరముగ శిత
శరవర్షము గురిసె రాక్షస ప్రవరుడు వా
నర సేనల పై ధైర్యం
బఱి రాఘవు మఱువు సొచ్చి రా కపు లంతన్

662. రాముడు కోదండ ధరుం
డై మొనకుం గాపు నిల్చి యసురు నెదిర్పం
దీమసమున బోవం గని
సౌమిత్రి నమస్కరించి చయ్యన బలికెన్.

663. ఈ పాపాత్ము నెదుర న
న్నా! పంపుము నన్ను నీవ యరుగ న్వలెనే
నా పాపశరంబులచే
నీ పూర్వామరు వధింతు దృటి కాలమునన్.

664\. అనినన్ రాముడు దమ్మున
కనె, లక్ష్మణ! నీవ యేగు మని సేయగ, రా
వణు డద్భుత విక్రము, డెదు
ర నోప, రెవ్వరు, క్రుధాపరత జెలరేగన్

665\. దుర మొనరింపుము బహుజా
కరూకుడవునై ధనుస్సు గాచుకొన వలెన్
నిరతమ్ము బరచ్ఛిద్రము
లరయుచు లోప రహితుండ వైనం జయమౌ

666\. చను మన లక్ష్మణు డన్నన్
వినయమ్మున గౌగిలించి వినుతించి ప్రద
క్షిణ మాచరించి చే మో
డ్పున జనె దశముఖు నెదుర్చ పూనిక తోడన్.

667\. ఆ గతి రణోత్సవంబున
కేగు సుమిత్రాసుతు గని యేచి యనిఁజుం
డేగె దశకంధరు పయిన్
దా గల్గగ లక్ష్మణుకు చనం దగ దంచున్.

668\. హనుమంతు డట్లు చని రా
వణు నరదం బెక్కి పల్కె వధియింతు నినున్
గను మీ యరచేతి బలిమి
నను గికురింపం దరంబె నయరహితాత్మా!

669. అనినన్ జిరునవ్వున రా
వణు డనె నోరి కపీ! నీదు బల మెట్టిదొ చూ
తును గొట్టుము, రావణ మ
ర్దను దన్ను యశంబు నొందెదవు లోకమునన్.

670. అనుడున్ హనుమంతుడు రా
వణ! జ్ఞప్తికి దెచ్చుకొమ్ము భవ దాత్మజు న
క్షుని మును నే వధియించితి
ననంగ దశకంధరుడు దురాగ్రహవశుడై.

671. అరచేతం జరచె హనుమ
యురమ్మున, గజగజ లాడి యొక్క ముహూర్తం
బరిగిన పిమ్మట దానుం
జరచె మరున్నందనుడు దశముఖు నురమునన్.

672. అతితర భూకంపమునన్
క్షితిధర మూగు తెఱగున నిశిచరుండు రథ
స్థితుడై కంపించె మరు
త్సుతు నగ్గించి రగచరులు సురలుం బెలుచన్

673. పలలాశనపతి స్వస్థత
నలరి భళీ వానర! భళి యనిలజ! భవ ద
త్యలఘు భుజశక్తికి మనం
బలరె గడుంగడు నటంచు నగ్గింపంగన్.

674. ఏమి బలం బిస్సీ! నా
దేమి బలము? నాదు చేతి దెబ్బ దినియు నీ
వీ మెయి బ్రదుకం గల్గితి
నేమంబున నంచు హనుమ చింత పడంగన్.

675. కోపము తోడుత రావణు
డా పావని గొట్టె ముష్టి నతి తీవ్రముగన్
భూ పతితు డయ్యె వివశుం
డై పావని రాక్షస ప్రహారంబునకున్.

676. ఒడ లెరుగని వాయుసుతున్
విడిచి నిశాట విభు డేగె నీలుం దొడరన్
వడివడి గపి సైన్యాధ్య
క్షుడు జెలరేగి తరు శిలల గొట్టె దశాస్యున్.

677. నీలుడు వైచు తరు శిలా
జాలమ్ము శర ప్రతతుల శకలంబులు గా
నేల బడగొట్టి యసురుడు
నీలున్ గా ల్సేతు లాడ నీయక పొదివెన్.

678. కడు సూక్ష్మ రూపి యై నీ
లుడు దశకంధరు రథ మధిరోహించి వడిన్
సిడ మూపి వింటి కెగబ్రా
కి డిగ్గి యెగసి మకుటంబు గేలం దడవెన్.

679. ఆ రీతి నీలుఁడు సుప
ర్వారిం గడు జిక్కు వెట్టె బలలాశియు దు
ర్వార క్రోధుం డై సం
హారం బొనరింప వైచె ననలాస్త్రంబున్.

680. ఉరముం దాకిన యా శిఖి
శర ముజ్జ్వల మై దహింప సాగె దనువు వా
నరు డవని గూలె జేష్టా
విరహితు డై తెలిపి గాంచె బిశితాశనుడున్.

681. వానర సైన్యము పై బడ
బూని దశాస్యుం డొనర్చె భూతల మద్రువన్
జ్యా నాదము లక్ష్మణు డా
హ్వానించె దురం బొనర్ప నత్యుద్ధురతన్.

682. కంటం బడి తిన్నాళ్ళకు
బంటు తనంబున నెదిర్ప బ ల్సాహసుడా,
మింటి కెగయు నీ తల నా
వింటి బలిమి నూడు మింక బెగడక నిలుమా!

683. అనుచున్ దలపడె దశము ఖు
డనికిన్ సౌమిత్రి తోడ నాత్మశ్లాఘం
బొనరింతురె రాజులు ర
మ్మనుచు గవిసె లక్ష్మణుం డనంత మహిముడై.

684. కనక పరిష్కృత చాప
మ్మున గూర్చి నిశాత భల్లము ల్దనుజుం డే
య నడుమనె త్రుంచె సౌమి
త్రి నితాంతోరు శర ధార దీవ్ర రయమునన్.

685. వలయీకృత చాపమునన్
బలుదొడ్డ శరంబు లేసె వైరి వధా దో
హల బుద్ధి లక్ష్మణుండు శ
కలంబు లొనరించె బంక్తికంఠుండు వెసన్.

686. దుర్వార బాహు విక్రమ
గర్వాటోపమున సాయ కౌఘంబుల న
య్యిర్వురు బోరి రసమ రణ
నిర్వాహకులై ప్రతిభట నిర్మథ నేచ్ఛన్.

687. ఒక వెడద వాతి యమ్మున
వికటోద్ధతి నేసె దనుజ వీర వరుం డం
తకు చందంబున సౌమి
త్రి కఠోరోర స్థలమున స్పృహ బాయంగన్.

688. వివశుం డగుచున్ బడి రా
ఘవు దమ్ముడు కొంత వడికి గలిత స్పృహుడై
పవి నిభ శరమ్మునం దా
నవపతి ధనువున్ దునియ లొనర్చి చెలగుచున్.

689. వేరొక యమ్మున గీర్వా
ణారాతి యురమ్ము నేయ నవశాంగుండై
యా రావణుండు గనులన్
దారకలు మెఱయ రథంబు న న్వాలి పడెన్.

690. శర దాసిక్త తనుడు నిశా
చర పతి రా మానుజ శిత శర దారితుడై
యొరగెన్ జలన రహితు డై
యరదమ్మున రక్త సిక్తమంగము తోడన్

691. పిమ్మట లబ్ధ స్పృహుడై
య మ్మనుజాశన విభుం డహంకృతి తోడన్
హు మ్మనుచు బఱపె విధి ద
త్తమ్మగు శక్త్యాయుధ మ్ముదగ్రత నరిపై.

692. ధూమ విరహి తాగ్ని జ్వా
లాముఖమై పడియె నద్ది లక్ష్మణు వక్ష
స్సీమ, విదళింప నోపదు
సౌమిత్రి శరాళి త త్ప్రశ స్త్రాయుధమున్.

693. ఉరముం దాకి పడిన త
త్పర మాయుధ జాత హవ్య వాహన శిఖలున్
గర మేర్చ సహింపన్ దు
ర్భరమై మహి సొమ్మసిల్లి పడె లక్ష్మణుడున్.

694. అవిచింత్య మహా శ్రీ వై
ష్ణవాంశ ము న్దా నగుట మనంబున దలచెన్
దివిజరిపు నాయుధము శ
క్తివిహీనం బగు దనయెడ దిరముగ ననుచున్.

695. విగత స్పృహుడై ధరణి నొ
రగిన సుమిత్రాత్మజు గొని రయమున లంకా
నగరి కరుగం దలంచి యె
త్తగ జూచె గరద్వయమున దశముఖు డంతన్.

696. హిమగిరియొ మందరమొ య
య్యమరేశ యుత భువన త్రయమొ యైనం బా
హు మహిమ నెత్తం జాలు ద
శముఖుడు సౌమిత్రి నెత్త జాలం డయ్యేన్.

697. భరతానుజు నెత్తి కొనుచు
బురి కరుగం జూచు బంక్తిముఖు గని క్రోధో
ద్ధురుడై పొడిచె ననిల సూ
తి రభస మొప్ప బవిసదృశ దృఢ నిజ ముష్టిన్.

698 కనులన్ శ్రోత్ర ఘ్రాణము
ల నోట రక్తంబు గ్రక్క లంకాపతి మూ
ర్ఛ నెనసె హనుమంతుడు ల
క్ష్మణు నెత్తికొని చనె రామచంద్రుని దరికిన్.

699. శాత్రవు డై రావణుడు సు
మిత్రాసుతు నెత్త లే దమిత భక్తుండున్
మిత్రుండు గావున మరు
త్పుత్రుం డవలీల నెత్తి మోవం జాలెన్.

700. రాముని దరికిం జనగా
సౌమిత్రి స్వేడి పోయె శక్త్యాయుధమున్
సేమంబున దెల్విం గనె
సౌమిత్రి, చెలగిరి కపులు సంతోషమునన్.

701. రావణుడు మే నెఱిగి క్రో
ధావిష్టాత్ముం డగుచు మహా చ్చాపమునన్
జీవహరణ పటు నారా
చావళి వర్షించె వాన రానీకము పై.

702. దశముఖు విజృంభణం బో
ప శక్తి లేక కపిచముపు పాఱ డొడంగన్
దశరథసుతుండు రాముడు
నిశాచరాధిపు నెదుర్కొనె రయం బడరన్.

703. హనుమంతుం డెదురై రా
మున కనె నంజలి ఘటించి పురుషోత్తమ! రా
వణుడు రథికు డై సంగర
మొనర్పు బదచారి వగుట యొప్పునె నీకున్.

704. ఘనముగ నా గరుడుడు వా
హనమగు విష్ణువున కేను నట్టులె నీ వా
హన మగుదు మ ద్భుజారో
హణమ్మొ గావించి కడగు మసుర వధ కికన్.

705. హనుమ ద్భుజ పీఠా రో
హణమున నేగె వడి రాము డంత దశాస్యున్
గని యిట్లనె రావణ! కూ
ల్తును నా కంఠం బడితివి దుష్టా! నిలుమా!

706. ఎవరేని యప్రియము నా
కొనరించిన ని స్వడుతునె యూ ర్ధ్వాధో లో
క నివాసమ్మున కేగిన
వనజభ వేంద్ర హరు లడ్డు వడినం జెనటీ!

.07. ఖర దూషణు లందరి నొం
టరి నై యెదిరించి దున్మిన నరుండను గా
నెఱుగుము నను దశముఖ! ద్వ
త్పరాక్ర మాతిశయ సంపదం జూపు మికన్.

708. అనుచున్ రాముండు ధను
ర్గుణ ధ్వని యొనర్చె నిఖిల లోకాళికి భీ
జనకమ్మగు గ్రోధమునన్
దనుజేశ్వరుడున్ మహాద్భుత ధను ర్ధరుడై.

పరగించె దీవ్ర బాణము
లురస్థలిన్ బవనజు పయి నుద్ధురగతి భా
స్కర తేజో వంతుడు దు
ర్నిరీక్ష్యు డై వెలిగె హనుమ నిశితాస్త్ర హతిన్.

710. క్షతగాత్రు డైన మారుత
సుతు జూచి రఘూద్వహుండు శోణాక్షుండై
శిత నారాచ పరంపర
నతి వేగమ్ముగ బఱపె దశాస్యు రథము పై.

711. తురగములు జచ్చె సారథి
శిరంబు మింటి కెగసె దునిసె రథాంగంబుల్
సురవైరి చేతి ధనువు దు
ము రయ్యె శకలంబు లయ్యె ముఖ్యాయుధముల్.

712. కను దెఱచి చూచు మాత్రం
బున భగ్నం బైన యరదమున్ డిగ్గిన య
ద్దనుజుండు రిచ్చవడి ని
ల్వ నేల రాలె మకుటంబు రామ శరహతిన్.

713. హతదర్పు డైన రావణ
దితిజేశ్వరు జూచి రామదేవుం డనె బో
రితి వుగ్ర విక్రమమున బ
గతురకు నే న్మెచ్చు వుట్ట గా బంక్తిముఖా!

714. అలసితివి, తురంగములున్
బొలిసె, విశీర్ణము రథంబు ముక్తా హేమో
జ్జ్వల కార్ముకంబు పలు దుని
య లయ్యె, నింకే మొనర్ప నగు నీ కిచటన్?

715. నిను ద్రుంచు టిష్టు నాకున్
రణ ధర్మము గాదు రావణ! పురంబునకున్
జని శ్రాంతి దీర్చుకొని ర
మ్మని సేయ రథా దిపరిక రాన్వీతుడవై.

716. అనిన దలవంచు కొని రా
వణుం డరిగె నేల గనుచు వ్యాకుల చిత్రం
బున నాత్మ గేహమునకున్
దనుప్రవ ణోపశమనం బొనర్చు కొనె నాగిన్.

717. అరి దుర్వారుడ నను నా
గరువము ఖర్వంబు గాగ గదనమ్మున ది
క్కఁటి నరు నొక్కఁని కోడితి
శరాసనంబున్ రథంబు జదియం బడగన్.

718. మృగరాజుం గని పర్వు మ
దగజంబుం బలె, ఖగపతి దర్శన భీతో
రగము క్రియ, బాటి వచ్చితి
వగ గూరి పరాభవింప బడితి గటకటా!

719. ఏమి శరంబులవి? నభ
స్సీమన్ మెఱపు లనగ మెఱసి పడెన్ రథమం
దామెయి శర మొక్కటియున్
రాముని పై దూయ లేక గ్రాన్పడి పోతిన్.

720. అనుచున్ మనోవ్ర ణోపశ
మనమున్ గనలేక చింత మై యసుర చమూ
గణ నాథు లమాత్యులు నం
దనులున్ గొలువుండ బల్కె ధైర్యము దూలన్.

721. సురపతి తుల్య పరాక్రమ
విరాజమానుండ విశ్వ విఖ్యాతుడ న
న్నురమున గెల్చె నరుం డొక
డరయగ నాదు తప మెల్ల వ్యర్థం బయ్యెన్.

722. నర వానరులన్ బేర్కొన
గరువము మై నాడు ధాత కరుణాళుండై
వరము లొసంగగ, నాకున్
మరణము తథ్యంబు సుమ్మ మానవు చేతన్.

723. అనరణ్యుం డను నైక్ష్వా
కుని నే జిత్రవధ సేయ గూల్చను నిన్నున్
ఘను డైక్ష్వా కాన్వయు డొక
డనె నత, డీ దశరథసుతు డాతండె యగున్.

724. ముసు నే వేదవతి యనన్
ముని కన్యక జారుగాత్రి మోహింప, వధిం
తును ని న్నున ర్భవంబున
నని యగ్నిం జొచ్చె, సీత యాయమయె యగున్.

725. కైలాస మెత్తు నా దవ
హేళన మొనరించు నన్ను నీక్షించుచు స్త్రీ
మూలముగ గూలు మంచున్
శైలజయున్ గుపిత యగుచు శాపం బిచ్చెన్.

726. హర వాహనంబు నందీ
శ్వరు గని నే పరిహసింప శాపం బిడె నా
పుర వైభవ మెల్లయు నం
తరించు ద న్బోలిన కపితతి చే నంచున్.

727. స్మరవశత రంభను బలా
త్కరింప నలకూబరుండు, గామాంధుడ నై
వరుణసుత పుంజికస్థల
జెఱగొన ధాతయును శప్త జేసిరి నన్నున్.

728. వర గర్విత చిత్తంబున
పరాభవించితి మహర్షి వరు లెందఱి నో
పరమ తపస్వులు వారం
దరి చే గ్రోధోగ్ర శాప దష్టుడ నైతిన్.

729\. ఇవి యెల్లయు మీ రెద నిడి
వివి ధోద్యోగముల బన్ని వెలయింపుడు దై
త్య విజృంభణంబు, గపి సై
న్య వినాశంబున్ బొనర్పు డవ్యగ్రముగన్.

730\. నా తమ్ముండు ఘటశ్రవు
డాతత బల ధైర్య సాహ సాన్వితుడు రిపు
వ్రాతము జయించు భాగ్య వి
ధాత ననుం బోలె శాప దష్టుడు గామిన్.

731\. నిదురించు చుండు వాడు బ
హు దినమ్ముల దాక దృప్తి నొందగ బోన
మ్ము దిని సుఖమ్ముగ దా నొ
క్క దినము ప్రజ్ఞాయుతుండు గాగ మెదలినన్.

732\. ఇపు డీ యాపద దప్పిం
చు పరాక్రమ శాలి వాడె సురపతు లైనన్
రిపు లెదురం జాలని భూ
రి పర్వ తాకారు డరయ మృగరా ణ్ణిభుడున్.

733\. సమయమున కక్కరకు రా
ని మహా వీరుండు గల్గె నేనియు ఫలవం
త మగునె కార్యము, బలవం
తముగా నైనను సుషుప్తి దప్పింపు డికన్.

734. అనినన్ రాక్షస సైన్యా
ధినాథులు న్మంత్రులు జని దిశ లెల్లను మ్రో
య నెరపిరి శంఖ భేరీ
పణ వానక కాహళ ముఖ వాద్య ధ్వనులన్.

735. హయ హేషలు మత్త కరీం
ద్రయూధ ఘీంకృతులు సింహనాదమ్ము లొన
ర్చియు యత్నము సేసిరి దై
త్యయోధు మేల్కొల్ప కదన తత్పరు జేయన్.

736. వాలమ్ముల బఱగించియు
శూలమ్ముల బొడిచియు బయి శుండాలములన్
దోలించియు శ్రవణ కుహర
మూలమ్ముల నంబుపాతముం గావింపన్.

737. తెలివి గని ఘటశ్రవు డా
కలి యని బిట్టార్వ బహు మృగ ద్విజ మాంసం
బులు రక్త పూరిత ఘటం
బు లిడం గా నాస్వదించి మోదము తోడన్.

738. నను నిద్రకు బాపిన కా
రణ మేమి మనకు రణంబు రామునితో గ
ల్గెన? యాపద యిం కేదై
నను ప్రాప్తించెన విభునకు? నాకు దెలుపుడీ!

739. అని కుంభకర్ణు డడుగం
గ నిట్లనె మహోదరుండు గాకుత్స్థునితో
నని యయ్యె నకంపన ముఖు
లనికినీపతులు చచ్చి రరి వీరుల చే.

740. ఎక్కటి కయ్యంబున దా
నుక్కుమిగిలి రాముడు ధనువున్ స్యందనమున్
ముక్క లొనర్చి మకుటమున్
వ్రక్కలు గావించి విడిచె బంక్తిముఖు గృపన్.

741. అవమాన భారమున శిర
ము వంచి యె ట్టెటులొ వచ్చె బురికి బ్రభువు దీ
ర్పవు నీ వి య్యవమతి నం
చు వేచి నిను జూడ గోరుచుండె వివశుడై.

742. అనినన్ దుర్భర కోపం
బున బ్రుంచెద న న్నర కపి ముష్కరులన్ వే
జని త చ్ఛోణిత పానం
బొనర్చి యవ్వల జనుదు బ్రభువు సన్నిధికిన్.

743. అను కుంభకర్ణునకు వం
దనం బిడి మహోదరుండు దానవపతి ద
ర్శన మొనరించుట తగు ము
న్ననంగ నంగీకరించి యాతం డంతన్.

744. స్నానంబు సేసి మదిరా
పానం బొనరించి రత్న భర్మ కలిత నా
నానూన భూషణములన్
మై నిడి చనె వాడు రావణ ప్రభు కడకున్.

745. అమిత సురా పానము చే
త మదించి ఘటశ్రవుండు ధరణీస్థలి కం
పము నొంద పాద విన్యా
సము సేయుచు రా ట్పథమున జనె యము బోలెన్.

746. తరు ణార్క ద్యుతి మెఱయుచు
బుర ప్రజావళి నుతింప భూరి విభవ మొ
ప్ప రభసమున జను రాక్షస
వరు గని పాఱెన్ గపిచము వమిత భయమునన్.

747. తరుచర గణంబు లట్లు వి
పరీత భయ తప్త వృత్తి బాఱుచు రా దా
శరథి విభీషణు గని య
చ్చెరువున నిట్లనె బురి దెస జే సాచి వెసన్.

748. విద్యు ద్ఘ ణోజ్జ్వలం బగు
నుద్య ద్వర్షాంబువాహ మొ యనంగా దు
ర్భేద్యోద్యమంబున న్నిర
వద్యాభర ణోజ్జ్వల ప్రభా భాసితు డై.

749. వెఱ గొల్పుచు వచ్చెడు ఘన
శరీరు డెవ్వండు భూత సంచయమున ను
ద్ధుర తేజో భరితము నా
యెఱుకం గాన బడ దిట్టి దే లోకమునన్.

750. అనిన విభీషణు డిట్లనె
విను వాడె ఘటశ్రవుండు విశ్రావసునం
దనుడున్ రావణు దమ్ముడు
ఘన విక్రమ శౌర్య ధైర్య కలితుం డుర్విన్.

751. అరయఁగ దపో బలంబున
వరముల్ సాధించి బల విభవ దర్పితు లౌ
దురు జగతి దనుజు, లిత డు
ద్ధుర తేజో బల గరిమము తోడ జనించెన్.

752. పుట్టిన దాదిగ పీ డాక
పెట్టున భక్షింప సాగె బెనుక్షుధ తో గ
న్పట్టిన జనతతి వజ్రిం
గొట్టె మొగముఃవాయ నెదురుకొని యద్దువడన్

753. సురలం జయించి నా ద
ధ్వర విఘ్నము సేసి భూరి తాపస వరులన్
నరికించి నా దహాసునన్
బరసతుల బరాభవించి నా డెందటినో.

754. లోకము నిర్మానుష్యము
గాకుండునె యిట్టి దుష్ట కతమున నని నా
కౌక స్తతి మొఱవెట్టె బ్ర
తీకారము సేయ బ్రహ్మదేవుని కార్తిన్.

755. కోపించి వారిజభవుం
డీ పాపాత్మునకు లోకహిత కర బుద్ధిన్
శాప మొసంగె మృతుం డ
ట్లై పడి యుండగ సుషుప్తి ననవరతంబున్.

756. నీ ముని మనుమం డితడు పి
తామహ! నీ విట్లు శాపదష్టు నొనర్పం
గా మేలె! కాల నిర్ణయ
మే మే న్సేయు మనె నిద్ర కీ రావణుడున్

757. ఒకదినము మేలుకొని వా
ర కారుమాసములు నిద్దురం బెందుచు మే
లుకొనిన నాడు నిఖిల భ
క్షకు డగు జు మ్మని మఱల్చె శాప మజుండున్.

758. ఇది యీ ఘటశ్రవుని గా
థ, దశాస్యుండు భవ దుగ్ర దర్పంబునకున్
మది భీతి నెంది పినిన్
గదనమ్మున కంపు బూనిక న్మే ల్కొల్పెన్.

759. వానర సైన్యం బెల్లయు
పీనికి భయ మంది సమర విముఖత్వమునన్
నానారీతుల బర్వెచు
బో నుండె, సముచితరీతి బోధింపు మొగిన్.

760. అనినన్ రాము డుచితవిధ
మున నాజ్ఞలు సేయ సైన్యముల దగు బోధం
బున గ్రమ్మరించి సిద్ధం
బొనరించిరి యూధపతులు వ్యూహ ద్రఢిమన్.

**కుంభకర్ణుడు రావణు దర్శించుట**

761. అతుల స్వర్ణమయ సమం
చిత పీఠాధిష్ఠితుడు సచివ ముఖ్య చమూ
పతి సేవితుం డగు దనుజ
పతి జూచి ఘటశ్రవుండు భక్తి వినతుడై

762. న న్నేల మేలుకొల్పితి
వన్నా! కానితటీ, యేమి యాపద వచ్చెన్?
ని న్నెదిరించిన దుష్టున్
మన్నింపక గూల్తు జెప్పు మా త్వర ననినన్.

763. మది సంతసించి యా దశ
వదను డనుజు గారవించి పల్కె నిటులు తొ
మ్మిది దినము లయ్యె దమ్ముడ!
నిదురం జెందం గడంగి నీ విప్పటికిన్.

764. ఆ రాముడు క్రోతులతో
వారిధి బంధించి వచ్చి ప్రారంభించెన్
ఘోరాహవంబు భూమిజ
కారణముగ మ ద్బలంబు గవిసి తలపడెన్

765. కపియోధులలోనం బే
రుపడిన వా డొక్క డేని త్రుంపం బడ లే
దు, పలాశి వీరు లెందఱొ
యపమృత్యువు పా ల్పడి రనుజా! యే మందున్?

766. సేనా పతు లిక జాలరు
వానర సైన్యమున కన్న భావంబు మెయిన్
నేనె యరిగితి సముజ్జ్వల
బాణాసనమున్ ధరించి బవరమ్మునకున్.

767. పరిపంథి తోడ రణ మా
చరించి నది లేదు నేను స క్రోధుండై
పరపె శరంబుల్ రాముఁడు
నురు మయ్యె రథంబుతో ధనువు క్షణమాత్రన్.

768. నరు డొక్క డిట్లు నన్ను స
మరంబున జయించి యుడిపె మానము సర్వా
మర దుర్జయుండ నగుచున్
బరగుట యెల్ల గత వైభవం బిక ననుజా!

769. ఆసన్న మయ్యె దనుజ వి
నాశన కాలం బనుచు మనంబున దోచున్
దాశరథితో రణమ్మున
నీ సాయము తప్ప దయ్యె నిర్జర శత్రూ!

770. నీవే నిక్క మలిగినన్
దేవవిభుంఘున్ బరువిడు నీ సాయమునన్
గా విశ్వ మోర్వ జాలితి
భూవరనందనుల తోడి పోరు భరంబే.

771. కాపాద న్వలె నీ విక
నీ పురమున్ దనుజనాథు నెల్ల విధము లం
దోపుదు వీ వొక్కడ వీ
యాపద బాపంగ నేగు మని సేయంగన్.

772. అనినన్ ఘటశ్రవుం డనె
విన వైతివి గాని మున్నె వే విధముల నే
నును న వ్విభీషణుండున్
ఘను రాము మహిమ దెలుపమె కల రూపమునన్.

773. పరమోదారుడు రాముడు
ధరణిజ నొసంగి త త్పద సరోజంబుల్
శరణంబు గోరు మని చె
ప్పరె నీకు హితార్థు లగుచు బరగెడు పెద్దల్.

774. ఈ వట్లు నేసి యుండిన
యీ విపరీత స్థితి మన కెదుర య్యేడిదే?
భూవరులు సంతతము శిర
సా వహియింప వలె నీతి చతురుల పలుకుల్.

775. అమలిన చరిత్రునకు ధ
ర్మము ప్రాతర్వేళ లందు, మాధ్యాహ్నిక కా
లము లం దర్థము సాయం
సమయమ్ముల గామము దగు సంసేవింపన్.

776. ఐనను ధర్మార్థము లెపు
డైన ననుష్ఠింప వచ్చు నన్న! నిషిద్ధం
బౌ నెల్ల వేళలన్ గా
మానుష్ఠానం బది యరయగ సుమతులకున్.

777. పురుషార్థము లందు ప్రథమ
పురుషార్థము ధర్మము గడు ముఖ్యంబగు న
ట్లెఱిగియు బాటింపని య
ప్పురుష బహుశ్రుత మరణ్య పుం జ్యోత్స్న యగున్.

778. జనపతి పురుషార్థ త్రయ
ము నెఱిగి కా లానుగుణ్యముగ సేవింపం
గనుచు జతు రుపాయంబుల
ననువృత్తమ్ములుగ సల్ప నగు జయ కాంక్షన్.

779. అసమర్థు లర్థ లోభులు
నసహిష్ణువులున్ గుయుక్తు లరికూటస్థుల్
మసలుదురు హితంకరులై
న సచివు లట్లు మృదుభాషణంబు నెఱపుచున్.

780. పర హృదయ మర్మ విదుడై
న రాజు నిశిత పరిశీలనమ్మున గార్యా
చరణుడు గావలె నయ త
త్పరబుద్ధిన్ గాని నాడు పతనం బందున్.

781. ఇపు డేని విభీషణుని న
దుపదేశంబు మదికి గొని యొనరింపుము దై
త్యపతీ! కా దేనియు జను
మపమార్గమొ యేదొ యిష్ట మయ్యెడు త్రోవన్.

782. అనిన భ్రుకుటి ముడివడ రా
వణు డనె బల్కకుము నీతి వచనంబులు నె
త్తిన కత్తు లున్న యి య్యెడ
కనురూపము గాగ బల్కుటారయ మేలా.

783. సమయోచిత కార్యము సే
యు మంచు బిల్పించితి నిను యోద్ధవు గానన్
సమరంబు మాటయె వచిం
పుము గత జల సేతుబంధము ఫల ప్రదమే?

784. అవివేకంబుననో ప్రాం
తి వశముననో యేదో నేసి తిద్దోషము ము
న్ను విమర్శింపక దానిన్
సవరింపుము నీదు బాహు సంరంభమునన్.

785. హితు డన గష్టంబు లొదవి
న తరి సహాయంబు సేయు నాతడె హితుడౌ
మతిమాలి నీతి దూలిన
గతిహీనుం దీర్చు వాడె గా బంధు డగున్.

786. నీకు న్నా యెడ స్నేహం
బే కల దేని యనుజ! భవదీయ ఘన భుజా
స్తోక బలంబున ప్రత్యయ
మే కల దేని తొలగింపు మీ కష్టంబున్.

787. దశముఖు డట్లాడ క్రుధా
వశు డయ్యె నటంచు నెంచి పల్కెన్ గ్రోధం
బు శమింప ఘటశ్రవు డి
ట్లు శంక సేయకుము న న్నిటు లసురనాథా!

788. హితమునె బోధింప వలె నృ
పతికి శుభము గోరు నేని బంధుజనుడు సం
తతము ప్రియాఽప్రియ భావ ర
హితుడై య ట్లగుట బల్కి తీగతి హితమున్.

789. మేనన్ బ్రాణమ్ములతో
నే నీ మెయి బ్రదికి యుండ నీ వేటి కిటుల్
దీనుండ వౌట రిపు సం
తానంబును గూల్చి నీకు నందం బెసగన్.

790. అలిగితి నేని మహాబ్ధుల
జల మెల్లయు ద్రావుదు దివసాధిపుతో జు
క్కల నేల రాల్తు శైలం
బుల బొడిసేతు నగలింతు భూమితలంబున్.

791. అలవోక రామ లక్ష్మణ
కలితమ్ముగ వాన రాశి గదన స్థలికిన్
బలివెట్టి త ద్రుధిర ధా
రల తర్పణము లిడుదు మృత రాక్షస తతికిన్.

782. అన లేంద్ర వాయు యమ వరు
ణ నిలింప పతు లెదు రొడ్డిన న్దున్మెద రా
ముని సీత నీకు వశ వ
ర్తిని యగు సుఖియింపు మిక యథేచ్ఛ జిరంబున్.

793. అనుచున్ బీరము లాడుచు
జనె ఘటకర్ణు డని సేయ సంతసమున రా
వణుడు దలయూప వెంబడి
జనె న్మహాచ్ఛమువు సర్వ సంసిద్ధంబై.

794. విధి దత్త శూలమున్ జే
త ధరించి ఘటశ్రవుండు ధరణీధరమొ నా
గ ధరిత్రి గ్రక్కదల రా
నధి కోత్సాహమున జెలగె నసుర గణంబుల్.

795. ఘటకర్ణుం గాంచిన యం
తట బాసిరి ప్రాణముల వనాటులు భయ ము
త్కటమై గుండె లవిసి య
ట్టిటులై కాలుకొలది బరువెత్తి రసంఖ్యల్.

796. పురికొల్పి యంగదుం డం
దర మఱలించు కొని వచ్చి తా నెదిరించెన్
గిరి శిఖరంబును జే బూ
ని రయమ్మున గుంభకర్ణు నిర్భీకుండై.

797. కపులున్ రువ్విరి శిలలున్
విపులక్ష్మాజంబులు రిపువిధ్వంసన శ
క్తి పటుత్వంబు మెఱయ జి
ద్రుపలై పడె నవి నిశాచరు తనుస్పర్శన్.

798. కుపితుం డై ఘటకర్ణుడు
కపులన్ జా మోద సాగె గాలయముడో భూ
తపతియొ నా దుర్భర హ
స్త పాద ఘాతముల శూల శాత క్షతులన్.

799. తరువులు శిలలున్ గొండ శి
ఖరమ్ములున్ దనుజ దేహ ఘట్టనమునకున్
నుఱు మగు గాని చలిలప ద
సురుండు చాలింపడు కపి శూర మథనమున్.

800. హతులై ధర బడి రెందఱొ
హత శేషులు పాఱ సాగి రగచరు లసురో
ద్ధతి నాగ లేక ధావ
త్క్షత సుమ భూషిత పలాశ తరువులొ యనగన్.

801. పరుగు లిడు వానర తతిన్
మఱల్ప యత్నించు వాలి నందనునకు దో
డరుదెంచిరి ఋషభ కుముద
శరభ ద్వివి దాదులు రణ సంరంభము మై.

802. హనుమంతుడు నీలుండున్
బనస గవాక్ష ప్రభృతులు బల వత్కపులున్
జనుదెంచి దారుణ శిలా
వనిరుహములు గుఱిని రసురు పై వర్షముగన్.

803. తనువు పయి బడు తరు శిలా
గణంబు విదిలించు కొంచు గద చేతన్ దా
ల్చి నిశాచరుండు కూల్చెన్
గణనాతీతముగ గపుల క్షణమాత్రమునన్.

304. ద్వివిదుం డమిత క్రోధం
బు వహించి సమున్నతగిరి మూర్ధంబున్ దా
నవుపై నేయగ నది సై
న్యవిభాగము నొక్క దాని నాశ మొనర్చెన్.

305. దనుజ రథికుల్ జెలగి య
స్త్ర నిచయ మడరించి వానర సహస్రములన్
దునిమిరి ఘటకర్ణుండున్
దునిమె గపుల దరిమి తరిమి దుర్వారుండై.

306. హనుమంతుండు సముద్ధతి
జనుదెంచి నభమ్మున ఘన శైల శిఖరమున్
గొని మోదె దానవు శిరం
బున దేహం బెల్ల రక్తపూరము గాగన్.

307. కీలాలంబున దోగుచు
సోలి ఘటశ్రవుడు భూరి శూలము వైవన్
శైలోపమ భీమతనుడు
వాలాయుధు నురము గాడి వ్యథ గల్గించెన్.

308. ఉరు శూల దారిత భుజాం
తరుండు గర్జించె బవననందను డుగ్ర
స్వరమున యుగాంత కాలా
బ్దరంబు వోలె నసురాళి భయ వివశము గాన్.

809\. గిరి శిఖరంబున్ నీలుం
దరుదెంచి ఘటశ్రవోత్తమాంగమునన్ వై
వ రయం బొప్పగ దాని న
సురుండు వజ్ర దృఢ ముష్టి జూర్ణము సేసెన్.

810\. శరభ ఋష భాది కపు లే
వు రొక్క పెట్టున ఘటశ్రవుం డగ్గలి భూ
మిరుహ శిలా పాదముల బ్ర
హారింప దేహంబు నిమిరి నట్లయ్యె నాగిన్.

811\. పరమామర్షమున నిశా
చరుండు పాదమున దన్నె శరభు, గవాక్షున్
జరచె నరచేత, బాహ్వం
తరమున బిట్టదిమె ఋషభు దర్పోద్ధతుడై

812\. శర మవిసి పోవ ముష్టిం
బరపె న్నీలు పయి గంధమాదనునిన్ బే
రురమున జాను ద్వయి గ్రు
మ్మె రక్తముం గ్రక్కి వారు మేదిని గూలన్.

813\. భీమ బలు లై దుగురు కపు
లామెయి నెత్తురులు గ్రక్కి యవనిం బడ శా
ఖామృగ గణంబు లత్యు
ద్దామ క్రోధోద్దితు లయి తత వేగమునన్.

814. దనుజుని పై లంఘించి ఖ
రనఖమ్ముల గీఱి యుద్ధురగతిన్ దను మ
ర్దన మొనరించి రెడతెగ క
వనిరుహ కాండముల శిలల బద ఘాతములన్.

815. ఇంచుకయు జలింపక మై
వెంచి ఘటశ్రవుడు రేగి వికృతమ్ముగ గ
ర్జించుచు నోరు దెఱచి కపి
సంచయ ము గ్రిమ్మంగ సాగె సాహస మడరన్.

816. తెరచిన నోట, శ్రవణ గ
హ్వరంబుల న్నాసి కావివర మార్గములన్
హరిభటులు బయల్వడి రా
నరసి దనుజుడు భయ దాట్టహా సోద్ధురుడై.

817. చేతులతో విఱిచి కపి
వ్రాతము ఖండములు సేసి రక్తము తోడన్
వాత నిడి మ్రింగ దొడగ మ
హాతత భీతి న్బరువిడి ర య్యగచారుల్.

818. వాలిసుతుం దంతట ను
ద్వేలమ్ముగ నేగుదెంచి బిడికిట బొడువన్
గూలె ఘటశ్రవు డుర్విన్
గీలాలము బర్వె ధారుణిం గాల్వలు గాన్.

819. పరిలబ్ధ స్పృహుం డై యా
ధరణీధర దేహుఁడు మద దంతావళ వి
స్ఫురణమ్మున గర్జించుచు
గరంబులం బట్టి దునుమ గడగెం గపులన్.

820. తరణి సుతుడు సత్వరుడై
పరతెంచి యనల్ప పాదప క్షేపమునన్
సురవైరి తొమ్మ్రుదా డిం
ప రయమ్మున శూల మేసె వాఁ డుంగపిపై.

821. అనిలాత్మజుఁ డడ్డం బై
తృణముం బలె ద్రుంచి వైచె రెండుగ గగనం
బున బట్టి త దాయుధమున్
ఘన బాహు బలంబు మెఱయ గా జానుపులన్.

822. దనుజుం డల్గి బృహ ద్ధా
రుణీ ధర శిఖరంబు వైచె తొ మ్మవియంగా
నినపుత్రు, డ దాఘాత
మ్మున నిస్పృహుం డై కపిపతి భూస్థలి నొఱగెన్.

823. దానవ నాథునకున్ బహు
మానము గావించు తలపు మది మెదలం గా
వానరు మూపున గొని లం
కా నగర పథమ్మున జనె ఘటకర్ణుఁ డాగిన్.

824. తను దా రక్షించుకొనగ
ఇన తనయుం డోపు నంచు నీక్షింప దొడం
గె ననిలజుండా వంకన్
దనుజుడు బర్వెత్తుట యెలనవ్వు మొగమునన్.

825. పుర వీధుల మూపున గపి
ధరించి యేగెడు ఘటశ్రవసు పై విరియిం
చిరి రక్కసు లరుసమ్మున
హరిచందన గంధ బంధు రార్ద్ర సుమములన్.

826. క్షితిజుం ద ట్లేగ నహ
ర్పతి తనయుడు బోధ మంది వడి ఖండించెన్
దితిజ ఘ్రాణ శ్రవణ
ద్వితయము దంష్ట్రా నఖ వితతి సమూలముగన్.

827. అమిత వ్యథి తాత్ముం డై
యమరారియు ద న్కరద్వయంబున బట్టన్
గమకించు నంత లో న
భ్రమమున కెగసి కపివిభుండు రాముం జేరెన్.

828. కపి త న్నావిధమున మో
సపుచ్చి యేగంగ నాకసము వంకన్ వె
ఱ్ఱి పగిది జూచుచు ఘటక
ర్ణ పలాశి పరువిడె మది రణస్పృహ మెఱయన్.

829. చెవులును ముక్కును దెగి పర
మ వికృత రూపంబు తోడ మహి రుధిరంబుల్
ప్రవహింప బర్వి యద్దా
నవుం డరిగె రాము తో రణం బొనరింపన్.

830. ఖరుడో దూషణు డో కా
దరయగ నీ కుంభకర్ణు డరి వీర మద
ద్విర దోద్ధుర పంచాస్యుం
డెఱుంగ వో నన్ను, నిల్వు మిక దాశరథీ!

831. అనుచున్ విశాల సాలా
వనిరుహము బెకల్చి రాము పై వైచె సురా
రి నిశిత శర నిర్భిన్నం
బొనర్చె రాముండు దాని నురు వేగమునన్.

832. తరువు విఫలం బగుట హుం
కరించి యసురుండు గిరి శిఖరమున్ వైవం
గ రఘువరుడు భేదించెన్
శరప్రతతి చే సహస్ర శకలమ్ములు గన్.

833. శైల శకలంబు లుర్విన్
వాలాయుధ సంచయంబు పై బడకుండన్
గేళీ విలాసమున శర
పాళిన్ రాము డెగజిమ్మె బహు దూరముగన్.

834. కనలున ముద్గరమున్ దా
ల్చి నిశాటుండు గవిసి కపి సేనల జెండా
డె నఖాయుధ తతి హా హా
స్వనంబు లొనరించుచు వడి బాఱ దొడంగెన్.

835. భీకర ముద్గర ధరుడై
సాకారం బైన మృత్యు వనగా గపులన్
జీకా కొనర్చు రాక్షసు
నా కౌసల్యా తనూజు డాగ్రహ వశుడై.

836. కని దీర్ఘ గాత్ర మెల్లన్
దునియంగ శరమ్ము లేసె దోస్సారము పెం
పున జేతి ముద్గరంబున
దనుజుం డడగించి వైచె ద చ్ఛర వితతిన్.

837. నిశిత శరము లె న్నేనియు
దశరథసుతుడు ఒరగింప దానవు ఘన క
ర్కశ దేహంబున సుమ వృ
ష్టి సల్పి న ట్లయ్యె గాని చేద్పడ దయ్యెన్.

838. తనపై నడరెడు దనుజున్
గని యింద్రసుతు హత మార్చిన శరంబే సెన్
ఘను డా రాముడు వృథ యై
చనె నద్దియు దనుజ దేహ సంఘర్షమునన్.

839. దనుజుని గ్రోధం బెసగన్
గని రాఘవు డనిల సాయక క్షేపమునన్
ఘన ముద్గర శోభిత ద
క్షిణ బాహువు దున్మె వాడు చే డ్పా టొందన్.

840. వాయ వ్యాస్త్ర విఖండిత
మై యా దనుజ భుజ మత్రభ మం దేగి పడం
గా యాతుధానులు మడిసి
రా యెడ బెక్కండ్రు ముద్గ రాయుధ హతులై

841. కుడిచేయి త్రుంప బడియున్
గడు దీవ్ర క్రోధ మూని నక్తంచరుడున్
వడి నెడమ భుజంబున న
య్యెడ గల సాలంబు బెఱికి యేయు కడంకన్.

842. తరువుం బూని రయమ్మున
బరు విడుచు న్వచ్చు నసుర పై నైంద్రాస్త్రం
బు రఘూద్వహు డేయగ స
త్వరమై భంజించె నద్ది వామ భుజంబున్.

843. కరములు రెండున్ దెగి నిశ
చరుండు పద ఘట్టనంబు సల్పుచు రా దా
శరథియు దత్పద యుగ్మము
నఱకె దడయ కర్ధ చంద్ర నారాచములన్.

844\. కనులం గెంపులు రాలం
గ నికృత్త కర చరణుండు ఘటకర్ణుడు రా
ముని పై బర్విడె దివి జం
ద్రునిపై జను రాహువు గతి దోప రయమునన్.

845\. కడు భీకరముగ నార్చుచు
బడబా ముఖమో యనంగ బర్వెత్తుచు వ
చ్చెడు న ద్దనుజుం గని రా
ముడు బ్రహ్మాస్త్రమున గంఠము న్దున్మె వెసన్.

846\. తాళ ఫలంబున్ బలె న
భ్రాలయ వీథి కెగసి దివిజారి శిరం బ
చ్చో లంకావీథి బడెన్
శైలాభ తను పతనంబున జలధి కలగెన్.

847\. అలరులు వర్షించిరి సుర
లలరిరి రామ స్తుతుల మహర్షి చయంబుల్
జెలగిరి ముదంబున గపులు
గలగిరి సురవైరులు భయ కంపిత తనులై.

**రావణుడు కుంభకర్ణునికై విలపించుట.**

848\. రణమున నీల్గె ఘటశ్రవు
డని చారులు విన్నవింప న త్యుత్కట శో
క నిపీడి తాత్ముడై రా
వణుండు మూర్చిల్లి నేల బడె దీనుండై.

849. అవలన్ దెలివంది షట
శ్రవసున కై పొగిలె రాక్షసవిభుం డయయో!
దివి కేగితె! యేకతమ న
ను వీడి, యేగతి మనుదు నినుం గోల్పడుటన్.

850. సుచరిత్రుం డగు తమ్ముడు
వచియించె విభీషణుండు బ ల్విధముల బో
రుచితంబు గాదు శ్రీరా
మచంద్రుడు తో ని మ్మతనికి క్ష్మాసుత నంచున్.

851. వినవైతి గంధకావర
మున గర్వితచిత్తవృత్తి మూర్ఖుడ వై దూ
షణముల్ వల్కి వెడల ద్రో
సినావ ద త్పరమ పుణ్య శీలుం బురికిన్.

852. ఆ పాప ఫలం బీ గతి
జేపడె త్రైలోక్య విజయ సిద్ధి న్నాకున్
బ్రాపైన ప్రహస్తాదుల్
రూపజిరి మదీయ కామ లోలుప బుద్ధిన్.

853. రామున్ వధింప జాలక
యీ మెయి జీవించి యున్న నేమి ఫలము సీ
తామహిళామణితో నా
కేమిపని దివంబు సొత్తు నేనుం గూడన్.

554. అనుచున్ విహ్వల చిత్తం
బున ధైర్యము దూలి పంక్తిముఖు డేడ్వం గా
గని త్రిశి రాఖ్యుం డగు త
త్తనూజు డేతెంచి యి వ్విధమ్ముగ బలికెన్.

555. హతు డయ్యె న్నరు చే నా
పితృవ్యు డం చీ గతి దురపిల్లం జనునే
క్షితిధరదేహుండు విధి
ప్రతికూలత గా కిటు వడు వాడె యొకనిచే.

556. స్వయముగ నీవున్ భువన
త్రయంబు నోర్వం గల విధి దత్త మహాశ
క్తి యుతుండవు నీ కా నరు
జయింప భరమౌనె యేల సంతాపింపన్.

557. జనకా! యే నేగి వధిం
తు నన్నరాధము ననుజుని తోడ గపులతో
దను గరుడుం డురగమ్ముల
దునుము గతి న్నే నిట బరితోషం బందన్.

557. అంతన్ జనుదెంచిన దే
వాంతకుడు నరాంతకుండు నతికాయుండున్
బంతము లాడిరి మేము వ
ధింతుము దాశరథి నంచు దీవ్యద్భుజులై.

859. నలువురు కొడుకులు వీర
ప్రలాపములు శ్రవణ సుఖకరమ్ముగ నాడన్
బలలాశనపతి హర్షో
జ్జ్వ లేక్షణుం డై గవుగిట వారిం గొనుచున్.

860. కాల ప్రచోదితుం డై
యాజిం బొనరింప బంచె నవ్వారి మహా
భీలమ్ముగ వారు రిపున్
గూలిచి వత్తు రను నాశ క్రొన్నన లెత్తన్.

861. సమరంబున రిపు విజయం
బమర దశాస్యుడు ని జాత్మజావళికి సహా
యము గా నంపె మహాపా
ర్శ్వ మహోదరులన్ నిజానుజన్ముల నెలమిన్.

862. వలగొని దనుజపతికి జో
తలనిడి వా రేగిరి రణధాత్రికి దేహం
బులకు మహౌషధ గంధం
బు లలమికొని క్షాత్ర తేజము ల్మెఱయంగన్.

863. సురకరిజన్యంబును నా
భర ణాలంకృతము నగు నిభశ్రేష్ఠము పై
నరుగుచు గనంబడె మహో
దరుం డపర శైల సంగ తార్కుం డనగన్.

864. అనవద్య రథ స్థితుడున్
ధనుర్ధరుండు త్రిశిరుండు దలపించెన్ ధా
రుణీధర విలస ద్విద్యు
ద్గణేంద్ర చాప కలితంబు ఘన మేఘంబున్.

865. సకలాభరణాలంకృతి
ప్రకాశమానుడు ధనుర్ధర శ్రేష్ఠుండున్
ప్రకట పరాక్రమ శీలు డ
తికాయుడొ ప్పెసగె మేరు దీధితి తోడన్.

866. కన దుల్కాభ ప్రాసము
గొని భీమతనుడు నరాంతకుడు శ్వేతాశ్వం
బున వాయు వేగ మొప్పం
జనె శక్త్యాయుధ ధరుండు స్కందుం బోలెన్.

867. గద బూని మహాకాయుం
డుదగ్ర తేజో పరాక్ర మోత్సాహమునన్
బొదలి మహాపార్శ్వ డరిగె
గదాధరుం డగు కుబేర కల్పుం డగుచున్.

868. మణి కుండల రత్న కిరీ
టి నైగనిగ్యములు దిక్తటమ్ము లలమ సూ
ర్య నిభ ప్రభా నిధానులు
చని రయ్యార్యవరు రణ ప్రశంసోక్తులతో.

869. ఆ రాజకుమారులతో
వైరి విదారణ పటిష్ఠ బహ్వాయుధ దీ
ప్తోరు చమూ వితతి నడిచె
శ్రీరాముం జెనక సర్వ సిద్ధం బగుచున్.

870. రిపు హననమొ, యాత్మ నిధన
మొ పట్టు వీడక చెలంగి పోరం గమకిం
చి పలల భటు లేగిరి రా
జ పదార్పిత జీవను లయి సమర స్థలికిన్.

871. నింగియు నేలయు దద్దరి
లంగా నార్చుచు నిశాచర గణంబు లటుల్
సంగర కౌతుక మలరం
గం గపులం దాకి సాయ కౌఘము లేయన్.

872. కపులుం జెలంగి యెదిరిం
చి పృథుశిలలు భూరుహములు జిమ్మిరి భుజ శ
క్తి పటుత్వంబులు మెఱయగ
విపు లోద్ధత సింహనాద భీషణు లగుచున్.

873. చెలగెన్ గదనం బతి సం
కులముగ దలపడి యిరుదెగ క్రోధోజ్జ్వల నే
త్రులు దారు ణాశ్మ భూజ
జ్వలి తాగ్ర శర ప్రయోగ సన్నద్ధులు గాన్.

874. అరదము నరదమ్మున గరి
గరి చేతన్ దురగము దురగము చే సమయిం
చిరి వానర వీరులు నిశి
చర సైన్యం బందు జొచ్చి సాహస మదరన్.

875. కరవాల హస్తునిం ద
త్కర వాలమ్మున, గదాయుధ ధరున్ గద చే
వర శూల భూషితున్ ద
త్పర మాయుధమున నడిచిరి వానర యోధుల్.

876. రక్కసులుం జెలరేగుచు
జక్కడచిరి గపుల శాత శర సంహతులన్
వెక్కస మయ్యెం జూడ్కుల
కక్కుంభిని ర క్తమాంస కర్దమ యుతమై.

877. వానర విజృంభణమ్మున
దానవ సైన్యము బలాయితం బగు చుండన్
బూని నరాంతకుడు జవము
మై నేగె గపీంద్ర సైన్య మధ్యంబునకున్.

878. త్రాసము న న్నుఱు మూడం
గా సాగె నరాంతకుండు గపివితతి మహో
ల్లాస ప్రక్రియ నేచి దు
రాసదు డై యచటి వానర బలంబులకున్.

879. వలముఖ దేహావయవం
బులు ప్రోవులుగా బడె రణభువి నెల్లెడలన్
జెలగె మహార్త ధ్వానం
బు లంబుధి తరంగ రవ సముద్ఘోషములై.

880. అంతకు చందం బొప్ప న
రాంతకుడు కడంగి కూల్ప నగచరతతు ల
త్యంతాకులులై పాటి ఖ
రాంతకు మఱువు గన భాస్కరాత్మజు దంతన్.

881. అంగదు జేరి నరాంతకు
పొంగణ గార్వంగ నేగుము కపి సమూహం
బుం గావు మనగ నతడున్
సంగర కౌతుక మెలర్ప జనె నుద్ధతుడై.

882. ముక్కడి మూకల జంపుట
యెక్కుడె! శౌర్యోద్ధతుండ వే యగుచుం బెం
పెక్కుడు వేనియు నాతో
నెక్కటి కయ్యం బొనర్చ యే పారు మికన్.

883. ఏ నంగదుడ నరాంతక!
వానర రాజ్యాధిపుండు వాలి సుతుండన్
నా నేర్పు దీర్పు జూతువు
గాని నిలువు మోరి దుష్ట! కదనంబునకున్.

884. అనిన నరాంతకు డిట్లనె
కను గానక మిట్టిపడెదు కలహం బేలా?
నినువంటి బాలకునకున్
జను మటు గా దేని చావు సత్యము నీకున్.

885. అన నంగదు డనె బాలుం
డ నంచును ఛలమ్ము మెయి రణము సేయక పో
జిన నేమొ గాని యూరక
నిను న్విడువ జూపు మింక నీ భుజశక్తిన్.

886. అన నుద్యత్క్రోధమునన్
దనుజుం డంగదు నురంబు న న్వైచె సుప
ర్వ నికర సంత్రాసము దై
త్య నాయ కోల్లాసము మహిత ప్రాసంబున్.

887. అరుణార్క ద్యుతు లీనుచు
నరాంతక ప్రాసము గగన చ్యుత మౌ చి
చ్ఛుటపిడు గట్టులు దాకియు
విఱిగి పడెన్ వజ్రిపౌత్రు వెడద యురమునన్.

888. శకలము లై ప్రాసము వడ
నకుంఠిత జవంబు మెఱయ నంగదు డున్మిం
టి కెగసి డిగి చఱచె నరాం
త కాశ్వ మూర్ధంబున గరతల మెత్తి వడిన్.

889. కనుగ్రుడ్లు బయల్వడ వా
తను ముక్కున శోణితంబు ధారలు గా గ్ర
క్కి నరాంతకు డధిరోహిం
చిన తురగము నేల గూలె జీవం బెడలన్.

890. తన యాయుధంబు వృథయై
చనుట, నిరాయుధుడు వాలి సంభవుడు హయం
బును దున్ముట గని మే న్దెలి
యని కోపంబున నరాంత కాసురు డంతన్.

891. దృఢముష్టి సాచి యంగదు
బొడిచె నురంబున బరవశముం జెంది ధరం
బడి యంగదుండు బోధము
వడసి వడి నెగసి యవార్య బల విస్ఫూర్తిన్.

892. కరతలమున నడిచె నసురు
శిరంబు బలు వ్రక్క లగుచు జెల్లాచెదరై
ధర బడె నయ్యది దానవు
శరీరమున్ గూలె శైల సంపాతమనన్.

893. అమరారిం దునుముట న
య్యమరాధిపు పౌత్రు దద్ద యగ్గించిరి దే
వ మహర్షి గణము లానం
దమునన్ దాశరథియు నభినందించె గడున్.

894. ఆ రీతి నరాంతకు పా
టారసి దుఃఖాకులులు మహాక్రోధులు నై
వైరిం గూల్ప జనిరి ని
ర్వారణ దేవాంతక త్రిశిర మహోదరులున్.

895. ఆ మువ్వు రేక మై యు
ద్ధామ జవంబున నెదిర్చి తారాసుతుపై
దోమర గదా శిత శర
స్తోమము లేయంగ నంగదుడు సత్వరుడై.

896. తరువులు వైవంగ మహో
దరుం డుడిపె దోమ రాయుధంబున శిలలన్
గురియంగ నుఱు మొనర్చెన్
శర ప్రతతి చే ద్రిశిరుడు జాతుర్యమునన్.

897. కరి బిరి కొల్పికొని మహో
దరుం డదర నంగదుండు దంతావళమున్
జఱచె నఱచేత కుంభం
బిరు వ్రక్కలు గాగ నెత్తు రెగసి పడంగన్.

898. అంతట బోవక యక్కరి
దంతంబులు బెఱికి వైవ ధారుణి బడె గా
లాం తాభ్రోపమ ఘీంకృతి
రంతు ల్సేయుచు మహోదర భయావహ మై.

899. కరి దంతము లూడ్చి మహో
దరు నవియం గొట్టె బెట్టిదంబగు ముష్టిన్
హరినాథ సూనుడు మహో
దరుండు ధర బడియు నెగసి తాడించె గపిన్.

900. పలల ప్రహారమున జే
ష్టలు దక్కియు నంగదుండు జాత స్పృహుడై
కలియం బడ బోవన్ ద
ల్లలాటమున నేసె నరి జ్వల ద్బాణములన్.

901. రాకాసులు ముప్పు రంగదు
దాకుట నీక్షించి పర్వత శిఖరి వైచెన్
పీక ద్రిశిరు పై నీలుం
డాకిడె దేవాంతకు ననిలాత్మజుడు వెసన్.

902. తునియ లొనర్చె గిరి శిఖరి
ననల్ప నిశి తాగ్ర సాయ కావళి ద్రిశిరుం
డనిలజు నెదిర్చె బరిఘం
గొనుచున్ దేవాంతకుండు క్రోధోగ్రుండై.

903. హనుమంతుం డంత దివ
మ్మున నెగసి యసుర శిరమ్ము బొడిచె ద్రుతగతిన్
ఘన వజ్రముష్టి యసురుడ
వని బడి చచ్చె కనుగ్రుడ్లు బయలు వడంగన్.

904\. క్రుద్ధుం డై త్రిశిరుండు మ
హద్ధనువున గూర్చి యేసె నాశుగ తతి న
త్యుద్ధతి నీలుం డవియగ
నద్ధా యంచున్ జనె గవియ మహోదరుడున్.

905\. నీలుడు త చ్చిత నారా
చాళిన్ జర్జరిత దేహు డయ్యు గడంకన్
శైల శిఖరంబున మహా
భీలముగ మహోదరు దల విఱుగం గొట్టెన్.

906\. త్రిశిరుం దరుదెంచి మహా
నిశిత శరౌఘంబు బఱపి నీలున్ బవమా
నసుతు నలయించె బెల్లుగ
విశీర్ణ మొనరించె హనుమ పెనుశిల వైవన్.

907\. తతవిక్రముడు జగత్ప్రా
ణతనూజుం డంత రావణతనూజు రథా
శ్వ తతిన్ బడ మూతమ్మున
క్షితి బడ గొట్టి పొడి సేసె జెచ్చెర రథమున్.

908\. విరథుం డై త్రిశిరుం డు
ద్ధురగతి శక్త్యాయుధంబు దొరపు టురమున్
గురిసూసి యేయ ధీరత
గరముల గొని విరిచి వైచె గరువలి సుతుడున్.

909. కరవాలము చేత గొని య
సురు దదరంగ బవమాన సుతు డుద్దవిడిన్
గరికిన్ లంఘించు మృగా
ధిరాజ మన నెగసి త ద్దితిజు నొడిసి వెసన్.

910. కరవాలంబున ఖండిం
చె రయంబున జెలగి త్రిశిరు శిరముల్ మూడున్
బరమోదగ్రత, నార్త
స్వరముల బాఱి రతికాయు సన్నిధికి భటుల్.

911. గదబూని మహాపార్శ్వుడు
త్రిదివేశ భయావహుండు రేగి యనల్ప
క్రుధ మది రెక్కొన గపులన్
వధింప సాగె, ఋషభుండు వడి నడ్డంబై.

912. అసురగదాఘాతమునన్
వసువం బడి లేచి యెగసి బాహు బలం బొ
ప్ప సురారి పై బడి గదన్
గ్రసించి మోదె శిరము బలు వ్రక్కలు గాగన్.

913. సకలాస్త్ర రహస్య విదుడ
తికాయు డేతెంచె దృక్తతిన్ బెల్లుగ ని
ప్పుకలన్ రాల్చుచు దేవాం
తక ప్రభృతి బంధు జన నిధన తాపమునన్.

914. అరు ణార్క ద్యుతి భాస్వర
మరు జ్జవ సహస్ర హయ సమాయోజిత ది
వ్య రథంబున మణికుండల
కిరీట కాంతి దిశలు వెలిగించుచు వచ్చెన్.

915. కరమున దివిజేంద్రోజ్జ్వల
శరాస నిభ ధనువు దాల్చి సక లాశా గ
హ్వరములు మ్రోయ గుణధ్వని
బఱగం జేయుచు నిశిచర వరు డేతేరన్.

916. మఱలి పునర్జీవితుడై
యరుదెంచెనొ కుంభకర్ణు డంచు గపిభటుల్
బరువెత్త సాగిరి సమర
పరాఙ్ముఖత్వమున నమిత భయ మావహిలన్.

917. అడుగో చూడు విభీషణ!
కడు నుద్ధతి సింగపు గనుగవ మెఱయగ వ
చ్చెడు గిరి సదృ శాకారు డొ
కడు విపుల సహస్ర తురగ కలిత రథమునన్.

918. అగపడు చున్నది రథమున
నగణ్య తోమర పరశ్వ థాసి ధనుస్తూ
ణ గదా ద్యాయుధ తతి, భయ
ద గతిన్ రాహు గ్రహంబు ధ్వజమున దోచున్.

919. కరమున శక్త్యాయుధమున్
ధరించి మృత్యువె యనంగ దర్శన మాత్రో
గ్ర రిపు ప్రాణానిల సం
హరణో ద్ధుర తేజము మెఱయం జనుదెంచున్.

920. తెలుపుము వీ డెవ్వడొ కుం
డల మండితకర్ణ మంగళక రాక్షియుగం
బులతో నాది త్యాంత
ర్జ్వలన త్తారాధిపు డన వెలుగుచు వచ్చున్.

921. అను రామున కత డిట్లనె
వినుము ప్రభు! దశాస్యు సుతుడు వీ డతికాయుం
డనగ ప్రసిద్ధుం డఖిలా
స్త్రనిపుణుడున్ శాస్త్రవిదుడు దంత్రి కెన యగున్.

922. నిర తాత్మ ధ్యాన పరుడు
గరి తురగ రథాధిరోహ గరి మోపేతుం
డరి వీర నిర్మథన చా
తురీ ధురీణుడు బరగు జతు రుపాయుండై.

923. తప మొనరించి పితామహు
కృప న్బడసె రామ! వీ డనేకాస్త్రములున్
రిపు దుర్భేద్య కవచమున్
దపన స మోద్దీప్త కాంచన స్యందనమున్.

924. అలతిం బోవండు సుప
ర్వుల గెల్చిన వాడు దైత్యపురి నిర్భీతిన్
విలసిల్లు వీని ప్రాపున
విలంబనము సేయ దగదు వీనిం గూల్పన్.

925. అనుచుండం దనుజుడు జ్యా
నినాద మొనరించి బాణ నిచయ మ్మడరిం
ప నఖాయుధ తతి కూలె న
గణితమ్ముగ ఛిన్న మస్తక గ్రీవంబై.

926. ఎదిరించి రంత ద్వివిద కు
ముదులున్ నీలుడు శరభుడు బూర్వామరు ను
న్మదవృత్తి భూరి భూమిరు
హ దారుణ శిలా ప్రవృష్టి నందఱు నొక్కటై.

927. విలుకాండ్ర మేటి యగు న
ప్పలలాశి శర ప్రయోగ వైదుష్యమునన్
శిలలన్ దరువుల బలు దు
న్కలొనర్చియు నొంచె గపుల గాత్ర క్షతులన్.

928. ఎదిరించిన కపు లెల్లరు
విదారితాంగంబుల భుజవీర్యము లడగన్
గదనోర్విం బడగా దు
ర్మదుడై యతికాయు డిట్లఱచె నుగ్రముగన్.

929. దితిజేశ్వరుండు రావణు
సుతుండ దర్పోద్ధతుండ సురదుర్జయుడన్
అతికాయుడ శక్తి సమ
న్వితు లుత్సాహ పడిరే ననికి రం డింకన్.

930. అనుచున్ ఘోరముగ ధను
ర్గుణధ్వని నొనర్ప క్రోధ ఘూర్ణిత మతియై
చనె లక్ష్మణుండు చాప
ధ్వని దిశలు ప్రతిధ్వనింప దనుజు నెదిర్పన్.

931. దితిజుండు ద ద్ధనుష్టం
కృతికిన్ మదిమెచ్చియు బలికెన్ లక్ష్మణు నా
కృతి జూచి, తగని దురహం
కృతి వచ్చితి విట్లు పోరికిన్ బాలకుడా!

932. ఇది దుస్సాహసము దురా
సదుండ దిక్పాలక వ్రజంబున కేనిన్
గదన స్థలమున, మేల్కా
ల్ప దలంతువె యిట్లు సుప్త పంచాస్యంబున్.

933. రణమునకుం జాలవు జీ
వనమున్ దక్కించు కొమ్ము వచ్చిన దారిన్
జని పడి జాలక! కాకు
న్నను నిన్నిప్పుడ యమ సదనంబున కనుతున్.

934. అనినన్ లక్ష్మణు డిట్లనె
రణస్థలి న్నిల్చియు వదరం జొచ్చెద వ
ట్లని నంతనె శూరుడ వౌ
దె! నిక్కపున్ శూరుడ వగు దే న్నాఖు మనికిన్.

935. అని పల్కి లక్ష్మణుం డం
త నిశాతాంబకము ధనువునం గూర్చి రణ
మ్మునకున్ సిద్ధమ్ముగ ని
ల్చిన గోపించి దనుజుండు శిత శర మేయన్.

936. అలిగి సుమిత్రాతనయుం
దలవోకగ నంబరతల మం దద్దానిన్
బలునారసమున దున్మి ప
లలు నేసెం బటుశరంబులం దీవ్రగతిన్.

37. దితిజుండు ద చ్చరావళి
వితథం బొనరించి చండవేగమున శర
ప్రతతి నడరించె సౌమి
త్రి తనువు లక్ష్యంబు సేసి ధృతిమంతుండై.

938. దితిజ ప్రయుక్త నారా
చతతిన్ ఖండించి వైచి సౌమిత్రియు దా
నతికాయు పై నురవడిన్
బతత్రి సాహస్ర మేసె వజ్రనిభమ్మున్.

939. సౌమిత్రి యేసిన శర
స్తోమము పిటిగి పడె రాక్షసుడు దాల్చిన య
మ్మైమఱువు దాకి, భూత
గ్రామంబు ససంభ్రమంబుగా గన జొచ్చెన్.

940. ఆ రీతి శరము లెల్లం
ధారుణి బడుటం గని కుపితస్వాంతుండై
యా రాముదమ్ముడొక బల్
నారసమున నొంచె రిపు లలాటంబు వెసన్.

941. హరదేవు శరాహతికి ద్రి
పురగోపుర మనగ దానవుడు మై కంపిం
ప, రథంబున గూలం బడె
శిరంబు బట్టికొని కొంత సేపటి దాకన్.

942. అవలన్ స్వస్థుం డై దా
నవుండు లక్ష్మణు మనంబు న న్మెచ్చియు దా
బవి సన్నిభ తీవ్ర శరం
బు వక్షముం గాడ నేసి పొలిచె బలియుడై.

943. ఉరమున నాటిన శరమున్
బెరికి పడ నై్వచి కనుల నిప్పులు రాలన్
బరగించె దానవుని పై
నురవడి సౌమిత్రి యగ్ని హోత్రాస్త్రంబున్.

944. అతికాయుడు సూర్యాధి
ష్ఠితాస్త్రముం బఱప నవ్వి చెలగుచు దీప్రో
ద్ధతి నొండొంటిం దాకి ని
హతమ్ము లయ్యె వియదధ్వమం దస్త్రములన్.

945. కనలున నైషికాస్త్రము
దనుజుం డేయంగ రాము దమ్ముం డైంద్రా
స్త్రనిహత మొనర్చె, నసురుం
డనిపిన యామ్యాస్త్ర మడగె ననిలాస్త్రమునన్.

946. కరకు శరము లెన్నేసిన
నరివీరుం డక్షతతనుడై యుండుట న
బ్బురపడి లక్ష్మణు డంతన్
బరపె మరుత్ప్రేరితుడయి బ్రహ్మాస్త్రంబున్.

947. ఆ యస్త్రము దుర్వార్యం
బై యసురు శిరంబు దున్మె నాహవభూమిన్
హా యని పెల్లార్చుచు నతి
కాయుని సైన్యంబు పాఱె గన్న తెరువునన్.

ఇంద్రజిత్తు యుద్ధమునకు వచ్చుట

948. అతికాయాదులు కూలుట
దితిజేశ్వరు డాలకించి డిగు లంది చమూ
పతులం గని యిట్లనె రా
ముతో దలపడి బ్రతుకండు పో యొక డేనిన్.

949. సుర విజయమ్మున దోడై
పరగిన తమ్ములు ఘటశ్రవాదులు రణసు
స్థిరవిక్రములు తనూజులు
నరాంతకాదులు వడిరి రణంబున బలియై.

950. అమరేశునకున్ దీటై
సమరస్థలి నిల్చి నట్టి సాహసి భుజవి
క్రమశాలి ప్రహస్తుడు తృణ
సము డయ్యెన్ వానర నర జాతుల కకటా!

951. సామాన్యక్ష్మాధవుడే
యీ మానవు డంచు భావ మందెంచితి గా
నీ మాధవుం డనుట నిజ
మౌ మాట యటం చెఱుంగ నయ్యె నిపు డిటుల్.

952. వరలబ్ధ నాగ శర దు
ర్భరబంధము బాయ గల్గె రాము డనుజుతో
వర మంత్రౌషధ బలమో
మఱి మాయయొ యెఱుగ జాల మది సందియమౌ.

953. ఆయన నాశరహిత నా
రాయణు డే కావలె మన రాక్షసవరులం
దాయోద్ధ నెదుర జాలెడు
నాయోధన కుశలు డొక్క డైనం గలడే.

954. పురి గాపాడుడు మీ రన
వరతమ్ము ప్రధాన రాజ పథములు నగరుల్
బుర జన నివాస గృహముల్
జొఱ నీయకు డేరి న య్యశోకవనమ్మున్.

955. చులకన గా జూడకుడు గ
పులంచు, రేబవలు సిద్ధముగ నుంచుడు సే
నల, నప్రమత్తు లగుడని
పలికి దశాస్యు డరిగె నిజ భవనమ్మునకున్.

956. భవనము సేరియు నా బం
క్తివదనునకు జేకుఱదు మదిన్ స్వాస్థ్యము రా
ఘవు గెల్చు నుపాయము సం
భవింప దిక శోకవహ్ని పాయక రగులున్.

957. అత డాగతి ఘనశోక
ప్రతప్తు డై యుండ మేఘరావుం డరుదెం
చి తగువిధంబున ద త్ప
స్తుతి సేసి విచార ముడిపి తో నిట్లనియెన్.

958. నా శరముల పద నెఱుగుదు
వాశరనాథ! తలకకుము, వానర తతితో
దాశరథుల నిప్పుడ ధా
త్రీశయనుల జేసి వత్తు దిరముగ గనుమా!

959. అనుచున్ గొన్ని ప్రగల్భ వ
చనంబు లాడి పితృ హృదయ సంప్రీతిగ, దీ
వన లంది మేఘనాదుడు
చనె బహ్వాడంబరమున సమరంబునకున్.

960. కదసి స్థలికిం జేరి య
రదంబు డిగ్గి కుశలున్ జలంబు సమిధలున్
మృదుగంధాక్షతలున్ సుమ
కదంబములు నేర్పడంగ గావించి యొగిన్.

961. అనురూప మంత్ర పఠనం
బొనర్చి విద్యుక్తసరణి హోమంబున్ జే
సి నిశాచరు డగ్న్యారా
ధనము సలిపె భక్తిపూరిత స్వాంతుండై.

962. కనకాభరణాలంకృతి
దనరారుచు నగ్ని దైవతము కుండమునన్
జనియించి కైకొనియె మే
ఘనాదు డొసగిన హవిస్సు కరముం బ్రీతిన్.

963. అతులాత్మయోగ నిష్ఠా
రతుడై బ్రహ్మాస్త్ర మంత్ర రాజంబు జపిం
చి తురగ సూత రథాయుధ
తతి న్నపూత మ్మొనర్చె దనుజుం డంతన్.

964. ఎగసి యరదంబు తోడన్
గగనమ్మున కింద్రజిత్తు కనరాక శితా
శుగవర్షం బొనరింప గ
పిగణమ్ములు నేలగూలె భిన్నాంగములన్.

965. ధరణీతలమున రాత్రిం
చర సైనికు లభ్ర మార్గ చరులై రాత్రిం
చరనాథ పుత్రుడును వా
నర సేనల జక్కడచిరి నానా గతులన్.

966. హనుమ న్ముఖకపి వీరులు
ఘనశిలలున్ భ్రాకులు గొని వియదధ్వమునన్
జని యెదిరించిరి తన్మే
ఘనాదు భుజ శౌర్య ధైర్య గర్వ స్ఫూర్తిన్.

967. తనపై కపివీరులు వై
చిన భూరి శిలా తరువుల ఛిన్నమ్ము లొన
ర్చి నిశాత పుంఖముల ద
త్తనువుల గాయము లొనర్చె దనుజుండు వెసన్.

968. గుణ ఘోషం బొనరించుచు
ధను వాకర్ణముగ దిగిచి దశకంధర నం
దనుడు పరగించె శిత మా
ర్గణాసి తోమర గదా పరశ్వథ వితతిన్.

969. వలయీకృత దనుజ ధను
శ్చలిత బహు విధాయుధ హతి జచ్చిరి కపియో
ధులు లక్షలు కోట్లుగ జే
ష్టలు దక్కిరి రవిసుతాది శౌర్య నిధానుల్.

970. అసుర ప్రయుక్త నారా
చ సంతతులు వచ్చి రామ సౌమిత్రులపై
మునరె నెడలేక పర్జ
న్య సలిలవృష్టి యచలంబు నట్టు లురవడిన్.

971. అనుజున కిట్లనె రాముడు
వనరుహ భవ దేవ దత్త బ్రహ్మాస్త్రము వై
చె నసురు డయ్యది సృష్టిం
చె నిట్టి యాయుధతతి, ప్రతి చేమోడ్పె యగున్.

972. మా రెరుగని యీ యస్త్రము
జారిపడి యెదిర్చి నిల్చి బ్రదుకం గన రె
వ్వారును దమ్ముడ! కావున
పోరు టుడిగి గౌరవముగ మ్రొక్కుటయె తగున్.

973. అన న ట్లొనర్చి భూమి శ
యనించి రవ్వారు మూర్ఛ నందిన గతి, న
య్యనవద్యాస్త్రంబు శమిం
చె నంత మఱలి చనె నింద్రజిత్తున్ బురికిన్.

974. ఎటుపోయిన శవమయమై
యెటు విన్న మహార్తనాద హృద్భేదకమై
యెటుచూచిన మాంసాస్ర వి
కట దర్శన మైన ఘోర కదన ధరిత్రిన్.

975. ఎవ రేమి గతిం బడిరో
రవి జాంగద జాంబవంత ప్రభృతి కపులు ఊా
దవలె నటంచు బ్రతప్త మ
తి విభీషణు డేగె గలయ దిరుగ హనుమతో.

976. విపుల క్షత స్రవ ద్ర
క్త పూర దేహ మరమోడ్పు గన్నులు, గొనయూ
రుపు తోడ జాంబవంతు డి
లపయిం బడియుండ నగ్గలం బగు వంతన్.

977. అరితీవ్రాశుగ వేదన
భరించి పూజ్యుండ పీ వవని గూలియు ని
క్కరణి బ్రదికి యుండుట వా
విరి మాకున్ భాగ్య మని విభీషణు డనినన్.

978. ఎఱిగితి భవదీయ గళ
స్వరమ్మున విభీషణుండ వంచు మహాత్మా!
ఎఱిగింపుము సేమము మై
వరలునె వాతాత్మజుండు వానర సేనన్.

979. అని జాంబవంతు డడుగం
గ నిట్లనె విభీషణుండు గర మాశ్చర్యం
బున, రామలక్ష్మణుల వీ
డి నీ వి దేటికి హనుమ నడిగెదవు తాతా!

980. అన జాంబవంతు డిట్లనె
వినవయ్య వచింతు లోక విశ్రుత చరితుం
డనఘుడు మహాను భావుం
డనిలజు డున్న సుఖు లౌదు రందఱు జగతిన్.

981. అనుచుండ వాయు సుతు డ
వ్వనరుహభవసూతి పాద పద్మంబులకున్
దన మౌళిగూర్చి యంజలి
నొనర్చె భక్తి ప్రపూరి తోత్సాహమునన్.

982. అనిలజు దాపునకు న్న
మ్మని యిట్లనె జాంబవంతు డంత మరున్నం
దన! యసుర తీవ్ర శరవే
దన బడు వానరుల దేర్చ దగు సత్వరమే.

983. వివశ స్థితిన్ బడిరి దా
న వాస్త్ర హతి రామలక్ష్మణ విభుల్ సద్ధ
ర్మవిచారరతులు తద్వ్రణ
నివారణ మొనర్ప నగు ననిలసుత! వేగన్.

984. గమన పరాక్రమముల బిత్రృ
సముదవు భువనత్రయమున సరిహానిం గా
నము నీకు గపుల గావగ
సమయం బిది పూను మట్టి సత్కార్యంబున్.

985. ఏమ లౌషధ కలితము లై
ల మొండు విలసిలు హిమాచల తలంబున హే
మమయ ఋషభ శృంగ సమీ
పమందున ధగద్ధగ ప్రభాళి మెఱయుచున్.

986. సౌవర్ణకరణియును సం
జీవ విశల్య కరణులు బ్రసిద్ధ మహిమముల్
పావని! సంధానకరణి
నా విదితమ్ము లగు నవ్వి నాల్గౌషధులున్.

987. అంబుధి పై నాకాశ ప
థంబున హిమగిరి కరిగి త దౌషధులన్ శీ
ఘ్రంబుగ జేకొని రమ్ము వి
లంబన మొనరింపకు మనిలతనయ! యనినన్.

988. అలఘు సలిల ప్రవాహం
బుల నతిశయ మొందు నబ్ధి బోలె బ్రహర్షో
జ్జ్వల బల సంపద మై వ
ర్ధిలి భల్లుకనాథు నన్నుతించి హనుమడున్.

989\. ఎగసె త్రికూట నగమ్మున
కగణిత జవము మెయి దత్పదాఘాతమునన్
బగిలె బెనుశిలలు లంకా
నగరమ్మున రాక్షవేశనము లల్లాడెన్.

990\. ప్రచల ద్భవన ద్వార
ప్రచయ భయోద్వేగ సంచల ద్రాక్షస పీ
రచయంబుల గన్పట్టె ని
శిచరనగరి నాట్య ఘటన శివ మెత్తి నటుల్.

991\. మలయాచలమున కెగసి య
వలీల వాతాత్మజుండు పదఘట్టనమున్
సలుపుచు శ్రీరాముని కం
జలించి గర్జించి రాక్షస భయంకరుడై.

992\. పవనాశన సదృశం బై
న వాల మూర్ధ్వముగ నెత్తి నభమున కెగసెన్
శ్రవణద్వయంబు గుంచిం
చి వీపు వంచి ముఖము దెఱచి హనుమ దంతన్.

993\. అనిల గమనంబునం జని
హనుమండు హిమాచలంబు నం దెల్లెడ శో
ధన సేసియు గనలే ద
య్యె నోషధి చయంబు భూమిభృద్దేశమునన్.

994. అంతం గాలవిలంబన
మింతయు నోర్వంగ లేక యిరుసేతుల వి
క్రాంతి మెఱయ ద దచలమున్
సాంతముగ బెకల్చి తాల్చి యంస తలమునన్.

995. పరచె గరుడుం డనగ సం
గర స్థలికి ఋక్ష కపి నికాయమ్మున క
వ్వర గంధాఘ్రాణమునన్
శరవ్రణ వ్యధ శమించి స్వాస్థ్యం బెసగెన్.

996. మృతకపు లెల్ల బ్రదికిరి నృ
పతిసూనులు స్వస్థులైరి వాయుసుతున్ బ్ర
స్తుతి సేసిరి బోరన ద
త్కృతి రవిసుత జాంబవ ప్రభృతి వనచారుల్.

997. కృత సత్కార్యుండై మా
రుతి హిమశైలమున కత్యురుజవంబున నే
గి తదౌషధ గిరి బూర్వ
స్థితి నెలకొల్పి మఱలి చనుదెంచె ముదమునన్.

998. కపివీరు లపూర్వోత్సా
హ పరవశు లగుచు నొనర్చి రమితోద్ధతి దై
త్య పటల హృదయ విదారక
విపుల జయ జయారవములు భీషణ గర్జల్.

999. పరమానందమ్మున దా
శరథుల కడ కేగి రామచంద్ర విభునకున్
గరముల్ ముకుళించి యనం
తర కార్యము రీతి దెల్పి తత్సమ్మతితోన్.

1000. రవినందను డిట్లనె దా
నవపతి కడు స్రుక్కి వేదనం బడుచుండన్
భవనంబున నిష్క్రియుడై
యవకాశం బిది మన కరిహనన మొనర్పన్.

1001. త్వర నేగి ముట్టడింపుడు
పురంబు, దెగటార్చు డెల్ల బూర్వామరులన్
దఱిమి తఱిమి, మారుతి యిం
క రామకార్యము ఫలింప గాంతు మనంగన్.

1002. శిరసా వహించి యా భా
స్కరనందను నాన జనియె గపితతి దివిటీల్
గరముల ధరించి లంకా
పురాభిముఖమై సరభసముగ న వ్వేళన్.

1003. పురమున భవన వితతికిన్
దరికొల్పిరి చిచ్చు కపి గణంబులు రాత్రిం
చర గృహములు గూలెన్ భ
స్మరాశులుగ ద న్నివాస జనసంతతి తో.

1004. గిరి సదృశ ప్రాసాద ని
కరంబు సర్వాభరణ సుగంధ ద్రవ్యాం
బర భోజన వస్తు ధను
శ్చరావళియు దగ్ధమయ్యె సంపూర్ణముగన్.

1005. మధుపాన వివశ దేహులు
వధూ పరిష్వంగ సౌఖ్య పరవశులు మహా
యుధ ధారులున్ గరి తురగ
రథాధిరోహులు సమసిరి రణయత్న పరుల్.

1006. జనులన్ హాహాకృతు లెస
గె నభోవ్యాప్తమ్ముగ, బరుగిడ సాగిరి కా
మిను లెల్లెడ ప్రియ పరిరం
భణమ్ముల స్వీడి ప్రాణ భయ పీడితలై.

1007. అలఘు ప్రవర్ధ మాన
జ్వలన శిఖామాలికా నిచయ సంక్రాంతిన్
బలలాశన హర్మ్య గ్ర
మ్ములు బహు కుసుమిత పలాశము లనం దోచెన్.

1008. కరి తురగ బంధములు స
త్వర బాప బరిభ్రమించె భయలోలములై
పురి ప్రళయ సమయ నీరా
కర భ్రమ ద్గ్రాహ నక్ర కాండంబు గతిన్.

1009. దిశలు తెలియక పఱచు న
ద్దశాస్యు భటులు సమసిరి శతసహస్రములై
దశరథ తనయు గుణధ్వని
యశని సమంబగుచు మ్రోగె నాశాక్రాంతిన్.

1010. కైలాసోన్నత దశకం
ఠాలయ శిఖరంబు గూలె నవనిన్ రామా
భీల శరాహతి వానర
జాలము గర్జించె గదన సంరంభమునన్.

1011. కలవరపడి కుంభ నికుం
భులు నిర్వారి గుంభకర్ణ పుత్రుల నతి వీ
రుల బంచె దశాస్యుం డ
వ్వల ముఖుల నెదిర్చి పోర బహుసైన్యముతోన్.

1012. దశవదన ప్రేరితులై
దిశ లాకంపింప ద్రుతగతిం జనె ఘటక
ర్ణ సుతద్వయం బనికి ఘో
ర సింహనాదముల వానర తతి నెదిర్పన్.

1013. అటు లట్టహాసమున జని
పటు శస్త్రాస్త్రధరు లౌచు వానర సేనా
పటల భుజశక్తికిం బ్రతి
ఘటించి తునుమాడిరి శిత కాండాహతులన్.

1014. నలిరేగి శిలలు భూజం
బులన్ గపులు వైవ దుత్తుము రౌనర్చిరి దై
త్యులు లాఘవంబునన్ గో
లల నేసి, రణంబు సంకులం బయ్యె నటన్.

1015. ఇరు దెగవారు బరస్పర
మురవడి దాకి యసి బాణ ముద్గర పరిఘా
పరశు గదా ప్రాస శిలా
తరు ముష్టి క్షతుల బడిరి ధరణి నసంఖ్యుల్.

1016. అంగదుడు కంపను నెది
ర్చెం గుపితాత్ముండయి, గదచేతం బ్రహరిం
చెం గడు దీవ్రమ్ముగ వా
డంగదు మూర్ఛబడె నాత డవనీ గతుడై.

1017. స్మృతినంది యంగదుం డొక
క్షితిధర శిఖరమ్ము రెండు చేతుల గొని తీ
వ్రతర రయంబున మోదెన్
దితిజు శిరోచ్ఛేదనమున నిర్జీవుడు గాన్.

1018. కంపనుడు వడుట గని వా
లంప గముల బొదివె శోణితాక్షు డరదమున్
దెంపున దోలించి క్రుధా
కంపితు డై యంగదు న్మగంటిమి తోడన్.

1019. తారాసుతు డవ్వీరుని
తేరికి లంఘించి వేగ దిగిచి కొనెన్ దూ
ణీరము ధనువున్ దితిజుడు
వారక బఱచె దివికి గరవాలము గొనుచున్.

1020. కూడ దివి కెగసి యంగదు
డోడక రాక్షసు నెదిర్చి యొడుపున ఖడ్గ
మ్మూడ బెటికికొని వ్రేసెన్
గాఢమ్ముగ దనుజ భుజ యుగాంతర సీమన్.

1021. కరవాలంబున్ జేతం
దరించి యంగదుడు గవిసె దనుజావళి ము
ద్గరము గొని శోణితాక్షు ద
దరె నంగదు పై బ్రజంఘు డట బాసట గాన్.

1022. ఒకవైపు శోణితాక్షుం
డొకవైపు ప్రజంఘు డప్డు యువరాజు నెది
ర్చి కలత బెట్టుట గాంచి య
లుక మై మైందద్వివిదులు రూక్షేక్షణులై.

2023. పరచి జవమ్మున నిల్చి ర
సురుల కెదుట మోహరించి శుంభద్గతి దో
దరుదెంచె రాక్షసుల క
త్తరి యూపాక్షుడు మహోగ్ర దర్పోద్ధతుడై.

1024. పదనగు కత్తులు ధనువులు
గదలున్ గొని దైత్యులు దరుకాం డాళ్మ చయం
బు దరుచరులుం గొని కడగి
రుదగ్ర వృత్తిం బరస్ప రోన్మూలనకున్.

1025. కపివీరులు రువ్విన పా
ద పాళ్మజాలము నడంచె దనుజత్రయి చి
ద్రుపలై రాల శర గదా
కృపాణ హతి సూతరథహరి సమారక్షన్.

1026. పరమర్మ నికృంతన పటు
కరవాలంబు గొని బాహుగర్వి ప్రజంఘుం
డురవడి నంగదు డాయ బ్రు
హరించె సాల క్షమారుహంబున వానిన్.

1027. కరవాలము ధాత్రిం బడె
గరచ్యుతం బై యసురు డెగసి సత్వరుడై
హరివీరు లలాటమున బ్రు
హరించె దృఢముష్టి నిస్పృహ ధరం గూలన్.

1028. వాలిసుతుడు లబ్ధస్పృహు
డై లంఘించి క్షణకాల మందు బ్రజంఘున్
లీల దెగనేసె దత్కర
వాలమ్మున మూర్ధ ముర్వి బడి దొరలంగాన్.

1029. యువరాజు చే బ్రజంఘుం
దవనిం గూలుట గని యరుణాక్షు డగుచు ను
ద్దవడిన్ యూపాక్షుడు గపి
గవిసె మహాఖడ్గ మొందు గరమున మెఱయన్.

1030. అంగదు దాకం జను నసు
రుంగని వేగ ద్వివిదుం డరుగుదెంచి తదీ
యాంగమ్ము నొంచె దృఢము
ష్టిం గీలాలము స్రవించి డీలుపడంగన్.

1031. ఆలోన శోణితాక్షుడు
హేలాగతి నేగుదెంచి యేపున గదచే
వాలాయుధు మోద గపి ని
రాలస్యముగ నొడిచికొనె స య్యసురు గదన్.

1032. అరచేత జరచె నంతట
నురమ్మున నైౖందు డల్గి యూపాక్షున్ దా
కిరి మైందద్వివిదులు స
త్వరులై యూపాక్ష శోణితాక్షాసురులన్.

1033. ద్వివిదుండు శోణితాక్షున్
గవిసి ముఖంబు నిజ ఖర నఖవ్రాతమునన్
జవమున అక్కి ధరిత్రి బ
డవైచి పదఘాతముల గెడపె గరిబలుడై.

1034. మదమత్త వారణము లన
నుదగ్రు లగుచున్ సలిపిరి యుద్ధము యూపా
క్షదనుజుడున్ మైందుండు భు
జదండ ఘాతముల ముష్టి సంహతుల వెసన్.

1035. మైందుడు యూపాక్షుండున్
గ్రిందు న్మీఁదై యొఱగుచు లేచుచు బోరం
గం దుది మైందుడు భుజశ
క్తిం దాడించి కొనె న ద్దితిజు ప్రాణంబున్.

1036. బలశాలులు మువ్వురు పల
లు లట్లు కపియోధ వర బలోద్ధతి ప్రాణం
బులు బాయ బాఱె భయ వి
హ్వాలమై సైన్యము ఘటశ్రవాత్మజు దెసకున్.

1037. అభయం బొసంగి కుంభుం
డి భేంద్ర శుంభద్గతి జని యేపున గపి వ
ల్లభులన్ మార్కొని శిఖి దీ
ప్త భూరి భల్ల ప్రభగ్న తనులం జేసెన్.

1038. ద్వివి దాం గద మైందులు గుం
భ వజ్ర సన్నిభ శర ప్రపాతమ్మునకున్
భువి గూల జాంబవంతుం
డు వేగదర్శియు సుషేణుడు సముద్ధతులై.

1039. అరిగియు నద్దనుజు మహా
చ్ఛూర పథము నతిక్రమించి చన జాలక ని
ల్చిరి వేలాతిక్రమణ మొ
నరింప నేరని జలనిధి నా నిష్క్రియులై.

1040. కీశ విభుం డంతట నా
కాశ పథంబున రయంబుగ నడరి గిరి సం
కా శాశ్మ ప్రతతి నిరవ
కాశంబుగ గురిసె గుంభు కాయంబు పయిన్.

1041. శరజాలంబున గుంభుడు
దెరలించె ద దశ్మసంహతి నమోఘముగా
హరినాథుం డుద్యత్క్రో
ధ రక్త నేత్రుడయి దుమికె ద ద్రథమునకున్.

1042. హరివిల్లు బోని రాక్షసు
శరాసనంబు దిగిచికొని సల్లాప మొన
ర్చె రవిసుతు డిట్లు మెచ్చ
య్యెర! విక్రమమున జనకున కీడగుదు వహో!

1043. వరబలమున గెల్చె దివిజ
వరుల న్నీదు పెదతండ్రి పంక్తిముఖుడు, దు
ర్భర నిజ భుజ ప్రతాపము
విరాజ మానముగ నీదు పితరుడు గెల్వన్.

1044. సరియగుదు వింద్ర జిత్తున
కరిదమనంబున, నలసితి వాహవ మందున్
విరమింతు గొంతవడి సం
గరంబు, శ్రమ దేరి పిదప కడగుము కుంభా!

1045. పే రందినాడవు దను
ర్ధారుల లోనం జగమున రాక్షసులం దె
వ్వారు సరిగారు నీ కని
వారణ బడగొట్టినావు వానర వరులన్.

1046. కదన పరిశ్రాంతుం గా
త్చె దపనసుతు డన్న వాడు నెందం దగవే
విదిత ప్రాభవుడన్ నా
కు దున్మెద రణో న్మదాధి కోత్సాహివి గాన్.

1047. అని మర్మగర్భముగ సూ
ర్యనందనుం డాడ దుర్భ రాగ్రహ వశుడై
దనుజుడు భుజబంధమున ద
పనసుతు బట్టెం బటపట బండ్ల గొఱుకుచున్.

1048. రవిజుండున్ దలపడి త్రో
సి వైవ రాకాసియు గపిశేఖరు పై దూ
కి విజృంభింప నతం డలు
క వశంబున పీచె వార్ధి గర్భంబునకున్.

1049. అంభోధి బడియు నెగసిన
కుంభుడు పిడికిలి బిగించి కొట్టె మహాసం
రంభమ్మున దాకుచు న
య్యంభోజ హితాత్మజాతు నంగం బవియన్.

1050 తనువున స్రవించె రక్తం
బినసుతునకు గోప మినుమడింప నడిచె వ
జ్ర నిభ దృఢముష్టి గూలెన్
దనుజుం డంత శిరము శతధా భిన్నము గాన్.

1051. కరికుంభోరస్కుడు కుం
భ రాక్షసుం డట్లు భూమి బడగన్ దత్సో
దరుడు నికుంభు డడరె భీ
కరముగ వానర వధార్థ కదనంబునకున్.

1052. దృగనల శిఖావళిం గా
ల్పగ నెంచు బగిది రవిప్రభవు జూచుచు హ
స్తగత కన త్పరిఘాయుధ
ము గిరగిరం ద్రిప్పుచు వలముఖ భీకరు డై.

1053. కనులకు వ్రేగగు తేజము
న నికుంభుం డడర వెల్ల నగుమోములతో
గనుచు న్నిలిచె గపి చమూ
గణం బపుడు చేష్ట దక్కి కదన క్షోణిన్.

1054. రవిసుతు దాకు నికుంభుం
బవనసుతుం డడ్డగింప బల్మి మెయిన్ దా
నవు డేచి వైచె బరిఘన్
బవనజు వక్షంబు దాకి పడె నది రెండై.

1055. సురనాథ ధ్వజ సన్నిభ
పరిఘాయుధ మురము దాక పడకె మహావా
నరు డొక్క క్షణము మారుతి
ధరణీతల కంపనంబు తటి శైల మటుల్.

1056. అనిలసుతు డంత నూల్కొని
క్షణలేశమున బరువెత్తి చఱచెన్ వక్షం
బున దృఢముష్టిం దానవు
డచువు వివశ మయ్యు దేరి దైత్యుండు వడిన్.

1057. అనిలజు నొడిచి భుజమ్ముల
గొని పాఱ దొడగె నసురుడు గొంకక మోద
మ్మున రాక్షసాళి జయజయ
నినాదము లొనర్ప గపులు నివ్వెఱ గందన్.

1058. తరిచూచి మరుత్తనయుం
డురవడి ఘూర్ణి ధరణీధరోరుతనుండై
ధరణీ స్థలి కణచి కెడపె
నరాదు నుగ్ర పదమర్దనముల నికుంభున్.

### మకరాక్షుడు శ్రీరామునిచే మడియుట

1059. ఆ రీతి గొంభకర్ణులు
ధారుణి ద్రెళ్ళుట నెఱింగి దనుజేంద్రుడు దు
ర్వార క్రోధోద్దీప్తిన్
బోరికి బంచె మకరాక్షు భూరి చమువుతోన్.

1060. తన తండ్రి ఖరాసురు గూ
ల్చిన వా డన్న పగ నెఱియు చిత్తము తోడన్
జనె మకరాక్షుడు కదన
మ్మునకున్ రాఘవు నెదిర్చి పోకార్పంగన్.

1061. వారును పీ రేల రణము
శ్రీరామునితో జెలంగి సేయుదు నంచున్
వీరాలాపము లాడుచు
బాఱె శలభ మగ్ని పైకి బర్వు విధమునన్.

1062 జ్వలన శిఖోపమ కాండం
బుల నడ్డువడిన కపితతి బోకార్చుచు వి
చ్చలవిడి నరుదెంచు దనుజు
నిలునిలు మని రాము డేసె నిశిత శరంబుల్.

1063. మకరాక్షుడు రాఘవు సా
యకమ్ము లన్నింటి ద్రుంచి యలవోక మహా
వికటమ్ముగ నవ్వుచు నీ
వికెందు బోగలవు తండ్రి ఋణముం దీర్తున్.

1064. అనుచున్ క్షణంబునన్ రా
ముని గప్పె బ్రచండ వేగమున దారుణ మా
ర్గణ పంక్తు లేసి, రాముడు
తునిమె నభం బంద వాటి దున్కలు గాగన్.

1065. దనుజుని శరంబులం ద్రుం
చును రాముడు, రాము డేయ జొచ్చిన ద్రుంచున్
దనుజుండు, బరస్పర మ
ట్లని సేసిరి వార లిర్వు రధిక చలమునన్.

1066. దనుజుని వి ల్తునిసినచో
దునియును రాము విలుగూడ దోద్తోడనె, రా
ముని మేన గాయ మైనన్
దనుజుని మెయి రెండగును క్షతంబులు దోడ్తోన్.

1067. కరలాఘవ ప్రదర్శన
బరగింతురౌ వీ రనంగ బవరంబున్ సే
సిరి వా రిర్వురు దివి న
చ్చెరువున నమరర్షి తతులు చేరి కనంగన్.

1068. క్రీడా కల్పంబుగ నే
ట్లాడుట మాని రఘునాథు డంత మహాక్రో
ధాడంబరమున నురమున్
గాడి విరథు జేసె నొక్క క్షణమున దైత్యున్.

1069. రథ రథ్య సారథులు ద్రుం
గ ధన్వమున్ దునిసి పోవ గ్రవ్యాదుడు వై
చె ధరిత్రికి డిగ్గి యశని
విధంబున న్శూలము రఘు వీరాగ్రణి పై.

1070. నాలుగు శితాశుగంబుల
శూలంబుం ద్రుంచి యగ్ని చోదితముగ నా
భీలాస్త్ర మేసె రాముడు
గూలె నసుర భస్మరాశి కుంభిని మీదన్.

1071. ఖరరాక్షస నందనుడు మ
కరాక్షు డట్లుర్వి గూల గల్గె సురలకున్
బరమానందము దైత్యుల్
పరువిడి రవిరత శర ప్రపాతాహతులై.

ఇంద్రజిత్తు మఱల యుద్ధమున కరుగుట

1072. మకరాక్షుడు గూడ రఘు
ప్రకాండ కాండాహతి న్బరమపద సంప్రా
ప్తికలితు డయ్యె నటంచు ద
శకంధరుడు క్రోధ భయ విషాద పరుం డై.

1073. పటపట పండ్లు కొఱికి యు
ద్భట విక్రము మేఘనాదు బనిచెన్ నిజ సం
కటముం దీర్పగ వానర
పటలిం దాశరథి తోడ వధియించుటకున్.

1074. దైవత నాథు గెలిచిన మ
హావీరుండవు జయించు టరుదె కుమారా!
నీ వా వానర నర సై
న్యావళి కొన్ను మ్మ విజయ మ్మనన్యాదృశమున్.

1075. మాయ ప్రదర్శించుటొ, భవ
దీయ భుజ పరాక్రమంబు దెల్లంబుగ నా
దాయలతో బోరుటయో
సేయుము రాము న్జయించి చెచ్చెర రమ్మా!

1076. అన నింద్రజిత్తు సంతస
మున దండ్రికి మ్రొక్కి యాగభూమి నియమముల్
దనర నభిచార హోమం
బొనర్చి తన్పె సుర రాక్ష సౌఘము భక్తిన్.

1077. తురగ చతుష్టయ సజ్జిత
మరదంబు ధను శ్శరాది మహితాయుధ సం
భరితం బై నిల్చె నెదుట
బరితృప్త జ్వలన దైవ వర దత్తంబై.

1078. పరిమార్తు నిప్డ సంగర
ధరిత్రి గపట యతి వేషధారుల నా దా
శరథుల గపి మూకలతో
సురశత్రు ప్రీతిగ ననుచు బ్రలాపమునన్.

1079. అరద మధిరోహణము సే
సి రావణ సుతుడు దివి కెగసి యదృశ్యుం డై
కురియించె బాణ వర్ష మ
విరతంబుగ వానరాళి విభ్రమ మందన్.

1080. అసితాభ్ర చ్ఛన్న విహా
యసంబునం గానరాని యర్కుడు వోలెన్
మసలుచు నా రావణి తీ
క్ష్ణ సాయకము లేసె రామసౌమిత్రులపై.

1081. అవిదితముగ వచ్చి పడు శ
రవితతి నోర్చికొని దాశరథు లుద్భటు లై
యవిరళముగ నేసిరి దను
జ వధార్థం బ్రబపుం దెస శితశరంబుల్.

1082. అమరపథంబున ద ద్బా
ణములం దప్పించు కొంచు నలిరేగి శరౌ
ఘము లేసె రావణి యమ
ర్షమునం గపి సైన్య నిర్హరణ కృత బుద్ధిన్.

1083. అమరారి పుత్ర శరహా
తముల న్నొచ్చి తెగిపడిరి ధాత్రి నసంఖ్యా
కముగా వానర వీరులు
సమర స్థలి బ్రతి నొనర్ప జాల కవశులై.

1084. ధను వెక్కు- వెట్టి లక్ష్మణు
దనె నన్నకు గ్రోధ రంజి తాస్యుం డై యీ
దనుజుం దధర్మ యుద్ధం
బొనరించెడు గాన రాక యోర్వ దగ దికన్.

1085. దనుజాన్వయంబు నెల్లన్
క్షణమున భస్మంబు సేతు గమలభవాస్త్రం
బున యుద్ధంబు బరిసమా
ప్తి నంది లోకమ్ము లసుర పీడం బాయున్.

1086. అన లక్ష్మణునకు రాఘవు
డనె, దమ్ముడ యొక్కని కయి యసు రాన్వయ మె
ల్లను గూల్చుట బోలునె యో
జన సేయుద మొందు వెరవు శత్రుం గూల్పన్.

1087. అనుచున్ రాముడు మది యో
చన సేసి ధనువున నారి సారించి శరం
బును గొన ద దుద్యమ మెఱిగి
దనుజుడు పాఱె బురికి భయ తప్తాత్ముండై.

1088. పురి కేగి మేఘనాదుడు
తరుచరులన్ మోసగింప దంత్రంబును బ
న్ని రయమ్మున జనె మాయా
ధరణిజ నరదమ్మున గొని తత ఖడ్గముతో.

1089. శిలలున్ దరత భూమిరుహం
బులు గరముల బూని యుద్ధమునకున్ సన్న
ద్ధులు గా నిల్చిన కపిసే
నలు రిచ్చవడి రరదంబునన్ గాంత గనన్.

1090. సేనాగ్ర యాయియై హను
మానుడు కాంచెన్ రథమున మలినాంబరయున్
ధ్యానపరాయణ తాప
మ్లానాబ్జానన గృశాంగి మానిని నొకతెన్.

1091. ఒకచేత కేశ పాశం
బకరుణతన్ బట్టి రావణాత్మజుడు చెలం
గి కశా ప్రహార మొనరిం
చి కడున్ బాధించు చుండ జిత్తం బగలన్.

1092. హా రామ! రామ! యని దీ
నా రావమ్మున నడలుచు నశ్రు జలంబుల్
ధారగ గురియుచు నుండన్
మారుతి గనె గాంత రావణసుతు రథమునన్.

1093. తా మున్నశోక వనికా
భూమిరుహ చ్ఛాయ గన్న భూసుత బోలెన్
సామీరికి గనవచ్చి, వ్య
థామిళిత స్వరుడగుచు నతం డిట్లనియెన్.

1094. ఓరీ రావణపుత్రక!
శ్రీరాముని పత్ని నిట్లు సేతువురా? సా
ధ్వీరత్న మీమె యే మప
కారం బొనరించె నీకు గతినస్వాంతా!

1095. విమల బ్రహ్మ ర్ష్యన్వయ
సముద్భవుడ వయ్యు రాక్షస ప్రమదా గ
ర్భమునం బొడముట దుష్కా
ర్యము లొనరింతువు వివేక రాహిత్యమునన్.

1096. పతి ననువర్తించుట కై
వెతలం బడబూని వచ్చె భీకర వని కా
సతి నెడ బాపె బతికి ద్వ
త్పితరుండు హరించు చుంటి వీ విటు లసురుల్.

1097. ఇట్టి యధర్మము సేసియు
నెట్టులు జీవింప నేర్తు వింక దురాత్మా!
మిట్టిపడకు పాదములన్
మట్టించి వధింతు నీక్షణమ ని న్నిచటన్.

1098. అన మేఘనాదు డి ట్లనె
హనుమ! వదరబోకు మీర లవలోకింపన్
జనకజ వధింతు నిప్పుడు
తునిమెద నవ్వల రవిసుతు తోడం గపులన్.

1099. ఏ సతి గాపాడుకొనగ
నీ సురశాత్రవు పురిపయి నెత్తిరొ హనుమా!
యా సతియె వధింపం బడ
నాస లుడిగి రూపుసెడరె! యా దాశరథుల్.

1100. అనుచున్ గుత్తుక ఖండిం
చె నొక్క వ్రేటున శితాసి సీతా తరుణిన్
దనుజేంద్ర సుతుడు హాహా
ధ్వాను లెగసె నభమ్ము దాక వానర సేనన్.

1101. హనుమంతుఁ క్రోధ మూర్ఛిత
మనంబునం దాకె జేత క్ష్మాధర శిఖరం
బును బూని వానర భటు ల
వనీరుహమ్ముల ధరించి పర్వి రసురుపై.

1102. కనులం గెంపులు రాల్చుచు
దనుజపతి సుతుండు కూల్చె దరుచర భటులన్
సునిశిత సాయక తతి, స్యం
దనంబు చిత్ర గతుల రణ ధాత్రిం బర్వన్.

1103. ఆ లీలన్ దోర్విక్రమ
లీల మెఱయ గా గపిపటలిన్ జెండి జయా
వాలము నికుంభిలా దే
వ్యాలయమున కేగె రావణాత్మజుడు వడిన్

1104. మరణించె రాము పత్ని స
మర స్థలి న్వీడిపోయె మదమత్తుం డా
శరనాథనందనుడు సం
గరమ్మున బ్రయోజనంబు గలదే యింకన్?

1105. ఎఱిగింతు రామునకు సం
హరించె ధరణీజ రావణాత్మజు డంచున్
బరమోపాయవిదు డనం
తర కార్యము నిర్ణయించు దద్దేవు డొగిన్.

1106. అనుచుం దలంచి శ్రీరా
ముని సన్నిధి కేగి తెల్పె ముష్కర దైత్యుం
డొనరించిన దుష్కార్యము
హనుమానుడు దుర్భర వ్యథాకులి తాత్మన్.

1107. సీత వధింపం బడె నని
వాతసుతుడు తెల్ప నవని బడె నాక్షణమే
వీత స్పృహుడై రాముడు
శాతాసిక్షతము భూమిజంబుం బోలెన్.

1108. పరిచర్య లొనర్పగ దే
రి రాఘవుండు విలపించె బృధ్వీసుత కై
మఱిమఱి సుమిత్ర కొడు క
ప్పురుషోత్తము గౌగిలించి పొందుగ బలికెన్.

1109. నిరతమ్ము ధర్మ రక్షణ
పరాయణత్వమున బరగు వాడవు నీకి
పరమ వ్యథావహం బై
ధరాసుతా మరణ మెట్లధర్మం బొదవెన్.

1110. అన్నా! ధర్మాధర్మము
లన్నవి కన్నులకు గాన నయ్యెడు నవి కా
వెన్నగ స్థావర జంగమ
సన్నద్ధం బీ జగంబు చందం బమరన్.

1111. ధర్మమె సేయుచు నిచ్చలు
నిర్మల వృత్తి బచరించు నీ విటు లుండన్
దుర్మదు డా దశకంఠు డ
ధర్మమె సేయుచు నెసగడె తతసౌఖ్యములన్.

1112. అరయంగ ధర్మ హీను ల
విరళానం దానుభూతి వెలయుటయున్ ధ
ర్మరతులు దుఃఖితు లౌటయు
నెఱుంగ బడ కున్నదె సత మీ లోకమునన్.

1113. జగమున ధర్మమె కలదే
ని గుణశ్రేష్ఠుడవు ధర్మనిరతుండవు నీ
కగ పా టిట్లొదవునె! బా
ర్య గోలుపోవుదె! యధర్మి యసుర కృతమునన్.

1114. ఇది ధర్మ లక్షణం బని
విదితంబుగ జేర్కొన దగు వెర వెద్దియు దో
పదు జగమున ధర్మం బ
న్నది లేదని తోచు నా మనంబున కెన్నన్.

1115. తలపగ ధర్మం బన్నది
బలహీన మశక్త మద్ది వర్ధిల్లున్ ని
స్తుల పురుషకారమున గే
వల ధర్మపరత్వ మద్ది వ్యర్థంబు సుమీ!

1116. విలస త్సుఖ భోగంబుల
కలిమికి మూలంబు పురుషకారమె సుఖ కా
ములు ధర్మాధర్మము ల
వ్వల ద్రోయుచు నాశ్రయింప వలె బౌరుషమున్.

1117. మనుజుడు ధర్మాధర్మము
ల ననుష్ఠింప వలె విజయలాభంబున దృ
ష్టి నిడుచు గాలోచితముగ
ననయము ధర్మం బధర్మ మం చన కుండన్.

1118. మనుజుండు గార్యసాధన
మొనర్చ జూచు నెడ ధర్మ మొక్కండె ప్రయో
జనకారి కాదు కార్య
మ్మును సాధించుట యధర్మమున నేని తగున్.

1119. అమలిన సత్యం బే ధ
ర్మ మందు వట్టియెడ నీ కరగతం బౌ రా
జ్యము నేల వీడితివి ని
ర్మము౯ై జనకుండు బొంకు మా టాడిననున్.

1120. పితృవాక్పాలనమె జన
స్తుత ధర్మం బంచు సర్వ సుఖ దాయకమౌ
క్షితి రాజ్యంబున్ వీడితి
వి తండ్రి ధార్మిక పథంబు వీడిన నైనన్.

1121. క్షితి రాజ్యము నీకుం గర
గతమై లభియింప నుండగా వీడితి వ
ద్ది తొలగె నర్థము దానన్
వెతలం బడుచుంటి విట్లు వీ తార్థివి గాన్.

1122. ధనము గలవాడె రూపసి
గుణవంతుడు సర్వ శాస్త్ర కోవిదుడున్ ధం
డనపండితు డుత్తముడున్
ధనమున కీడగు గుణంబు ధరణిం గలదే.

1123. వినవె గుణమ్ములు సర్వ
మ్మును గాంచన మాశ్రయించు బూజ్యుం డెందుం
ధనికుండు, దృణప్రాయుడు
ధనహీనుడు సర్వ సుగుణ ధాముం డయ్యున్.

1124. ధనహీను డల్ప తేజు డ
తని యెల్లయు గార్యములు నిదాఘము నం ద
ల్ప నదీ జలంబులం బో
లె నెండు, వాడున్ స్వజన పరిత్యక్తు డగున్.

1125. అనయము ధర్మంబునకున్
ధనంబె మూలము క్రతువులు ధనమూలము లా
ధనమున్ ద్యజింప నె వ్విధ
మున జేకుఱు నీకు ధర్మము విచారింపన్.

1126. సకలార్థ హేతువు నృపా
లక పదమున్ వీడి వనములం జొచ్చితి వీ
వకట! మహాపద ప్రాణా
ధిక ప్రియాపహృతి నొదవె ధీరస్వాంతా!

127. నరశార్దూలమ! నిను నీ
వెఱుంగ కుంటివి ఘనభుజ! యిక లెమ్మ తురం
గ రథ గజ యుక్తు రావణు
దురంబునన్ గూల్చి వంత దొలగింతు నొగిన్.

1128. అని లక్ష్మణు డీ వ్విధమున
ననునయముగ నాడుచుండ నరుదెంచె విభీ
షణు డచ్చోటికి కమాత్యుల్
వెనుకొన దాశరథి కుశల విషయం బరయన్.

1129. ఇదియేమి? చెప్పు దొఱగెన్
వదనమ్ములు మీకు నెల్ల బలుకుడు కత మె
య్యదొ! యను విభీషణున కా
పదమూలము లక్ష్మణుండు పలికె దెలియగన్.

1130. విని కడు విస్మితుడు విభీ
షణుడనె, సౌమిత్రి! యిది యసత్యంబగు, రా
వణపుత్రు డేమి సీతం
దునుముట యేమి? యనగూడదు సుమీ నోటన్.

1131. ఎంతయు దుష్టుడు రావణు
డింతయు సత్యంబ, కాని యిప్పుడు సీతా
కాంతావధ సేయడు బ్రా
ణాంతక మగు నేని మోహి తాత్మం డగుటన్.

1132. మిము వంచించి నిరాటం
కముగా హోమంబు దీర్పగా నేగె జయా
ర్థము లక్ష్మణ! దుర్మదు డ
య్యమరారి సుతుడు నికుంభి లాలయమునకున్.

1133. రామా! కలంత చేరుము
హోమము నిర్విఘ్న మైన నోడం డా సు
త్రామజయుం డెవ్వరికిన్
సౌమిత్రిం బంపు మడ్డి నాశ మొనర్పన్.

1134. సులభం బగు దశకంఠున్
బొలియించుట నింద్రజిత్తు పొలిసిన రామా!
వలవదు విలంబనం బిం
క లెమ్ము పంపు మనుజన్ము గదనంబునకున్.

1135. ఎవడీ నికుంభిలా హో
మవిధిన్ భగ్నంబు సేసి మాన్చు నతండే
బవరమున గూల్చు నీ యిం
ద్రవిజయు నంచనె విధాత! త్వరపడవె ప్రభూ!

1136. అన లక్ష్మణు డుత్సాహము
గని రావణి తోడ బోర గరమున జాపం
బును బట్టి నిల్వ రాఘవు
డనుజన్మున కొసగె ముదల నాశీస్తతితో.

లక్ష్మణు డింద్రజిత్తును వధించుట

1137. అసురవిభుడు మార్గము సూ
ప సుమిత్రాతనయు డేగె బలవత్కపి వీ
ర సమూహముతో బవమా
న సుతాదుల సింహగర్జనల దిశ లద్రువన్.

1138. కపు లుత్సాహంబున భూ
రి పాద ఘట్టనలు సేసి వృక్షంబుల భూ
మిపయిం బడ ద్రోసిరి జ
న్నపుభువి రువ్విరి బహు పృథు నగ శృంగములన్.

1139\. సవనగృహ రక్షకదళం
బు వీక నరుదెంచి చాప ముసల ప్రాసా
ది వివిధ సాధనముల బో
రి వానరగణంబు గూల్చిరి కడంక మెయిన్.

1140\. కపులున్ జెలరేగి నిశా
టపటలి జెండాడిరి సుదృఢ నఖంబుల భూ
రి పదాఘాతమ్ముల బా
ద పాళ్మ కులిశోపమ భుజ దండాహతులన్.

1141\. లెక్కకు మిక్కలి యగుచున్
రక్కసి గము లీల్గె నా దురంబందున న
ల్దిక్కులకున్ బర్వు లిడిరి
పెక్కురు, రావణి మనంబు వికలం బయ్యేన్.

1142\. సవనము భగ్నము గా దా
నవనాథసుతుండు రక్తనయనుం డై లే
చి వెడలె గపిసేన బరా
భవింప బాణాసనంబు బాణిం గొనుచున్.

1143\. సవనగృహంబు న్వెల్వడి
వివిధాయుధసజ్జితంబు విమలాభరణ
ప్రవిభూషితంబు మారుత
జవంబు రథ మెక్కి వైరి సంహరణేచ్ఛన్.

1144. చనె నింద్రజిత్తు విటప
మ్మునకున్ రిపు విజయ హేతు భూతబలి నొసం
గ నెదిర్చె నచ్చట విభీ
షణయుతు డై లక్ష్మణుండు జ్యాఘోషముతో.

1145. నిలునిలు నా యెదుట రణ
స్థలమున మాయారణంబు సల్పక నిన్నున్
బొలియింతు నిప్పు పలలా!
జ్వాల నోగ్రా స్మత్పటు శరజాలంబులచే.

1146. అనుచున్ ధనువెత్తిన ల
క్ష్మణున కనియె నింద్రజిత్తు కనలున మొన్నా
న్నునె కద చూపితి మఱచితె
యనుపమ మస్మ త్పరాక్ర మాటోపంబున్.

1147. బావునకుం దప్పితి వపు
డా వైనం బేల? యిప్పు డసదృశ లీలన్
జీవము హరించి మ త్పితృ
దైవతమున కిత్తు గాన్క ద్వ న్మ స్తకమున్.

1148. పిమ్మట రాముడు నీ మొం
దెమ్మును గని యేడ్చియేడ్చి నిర్జీవు డగున్
నెమ్మది జానకి తోడ సు
ఖమ్ము ల్గను నా జనకుడు కలకాలంబున్.

1149. అనుచున్ విభీషణుం గని
దనుజాధిపపుత్రుడు వికృత పరిహాసం
బొనరించి యి ట్లనియె ల
క్ష్మణు దెచ్చితి విన్నె! నన్ను మడియించుటకున్.

1150. నాకుం బితృవ్యు డౌదువు
నీ కేను సుతుండ నౌ దు నిర్లజ్జుడవై
నా కపకారము సేయగ
యీ కాని తెఱంగు బట్టితె యధర్మముగన్.

1151. జననము లంకానగరం
బున నందితి వీవు దుష్టబుద్ధిన్ ద్రోహం
బొనరింప జూతు నాకు స్వ
జనాభిమానంబు వీడి స్వార్థోపేతా!

1152. జాతియు నీతియు బూజ్యము
భ్రాతృప్రేమయును లేదు పట్టదు బంధు
ప్రీతియును ధర్మదూరుడ
వైతివి దుర్మతి! తలంప వన్వయ మహిమన్.

1153. స్వజనాశ్రయంబు వీడి ప
ర జనాశ్రయము మమతానురాగమ్ము లెదన్
ద్యజియించి చేరితివి నీ
చ జనుం బోలె మది నయవిచక్షణ లేదే?

1154. గుణియైన విగుణియైన స్వ
జనాశ్రయమె సౌఖ్యదము యశస్కర మనగా
వినవె భయావహమౌ పర
జనాశ్రయము సర్వ సుగుణ శాలియె యైనన్.

1155. స్వజన త్యాగము సేసిన
కుజనుం గొని వాని చేత గూల్పింతురు త
త్స్వజనంబు భూమిపతు లం
త జంపుదురు వాని లోకధర్మం బదియే

1156. రణజయ హేతువు హోమం
బును నేనొనరించుచుండ ముష్కర బుద్ధిన్
బనిపూని తెచ్చితివి ల
క్ష్మణు దన్నాశంబున కిది కానిది నీకున్.

1157. అనినన్ విభీషణుం డి
ట్లనె నుద్యత్క్రోధరంజితాస్యమున బిత్రృ
వ్యు నెడల నిట్టి పరుషభా
షణంబు సేయ దగునె యవిచారితమతివై ?

1158. దనుజాన్వయ జాతుడ నై
నను సత్త్వ గుణాశ్రయంబు నా శీలమెఱుం
గని వాద పోలె బల్కెదు
దనుజ సహజ ఘోర దుష్పథంబున బోవన్.

1159. పరుడు పరాత్పరు డగు  రఘు
వరు భార్యాపహరణంబు వంశ వినాశం
కరమగుట రాఘవునకున్
ధరణీజ నొసంగుట కడు ధర్మం బంటిన్.

1160. సోదరుడు ధర్మశీలుడు
నాదు హితమె కోరి పల్కె నయపథమంచున్
దా దలపక నిలు వెడలం
గా దోసె భవత్ప్రిత దశకంఠుడు ననున్.

1161. బాలక! ధర్మప్రచ్యుత
శీలుం దగు పూరుషున్ ద్యజించి సుఖంబుల్
వాలాయము జెందందగు
బోలగ గరబద్ధ సర్పము ద్యజించి నటుల్.

1162. పరవిత్తాపహరణమున్
బరజన దారాభిమర్శనంబును హింసా
పరతయు దుష్టాచారము
బరివర్జింప వలె జ్వలితభవనంబు నటుల్.

1163. పరభామినీ పరస్వా
హరణ సుహృత్శంక లన్న యవగుణముల్ మూ
డరయగ దుష్టము ల య్యవి
ధరిత్రి నెవ్వారి కయిన బతనకారణముల్.

1164. మునిజన ఘోరవధయు స
ర్వ నిలింపులతో గలహము వైరము గర్వం
బును బ్రతికూలతయు గ్రుధయు
నను నవి హరియించు జీవితైశ్వర్యములన్.

1165. ఈ యవగుణంబు లన్నియు
మా యన్న భవత్ప్రిత దశమస్తకు గ్రమ్మెన్
దోయదములు గిరి గ్రమ్మెడు
చాయ ద్యజించితిని ద త్కుజను నక్కతనన్.

1166. నరరూపదైవతము దా
శరథి యరిందముడు రామచంద్రు డతని తో
నెఱపితివి వైర ముండదు
పురంబు నీ వుండవు దశముఖు డుండ డికన్.

1167. పలుకు మి కే మేమి యనం
దలంచితివొ వింద దుష్టదనుజ! సుపర్వా
వళికిం దీర్తువు గార్య
మ్ము లింక రామానుజు శరముల యమపురిలో.

1168. ఏమేమి శరము లున్నవొ!
సౌమిత్రి పయిన్ వ్యయంబు సల్పుము తులువా!
భూమిన్ గాలము సెల్లుట
నోమం గలవాడు తే దహో! ని న్నాజిన్.

1169. అనిన మహాక్రోధమునన్
దనుజేశ్వరనందనుండు ధనువున్ సారిం
చి నిశాత బాణ వర్షం
బును గురిసె విభీషణు పయి మొయిలు తెఱగునన్.

1170. కనలి సుమిత్రాతనయుం
డనిలజు భుజపీఠి నెక్కి యరుదెంచి విభీ
షణునకు దోడై యంబర
మున ఖండించె సురవైరిపుత్రు శరములన్.

1171. తలపడె లక్ష్మణు తోడన్
బలలుడు, భీషణముగ గదనము సేసిరి వా
రలు సైన్యము లబ్బురమున
దిలకింప బరస్పరము వధించెడు పూన్కిన్.

1172. పరమాద్భుతరణకర్ముడు
పఱపెన్ సౌమిత్రి బాణపంక్తులు రాత్రిం
చరపతి సుతుపై హాత భు
గ్నాక దత్త తనుత్ర మద్ది పలు తున్కలుగాన్.

1173. చలము మెఱసి రావణియున్
బలితంపు శరంబు లేసె వందలు వేల్గా
నలయక లక్ష్మణు వక్ష
స్థలమున జించె నవి వాని తను వర్మంబున్.

1174. ఇరువురు దీవ్ర శరంబుల్
పరగింప దను క్షతస్రవ ద్రుధిరంబుల్
బఱచె రణాంగణమున నిశి
చరపతి సుతు వి ల్లునిమె వెసన్ లక్ష్మణుడున్.

1175. మఱియొక వి ల్లెత్తెడు నం
త రాఘవానుజుడు దున్మె దానిం గూడన్
గరలాఘవంబు మెయి నా
శరుండు విలు జేత బూన జాలం డయ్యెన్.

1176. వదనము వివర్ణ మై చూ
చు దాశకంఠిం గని యిదె సూ తఱి యీ దు
ర్మదు గూల్ప నంచు దగ్గఱి
ముదంబున విభీషణుండు పూని వచింపన్.

1177. అతి తీక్ష్ణాగ్ర శిలీముఖ
చతుష్టయము వింట గూర్చి సౌమిత్రి రయో
ద్ధతి నేసి కూల్చె హయముల
జతురత వే ఱొకట దున్మె సారథి శిరమున్.

1178. విరథుం డై దరకుం డిగి
హరిసైన్యమ్ము నుఱుమాడ నసురదళంబున్.
బురికొల్పి మఱలి వచ్చెం
బురికిం జని తా రథమున బూర్ణాయుధు డై.

1179. అరదము జిత్ర విచిత్రము
గ రణస్థలి ద్రిప్పుచు దశకంఠాత్మజు డు
ద్ధురుడై కపిసైన్యంబున్
బరిమార్ప దొడంగె బాణ వర్షము చేతన్.

1180. ఆ మెయి రావణి కీశ
స్తోమంబున్ గూల్చుట గని దుర్వార రయో
ద్దాము డగుచు దాకెన్ దా
సౌమిత్రి విభీషణుండు సంతస మందన్.

1181. బవరము సేసిరి పెద్ద త
డవు వా రిర్వురు గ్రహంబుల విధంబున నా
కవిభుండును వృత్రు డనగ
దివిజస్తోమంబు చకితదృష్టుల జూడన్.

1182. ఒకయెడ రావణి పై వే
ఱొకయెడ బలలాశి వీర యోధుల పై సా
యకముల్ వరగించుచు సమ
ర కర్మ మొనరించె దాశరథి యుగ్రుండై.

1183. ఒక చండాశుగమున దా
శకంఠి సారథి శిరంబు జయ్యన ద్రుంచెన్
బ్రకటా భీల పరాక్రమ
వికాసమున లక్ష్మణుండు భీషణ వృత్తిన్.

1184. సారథి పడినన్ దనకుం
దా రథముం గడపు కొనుచు దనుజుడు గపి సం
హారం బొనరింప గడగె
వీరరసోద్రేకి యగుచు భీప్రద వృత్తిన్.

1185. ఎదిరించె విభీషణు డం
త దాశకంఠిన్ శరాసన జ్యా నాదం
బు దిశల ప్రోగ విరామం
బొదవుత సౌమిత్రి కన్న యోచన తోడన్.

1186. రావణ సుతుడు విభీషణు
పై వివిధశరంబు లేసె బటు వేగమునన్
గ్రావ స్థిరుడై తునుక
ల్గావించె విభీషణుండు లాఘవ మొప్పన్.

1187. శిత విశిఖ త్రయమున రా
ట్సుతు నొంచె విభీషణుండు సుత్రామ రిపుం
డతుల క్రోధంబున సుని
శిత వింశ ద్బాణ నిహతు జేసె బితృవ్యున్.

1188. అరుణాక్షుండై గద చే
దరించి రావణి రథంబు దాపునకుం బో
యి రయమున మోదె దశకం
ధరానుజుడు వారువములు నాల్గును నీల్గన్.

1189. దనుజుం డుద్యత్క్రోధం
బున రూక్షేక్షణుడగుచు సముద్ధుర వేగం
బున వైచె విభీషణు పై
గనదాభీలపృథుశక్తి ఘనరావమునన్.

1190. రయమున సౌమిత్రి పటుప
నయఃకృతశిలీముఖంబు లా పటుశక్తిన్
వియదధ్వంబున ఖండిం
చి యుర్వి బడ జేసె నింద్రజిత్తు కలంగన్.

1191. అమితాగ్రహవశుడై య
య్యమరారిసుతుండు వైచె యమ దత్తాస్త్రం
బు మహామహిమోపేతము
శమితారిజనౌఘ మశని సమ వేగంబున్.

1192. ఆయస్త్రమ్మునకుం బ్రతి
సేయ సుమిత్రాసుతుం డశేష మహిము డై
ధీయుతి గౌబేరాస్త్రం
బేయగ బోరాడి కూలె నిల నవి రెండున్.

1193. అనవద్యాస్త్రంబులు రెం
డును బడ రావణియు లక్ష్మణుండున్ వ్రీడా
వనత ముఖు లైరి, రక్తా
ననుడై సౌమిత్రి వారుణశరం బేసెన్.

1194. వితథం బొనర్చె దానిన్
దితి జేశ్వరనందనుండు దివ్యన్మహిమాఁ
బ్రతిహత రౌద్రాస్త్రంబున
దత రోష క్రోధ పూరిత స్వాంతుండై.

1195 లోక ప్రళయంకర తే
జోకలితాగ్నేయశర మసురపతి సుతు ద
స్తోకముగ నేయ శౌర్యర
సాకృతి లక్ష్మణు డడంచె సౌరాస్త్రమునన్.

1196. కన దుజ్జ్వలాస్త్ర పతన
మ్మున మేఘారవుడు క్రోధమూర్చితుడై యే
సె నిఖిల రిపు సంహారక
మనితర సాధ్య ప్రభావ మసురాస్త్రంబున్.

1197. గణనాతీతమ్ములు గా
జనించె న ద్దాన పట్టిస ప్రాస గదా
ధనురా ద్యు గ్రాయుధములు
వనౌకస ప్రాణ హరణ పటు తీక్ష్ణములై.

1198. సకలాస్త్ర రహస్య విదుం
డకుంఠిత పరాక్రముడు మహా ధీరుం డా
జికుమారుడు దాని నడచె
నకలంకం బగు మహేశ్వరాస్త్రము చేతన్.

1199. ఆ గతి దివ్యాస్త్రంబుల్
వీగంగా నింద్రజిత్తు వికటముగ మహా
నాగము భంగిన్ రోజుచు
వేగంబుగ గుఱిసె బాణవితతి బలియుడై.

1200. సౌమిత్రియు శక్రాశని
భీమ ప్రదర నిచయంబు విరియించెను వ
ర్షామేఘంబు గతి మహో
ద్దామంబుగ మండలీకృత శరాసమునన్.

1201. శరముల్ సంధానించుట
గుఱిచూచుట యేయుటయును గోలలు దృగ్గో
చరములు కావు త దాహవ
దరిత్రి సైన్యపతనంబు దక్క నిరుగడన్.

1202. అలయరు కదన పరిక్రాం
తులు గారు పరాఙ్ముఖులుగ దోపరు శరమా
తలకున్ బూచిన కింశుక
ముల తీరైనను వదలరు పో రిరువురునున్.

1203. ఆ తఱి లక్ష్మణు డొక్క మ
హాతీక్ష్ణ శరంబును గొని యైంద్రాస్త్రమునన్
బూత మ్మొనర్చి నిర్మల
చేతమ్మున బల్కె నిట్లు స్థిరప్రజ్ఞుండై.

1204. రాముడు సత్యవ్రతుడున్
రాముడు రిపు నిర్మథన పరాక్రమ యుతుడున్
రాముడు ధర్మియు నైనన్
ఈ మార్గణ మేగి త్రుంచు నింద్రజి శిరమున్.

1205. అని పల్కి లక్ష్మణుండు శ్ర
వణాంతముగ నారి దిగిచి బాణము విడువన్
మణికుండలదీప్తము రా
వణి మూర్ధము ద్రుంచె నది యవార్యం బగుచున్.

1206. జయనాదంబులు సేసిరి
వియచ్చరవరు లతిలోకవీరుడు శత్రుం
జయుడగు లక్ష్మణు పై దివి
జయోషలు గురిసి రలరులు సంతోషమునన్.

1207. తరుచరు లనివారితులై
తరువులు గొండ శిలలు గొని తాడింపన్ ది
క్కఱి వెక్కి రబ్ధి వడ గొం
దఱు పర్వెత్తి రచలంబు దాపున కసురుల్.

1208. హనుమ ద్విభీషణులు రా
ముని సన్నిధి కేగి మోదమున దెల్పిరి ల
క్ష్మణ కృత రావణ సుత సం
హననం బంజలి ఘటించె నన్న కనుజుడున్.

1209. పర వీర దురాసదు డసు
ర రాజ గర్వ ధ్వజంబు ప్రకట జగ ద్భీ
కరు డింద్రజిత్తు గూల్చియు
గరమున్ సిగ్గువడు దమ్ము గౌగిట గొనుచున్.

210. అభినందించె గడున్ రా
మభద్రు డిట్టు లనుజ! పరమ ప్రియ మొదవెన్
ఋభువులకు నాకు నిక స
ర్వభూతముల కీవు దైత్యరా ట్సుతు గూల్పన్.

211. సులభం బగు దశకంఠుం
బొలియించుట విక్రమింక భూమిసుత నా
కు లభించుట రాజ్యసుఖ
మ్ములు చేకూరుటయు సర్వము హితాచరణా!

212. అనుచున్ బహుభంగుల ద
మ్ముని గొనియాడుచు శిరంబు మూర్కొని మోదం
బున రాముడు మేను దడవి
వ్రణవైద్యము సేయ గోరె వనచర వైద్యున్.

213. త్వరపడి సుషేణు డత్తఱి
బరమౌషధి నొండు గొంచు వచ్చి సుమిత్రా
వరసుతు మై దాకింపన్
శర వ్రణవ్యథ తొలంగి స్వస్థుం డయ్యెన్.

1214. రణమున నసుర శరక్షత
తనులగు కపి భల్లుకులును దైత్యపతి విభీ
షణుడున్ విముక్తి నందిరి
వ్రణబాధ ద దౌషధ ప్రభావము చేతన్.

**ఇంద్రజిన్మరణమునకు రావణుడు విలపించుట**

1215. పుత్ర నిబర్హణమున్ సచి
వత్రయము వచింప దుఃఖ పారమ్యమునన్
రాత్రిచరనాథుడు పడె ధ
రిత్రీస్థలి వాయు నిహత వృక్షము పగిదిన్.

1216. కొడుకా! యంతటి దిట్టవు
వడి తెవ్విధి నల్ప వీర్య బల విక్రమ ద
ర్పుడు లక్ష్మణు చే నల ధ
ర్మడు బూజ్యుం డయ్యె నీ వరుగుట న్నాకున్.

1217. దేవతల కేని మఱి యో
ధావళి కేనియు నిదె తగు తరణోపాయం
బా వైవస్వతు జేరం
బోవగ నని సీల్గి నీకు బోలెం దనయా!

1218. సమరమున స్వామి హిత కా
ర్యము దీర్పగ నసువు లొడ్డు న ప్పురుషుడు స్వ
ర్గము సేరు జింతనొందను
కుమార! యిపు డీవు నట్లగుట జితశత్రా!

1219. సురలును దిక్పాలకులున్
బరమ పురుషు లింక నీవు వడుటన్ నిద్రిం
తురు స్వస్థచిత్తులున్ భయ
విరహితు లగుచు జగదేకవీర! తనూజా!

1220. అనయమ్ము దోచు గిరికా
నన సహితం బీ ధరిత్రి నల్గడ శూన్యం
బని మ న్నయ నా బ్జోస్మి
లన హేతువు నీవు లేమి లన దలఘు భుజా!

1221. గిరికందరంబు లందున్
గరేణు తతి వల్లభునకు గా నేడ్చెడు న
త్తెఱగున విందు ద్వ దంతః
పురాంగనాజనము లేద్వ బుత్రక! యింకన్.

1222. జనకుండు గాల ధర్మం
బున వడినం బ్రేతకర్మముం బూని సుతుం
డొనరించుట ధర్మము జగ
మున నది విపరీత మయ్యె బుత్ర! మనయెడన్.

1223. అనుచున్ బుత్ర మరణ దుః
ఖ నిపీడితుడై యసురజగత్పతి పెల్లే
డ్చి నిదాఘ కాల మధ్యం
దిన భాస్కరు బోలె గ్రోధదీప్తాంగుండై.

1224. నికట స్థిత రాక్షస వరు
లకిట్లనె బరమతపోబలంబున మెప్పిం
చి కమలజు చే బడసితి ది
వ్యకర ప్రభ వర్మ చాప నారాచములన్.

1225. ఎదిరింప లేరు నన్నున్
గదనమ్మున నెవ్వ రేని క్షణములలో గూ
ల్చెద దాశరథుల ధాతృ
ప్రదత్త దివ్య ధ్ధను శ్శరంబుల చేతన్.

రావణుడు సీతను వధింప నెంచుట

1226. అని ఓరము లాడియు ని
ట్లనె లంకానాథుడు బున రాలోచనముం
బొనరించి గపుల వంచిం
ప నాడు నా సుతుడు దున్మె మాయా సీతన్.

1227. నిక్కావ మొనర్తు నయ్యది
య క్కమలాక్షిం దునిమి ప్రియం బొదవుత నే
డిక్కరణి నాదు సుతునకు
రక్కసి పగకున్ ఫలంబు రాముం డొందున్.

1228. అనుచున్ శిత కరవాలం
బును జేత ధరించి సచివ ముఖ్యులు సతులున్
వెనుకొన నశోక వనికిన్
జనె దశకంఠుండు రౌద్ర సంరంభమునన్.

1229. అనయం బిడి వల దంచున్
దనుజ సచివు లెంత యొప్పిదంబుగ వారిం
చిన నైన రోహిణి పయిన్
జను నంగారకుని బోలె జనె రావణుడున్.

1230. కుపితోరగంబు నాగన్
విపులంబుగ రోజుచు నతిభీషణముగ వ
చ్చు పలలనాథుం జూచి వి
లపించె ధరణిజ గుండె లవియగ భీతిన్.

1231. పరమ క్రోధమున నిశా
చర రా జరుదెంచు చుండె జంపునొ యేమో
దురితాత్ముం డీతడు నా
థరహిత గా నెంచి నన్ను దామస వృత్తిన్.

1232. ఎఱ జూపి వేడె దన్నున్
వరింపు మని యెన్నొ గతుల బాతివ్రత్య
స్థిరతన్ దిరస్కరించితి
నిరాశ చే పీడు గోప నిష్ఠిత మతియై.

1233. పురుషోత్తము లగు నా దా
శరథుల వధియించె నేమొ జగ దుత్సవ క
ర్మరతులు వారల మృతి కి
ప్పరుసున గత మైన నాకు బ్రదు కేటి కికన్.

1234. కానిపోయెద భుజ పీఠం
బున బతి జేర్తు నని వాయుపుత్రుం డన నా
డు నిరాకరించితిన్ గుమ
తినై లభించె ఫల మీగతి న్నా కకటా!

1235. పుత్ర వినాశన దుఃఖం
బీ త్రిదశరిపువిభు డోర్వకిట్టులు నన్నున్
జిత్రవధ సేయగ జ్వల
న్నేత్రుం డై వచ్చు భూరి నిస్త్రింశముతో.

1236. పతి చెంత లేని యెడ నా
హతయై యంగారక గ్రహముచే గడు బీ
డిత యా రోహిణి నా భూ
సుత యా గతి నేడ్వ జూచి స్రుక్కెడు మదితోన్.

1237. శుచియున్ మేధావియు నగు
సచివుండు సుపార్శ్వ డనె దశగ్రీవున కి
ట్లుచితానుచితమ్ములు ధ
ర్మ చింతనము వీడి యాసురం బగు వృత్తిన్.

1238. పాతక మేటి కొనర్చెద
వీ తరుణిం జంపి వేద విద్యావ్రత సు
స్నాతుండవు వైశ్రవణ
భ్రాతవు నిత్య స్వకర్మ రతుడ వరయగన్.

1239. చూపింపం జెల్లు భవ
త్కోపము రాము పయి మమ్ము గూడి రణమునం
దాపగ వానిం గూలిచి
చేపట్టుము వైభవమున సీతా కాంతన్.

రావణుడు సైన్యమును యుద్ధమున కంపుట

1240. సచివుడు సుపార్శ్వు డీ గతి
వచింప విని మఱలి నిజ సభా భవనమునన్
రుచిరాసనం బధిష్ఠిం
చి చెప్పె రావణుడు క్రుద్ధ సింహంబు గతిన్.

1241. నిశ్వాసంబులు వుచ్చుచు
నశ్వ స్యందన భట ద్విపానీకంబున్
శశ్వద్గతి గొంచు శర ప
రశ్వథ కరవాల తోమర ముఖాయుధు లై.

1242. చని ముట్టడించి పొదువుడు
రణ మత్యుగ్రత సలుపుడు రాముని తోడన్
ఘన ప్రావృణ్మేఘ విధం
బనమున గుఱియుడు శరములు వర్షంబు గతిన్.

1243. చాలిన రాముం జంపుడు
చాలని చో నేను వచ్చి చంపెద నా దు
శ్శీలు బహుళాస్మదీయా
భీల శరంబుల దివిజులు విభ్రమ మందన్.

1244. అని యాన తిచ్చిన శిరః
ప్రణామము ల్సేసి సైన్యపతు లేగిరి భీ
షణముగ ముప్వ రమాత్యుల్.
ఘనవీరులు వెంబడింప గర్వోక్తులతో.

1245. ప్రళయ ప్రభంజనమ్మన్
దలపించుచు నేగు దైత్యతతి కెదు రయ్యెన్
వలముఖ సైన్య సమూహ మ
చలస్థిరం బగుచు సర్వ సంసిద్ధం బై

1246. తలపడి పోరిరి పలులు
వలీముఖుల తోడ నాహవం బయ్యెద వ
ర్తితె ఘోరంబుగ, హత గా
త్రుల తనువుల్ వేలి యాడె రుధిరపు టేర్లన్.

1147. బలవ త్కపి సందోహం
బులు రక్కసుల బిడికిళ్ల బొడిచియు, వాల
మ్ముల గొట్టియు, దీర్ఘ నఖ
మ్ముల గ్రుచ్చియు, పాదఘాతముల ద్రొక్కియునున్.

1248. శిలలన్ వైచి శిరములు బ
గులగొట్టియు వారణముల కుంభము లర చే
తులతో బగిల్చియున్, హయ
ముల దరువుల నడచియున్ గపులు ద్రుంపంగన్.

1249. గిరి సదృశ దేహు లసురులు
పరశ్వథ ప్రాస శూల బాణ గదా ము
ద్గర తోమ రాదులన్ భీ
కర సంగ్రామం బొనర్చి కపులం ద్రుంపన్.

1250. తరుచరు లద్దను జోద్ధతి
భరింప లేమి నవశులయి పర్విడి రామున్
శరణంబు వేడ ధనువున్
గరంబునం బూని జ్యా నినాదము పర్వన్.

యుద్ధమున రాముని వీరవిహారము

1251. పలలాశన సైన్యాంత
స్థలి జొచ్చె రఘూద్వహుండు జయ్యైన నభ్ర
స్థలి జొచ్చు భాస్కరుండున్
బలె క్రోధోద్దీపితాక్షి వహ్న్యుగ్రుండై.

1252. కుపితసెన్ రాఘవు డంభో
ధర రమ్య వినీల తనుడు దా ప్రళయాంభో
ధరతుల్యు డై శరపరం
పర దైత్యుల పై ప్రవృద్ధ మన్యు వశుండై.

1253. అని మొన వీర విహారం
బొనర్చు రాము డసురాళి కొక్కపు దొక్కం
డని తోచి, యుత్తరక్షణ
మున దోచె సహస్రరూపముల నుగ్రుండై.

1254. నరుడా యముండో శక్రుం
డా రుద్రుడొ యెఱుగ బడక, భయోత్పాతమునన్
సురరిపులు బడల్పడ దా
శరథి కనిమసంగె హయ గజ రథ భటాళిన్.

1255. అడుగో స్యందనమున్ జ
క్కాడంచె, నిడుగొ యిట దంతిఘటలన్ సమయిం
చెడు, వీడె వాజులం గూ
ల్చెడు రాఘవు డం చసురులు చిత్త భ్రమతో.

1256. ఇదిగో రాముని మూర్ధం
బు దున్మితిన్ రాము వక్షముం జీల్చితి, నే
నిదె ఖండించితి రాఘవు
పదద్వయం బని, పలాశిభటు లున్మదులై.

1257. కరవాలంబున ద్రుంచిరి
శిరంబు శితసాయకముల జీల్చి రురంబున్
నఱికిరి పాదంబుల ము
ద్గరాయుధంబున స్వపక్ష దానవ భటులన్.

1258. పలలులు దరియం జాలరు
జ్వలి తార్చిష్మ త్సమోగ్ర సాయక దగ్ధాం
గుల జేయు రాము జలద
మ్ములు గ్రీష్మాదిత్యు జేర మొనయని భంగిన్.

1259. కనిపింప లేదు రాముడు
దనుజాళికి భూరి గహన తరుజాల ధ్వం
సన దక్ష మహావాతం
బును బలె భటకాండ పాత మొక్కఁడు దక్కన్.

1260. కనిపింప లేదు రాముడు
దనుజులకు శర వ్రణ వ్యథా మూలము జీ
వున కింద్రియానుభవ కా
రణుండు స్వాత్మ స్థితుడు పరాత్పరు బోలెన్.

1261. కనిపింప లేదు రాముడు
దనుజాళికి మండలీకృత స్వర్ణ శరా
సన దీవ్య దగ్ర భాగమె
కనుపట్టె నలాత చక్ర కాంత్యు జ్జ్వలమై.

1262. దివ సాష్టమ భాగ సమ
వ్యవధిన్ వధియించె దశరథాత్మజుడు భట
ప్రవరోత్తమ రథిక గజ హ
య వరూథినులన్ శతాధి కానీకినులన్.

1263. హతశేషులు పాఱిరి పురి
కతివేగంబుగ ని హత హయ ద్విరద భట
ప్రతతిన్ జూపట్టె రణో
ర్వి తెలుగు సంక్రుద్ధ రుద్ర క్రీడా స్థలినాన్.

1264. సుర గంధర్వులు సిద్ధులు
పరమర్షులు సాధు సాధు వాదమ్ము లొన
ర్చిరి భావించిరి రామకృ
త రావణ పరాభవం బుదంచ త్ప్రీతిన్.

1265. శితికంఠ దేవు డిట్టి మ
హితాస్త్రముల్గల్గి యుండఁ నే గల్గుదు నిం
కితరాలభ్యములంచున్
స్మితముఖు డై రాఘవుడు వచించె హనుమకున్.

### రావణుఁడు యుద్ధమున కేగుట

1266. హతశేష లేగి పురమున
సతి జనంబులకుఁ రామచంద్రుని సమరో
ద్ధతియు న్నిశ్శేష రాక్షస
మృతియున్ దెల్పి విలపించి రీగతి వారల్.

1267. పతి మిత్తింబడె గూలెన్
సుతుందు మృతులైరి నాదు సోదరులున్ బం
ధుతతియు జెడె దిక్కెల్లయు
జతు కిం కెట్లొకొ యటంచు బల్ దుఃఖమునన్.

1268. అకటా! మన యీ కష్టము
నకున్ గతము శూర్పణఖయె, నా డా ముడివ
న్గ, కరాళ నేత్ర ముఖి, జా
నకిపై జనకున్న గల్గునా యిట్టి వెతల్?

1269. నవ జలద శ్యామ తనుం
డు విశ్వమోహనుడు రాముడు గురూపి వికా
ర వికట నా సోదరి య
య్యవినయ కామించు టెట్టు లా రామవిభున్.

1270. ఖర దూషణ త్రిశిర సం
హరణమ్మున్ గాంచి వలచె నా సుందరు నా
జలధి, దశాస్యుం డా ము
ష్కరకై పగబూనె రామచంద్ర విభుని పై.

271. మరణంబు కోరి సీతన్
హరించె రావణుడు కపట యతి వేషమునన్
బరమ పతివ్రత జానకి
వరింపదు దశాస్యు కెంత ప్రాల్మాలిననున్.

272. మైథిలి దుర్మతి గోరి వి
రాధుండు నశించిపోయె రామునిచే, దై
త్యాధములు ఖరాదులు నా
యోధనమున వడిరి రాము నుగ్ర శర హతిన్.

273. కోపమ్మున బిట్టలచుచు
నాపై యోజన సుదీర్ఘ హస్త ద్వయమున్
జాపి మృగతతిన్ సాపడు
నా పలలు దడగె గబంధు డా రామునిచే.

1274. అమిత పరాక్రము డౌ న
య్యమరేంద్ర తనూజు దున్మ నలు గొక్కుట, రా
జ్య మొసంగె గానన పరి
భ్రమణం బొనరించు భాస్కర తనూజునకున్.

1275. ఇవి చాలవె యా జగదే
కవీరు తత్త్వం బెఱుంగ, గమలోద్భవ ద
త్త వర కలుషాత్మకుడు దై
త్య విభుం డెఱుగ దఖిల భువ నావను రామున్.

1276. తెలిసి విభీషణు డింతయు
దెలిపె సమగ్రముగ వినడు దివిజద్విషుడీ
పలలాశనపతి, దురవ
స్థలకుం బా లైతిమి మన దౌర్భాగ్యమునన్.

1277. అతికాయాదులు కూలిరి
హితంకరుం డింద్రజిత్తు నీల్గె మహా శై
లతనుడు ఘటశ్రవుడు స్వ
ర్గతు డేరిం జూచి యేగు రావణు డనికిన్.

1278. మనకీ కష్టంబులు తీ
రనివై సమకూడె, రామ రావణ యుద్ధం
బున జత్తు రెల్లరు, విభీ
షణు డొక్కడు సేరె బుణ్య జన గమ్యంబున్.

1279. కమలభవ దత్త వర గ
ర్వమునన్ రావణుడు లోక బాధ యొనర్పన్
బ్రమథపతి సెప్పె దన్నా
శము సేయ న్వచ్చు నొక్క సతి యిట కనుచున్.

1280. ఆ సతి జానకి యే యగు
నీ సురరిపు వంశ నాశ మిక దప్పదు స
ర్వాసుర నాథులకుం గా
దీ సంక్షోభ ముడిగింప నెవ్విధి నైనన్.

1281. పుర తరుణీమణు లీగతి
బరమ భయోచ్చైస్స్వరముల బలవించిరి ధై
ర్యరహిత లై యాశ లుడిగి
పరస్ప రాశ్లిష్టు లూర్ధ్వ బాహువు లగుచున్.

1282. వనితా జనముల యాక్రం
దనంబు లాలించి దశవదను డుద్యత్క్రో
ధ నితాంత దంత పీడన
కన న్నయన వహ్ని మాలికా భీకరుడై.

1283. హతశేషు లైన రక్షః
ప్రతతిన్ సమరంబు సేయ బంపంగ జమూ
పతుల కుదగ్ర ధ్వని నా
నతిచ్చి మఱల ననె నిర్గుణంబుగ నగుచున్.

1284. రథముం బూన్పుడు సత్త్వ జ
లధుతా నాల్గు తురగంబులన్ విధి దత్తా
క్షథ వర్మ కార్ముక పర
శ్వ థాసి తూణ ముఖ శస్త్ర సంపన్నముగన్.

1285. తిలకింపుడు నే డెట్టు ల
వలీల జ్వలితా గ్నితీవ్ర బహు నారాచ
మ్ముల బఱగించుచు నా క్రో
తుల మూకం జీల్చి చెండుదునా మీ రెల్లన్.

1286. శరద స్ఫు టార వాస్మ
చ్ఛరాసన జ్యా విముక్త సాయక తతు లు
ర్వర బర్వ బ్రకాశింపవు
సరి ద్ధరణిభృ ద్వియ ద్దిశా సాగరముల్.

1287. అనిల జ వోపేత స్యం
దన స్థి తాస్మ త్ప్రచండ ధను రభ్యు ద్భూ
త నభస్స్పృ క్కాండ ర్ముల
క్షణ మాత్రమున న్మథింతు గపి సైన్యంబున్.

1288. వ్యాకోశ పద్మముఖు ల
స్తోకాబ్జ పరాగ వర్చసులు కపులు బలో
ద్రేకులు తత్కపి యూథా
బ్జాకరముల దంతి బోలె ధ్వంస మొనర్తున్.

289. తరుచర యోధుల నొక్కొ
క్కరి గాగం ద్రుంతు నొక్కొక శరంబునకున్
బరిమార్తు వానరుల నూ
ర్వ్వేరేసి యసమాహవోద్ధురుడనై కనుడీ!

290. బలివెట్టుదు రణభూమికి
బ్రళ యార్కద్యుతి విభాసుర శరావళి చే
దల లుత్తరించి దాశర
థుల హనుమ న్మృక్ష నఖాయుధులతో గూడన్.

291. సుతులం బంధు జనంబుల
బతులం బాసి విలపించు వనితాతతి కి
గతి జేతః ప్రీతి యొన
ర్చి తర్పణం బిడుదు మృత నిశిచ రావళికిన్.

292. అనుచున్ బ్రచండ వేగం
బున జండ గభస్తి తేజమున నొప్పు రథం
బున జనె మహీతల విదా
రణం బొనర్ప జను నట్లు రావణు డనికిన్.

293. అసుర గృహంబుల్ శోధిం
చి సమీకరణం బొనర్చి సేనానులు మై
నుసురుల్ గల రాక్షస పురు
ష సమూహముతో నరిగిరి సంగరమునకున్.

1294. పలువిధముల నపశకునం
బులు దోచె మొఱసె సృగాలముల్ జలవాహం
బులు గురిసె నెత్తురులు, గ్ర
ద్ధలు కాకులు బెరసె మాసె దరణి ప్రభలున్.

1295. ధరణి చలించె దమం బా
వరించె దిగ్వితతి మొగ్గబడె బాదంబుల్
దురగతతి కవిరళముగ న
దక్షి వామ భుజ నయనములు దశకంఠునకున్.

1296. కాలంబు సమీపించుట
చే లంకా విభుడు లెక్క సేయం డవి, దు
శ్శీలత నాత్మ వధార్థము
దోలించెన్ స్యందనంబు దుర్దర్పుండై.

1297. ద్రుమ యోధులు నిల్చిరి సి
ద్ధముగా, నిరుదెగల వారు దరోజ్జ్వలులై
సమరం బొనర్చి రత్యు
గ్రముగ గడంకన్ బరస్పర వధా రతులై.

1298. రుధిర ప్రదిగ్ధ తనులై
నిధనమ్ముం జెందిరి రజనీచర భటు లా
ప్రధనమ్మున గపిభటు ల
త్యధిక బలోద్దాము లై విహారము సేయన్.

1299. కలఁకుం దనంపు టమ్ముల
పరంపరన్ ఁజలపి తోలె వానర ఋక్షో
త్కరమున్ దానవ విభు డ
ద్ధరంబులన్ దోలు చండ వాతూలము నాన్.

1300. అనిమొన క్రోధ జ్వలితో
గ్ర నేత్రు డై రావణుండు రథముం దోలిం
చిన యం దెల్ల గపులు వడి
రి నికృత్త కర చర ణోరు హృదయ గ్రీవుల్.

1301. వానర బలంబు సమర
క్షోణి స్వేడి చన దఱుముచుం జనె జాప
జ్యానాదము వెలయించుచు
దానవపతి గర్విత మతి దాశరథుల పై.

సుగ్రీవుడు మహోదరుం జంపుట

1302. కపి బలముల్ బాఱుట గని
తపనసుతుం డరుగు దెంచి తాకి యసుర సై
న్యపటలిఁ ద్రుంప గడగె బా
దపాహతి యుగాంత కాల దహనా కృతి యై.

1303. కరి ఖరి కొల్పుకొని మహో
దరు డడ్డం బై యెదిర్చి తరుచర నాథున్
శరసంహతు జేయ నలిగి
తరువున నేసె రవిజుండు దంతి శిరంబున్.

1304. పది యడుగులు వెన్కకు బా
టీ దంతి నేల బడె స్రవ దసృగ్ధారల, ది
గ్విదళన ఘీంకృతి సేయుచు
భిదుర క్షత భూరి ధరణీ భృ చ్ఛిఖరమొ నాన్.

1305. ధరణికి వడి డిగ్గి మహో
దరుండు వ్రేసె గపిరాజు దత ఖడ్గమునన్
హరిపతి నెత్తుట దోగియు
ద్వర మై లంఘించి కూల్చె దనుజు బిడికిటన్.

1306. తనకున్ గుడి భుజమై పో
ల్చినవాడు మహోదరుండు చేడ్పాటొందన్
గని రావణుడు విరూపా
క్షున కిట్లని చెప్పె మోము శోభ దొఱంగన్.

1307. ఓయి విరూపాక్ష! మన మ
హా యోధులు ద్రుంగి రెల్ల రరివీరులచే
నా యాశ లింక నీ పై
నే యున్నవి వైరులం జయింపగ బొమ్మా!

1308. అనిన దలయొగ్గి వందన
మొనర్చి యడరి కపి సైన్య యూధంబులపై
దనుజుండు గురిసె బెల్లుగ
గన దళని స మోగ్ర సాయక పరంపరలన్.

1309. తునిసిన కాళులు చేతులు
దునుకలు గా నైన పెద్ద తోకలు గడు ప్రీ
లిన పెను వక్షంబులు ద్రె
స్సిన ముక్కు జెవులు బగిలిన శిరముల తోడన్.

1310. కపులు భయంబున బాఱుచు
దపన తనూజు దరి చేర ధైర్యంబును గొ
ల్పి పలాశి నెదిర్చె నతం
డపార జవ సత్త్వ రూఢి నంతకు బోలెన్.

1311. భూధర శిఖరంబు న్గొని
పాదప చర నాథు డెత్తి పలలున్ వైవం
గా దీక్ష్ణ బాణ శకలిత
మై ధర బడ జేసె దాని నసురుడు లీలన్.

1312. శర లాఘవంబు మెఱయగ
నుఱుమాడె గపీంద్రు డేయ నుంకించిన త
త్తరు జాల మెల్ల దనుజుం
డరుసమ్మున దానవ భటు లార్చి చెలంగగన్.

1313. కనలి కపీంద్రుండు నభ
మ్మున కెగసి రథంబు పై దుముక బో రభస
మ్మున దానవుండు ఖడ్గ
మ్మును డాలుం గొని యెదిర్చె బోడిమి మీఱన్.

1314. ధరణికి డిగ్గి రయమ్మున
ధరణీసుతుండు నికట స్థితారాతి నిశా
చర హస్తంబున డాలున్
గరవాలంబు బెఱికికొని కవిసెన్ దనుజున్.

1315. ఇరువురు న త్యుద్ధతి బో
రి రంత సవ్యాపసవ్య రీతుల జక్ర
స్ఫురణన్ బరిభ్రమించుచు
నొరు నొరు గూల్పం దగియెడు నొద్దిక లొప్పన్.

1316. ఒకపరి విరూపనేత్రుం
డొకపరి గపిరాజు మీఱి రొండొరు దక్ష
ద్గ కదన చాతుర్యమునన్
బ్రకట భుజ బ లాసి చాలన విశేషములన్.

1317. ఒదుపున సుగ్రీవు నెదం
బొడువం బోయి గుఱితప్పి పొడిచె విరూపా
క్షుడు ద త్తరమున న వ్వా
ని డాలునం బల్మి తోడ నిస్త్రింశంబున్.

1318. కరవాల మూద బెరుకన్
దొరకొను నెడ జూచి దనుజు దున్మె వడి వడిన్
హరినాథు డొక్క వ్రేటున
సురుచిర మణి కుండల ప్రశోభిత శిరమున్.

1319. బలశాలియు దశముఖు నా
శల ప్రోవగు నా విరూప చక్షుడు ప్రాణ
మ్ములు వాయగ దీ నారవ
ము లొనర్చి రసురభటులు గపులు జెలరేగన్.

అంగదుడు మహాపార్శ్వుం జంపుట

1320. అంత మహాపార్శ్వ దదరి
దంతిం బురికొల్పు కొంచు దాకె గపుల ర
క్తాంత విలోచను డున్ దు
ర్దాంత భుజాదండ మండిత శరాసుడునై.

1321. పలల శర నికృత్తములై
వెలుచన్ రాలె గపిసైన్య వీరుల మూర్ధం
బులు గాలి తాకునన్ దొడి
మ లూడి నేలం దొఱగు సుమమ్ముల వోలెన్.

1322. రవి రశ్మి ప్రభ శత్రు దు
రవలోకంబైన పరిఘ నంగదు డేయన్
దివిజారి దంతి పై సో
లె విసంజ్ఞుం డై భయాకులితు లైరి భటుల్.

1323. క్షణమున లబ్ధ స్పృహుడై
దనుజుం డాభీలు డగుచు దత తీక్ష్ణ శర
వ్రణ బాధాకులితోర
స్కు నొనర్చెం జాంబవంతు గ్రోదోగ్రుండై.

1324. నొచ్చిన ఋక్షపతిం గని
చెచ్చెర నరుదెంచి వైచె క్షితిరుహములు శై
లోచ్చయములున్ గ్రుధా దీ
వ్యచ్చటులాక్షుడు గవాక్షు డంత దనుజుపై.

1325. అసురుం డుజ్జ్వల బాణ
ప్రసారముం జేసి వానర శరీరంబున్
గుసుమిత పలాశ వృక్షం
బు నవి మెఱయ జేసి యార్చె భూరి రవమునన్.

1326. ఆ మెయి రక్తస్రావితు
డై మెఱయు గవాక్షు జూచి యంగదు డల్కన్
వేమాఱు ద్రిప్పి భుజబల
ధాముడు వైచె బరిఘంబు దానవుని పయిన్.

1327. దనుజుం డూనిన బాణా
సనంబు పలు దున్క లయ్యె జయ్యన వాడున్
గనలున బరశ్వధంబున
వనాట యువరాజు నేయ బర్వె బలియుడై.

1328. దివి కెగసి యంగదు డలఘు
జవంబునం బైకి దూకి సత్త్వంబు మెయిన్
బవి సన్నిభ దృఢముష్టి బొ
డువ నెత్తు రుమిసి నరాదుడు వడె ధరిత్రిన్.

## రామ రావణ యుద్ధము

1329. బలవంతులు శూరు లమా
త్యులు ముప్వురు గూలుటన్ మహోద్యత్క్రోధా
నల దీ ప్తాస్యం డగుచున్
బలికె దశాస్యుండు సూతున కుదగ్రముగన్.

1330. రథమున్ దోలుము వడి దశ
రథాత్మజుల నిప్డ సంగర క్షేత్రమునన్
వధియించి ఋణం బీగుదు
బ్రథన హ తాస్మ త్సుత పరివారంబునకున్.

1331. ఫల పుష్పంబులు సీతగ
నల నీ లాంగద మరుత్తనయ సుగ్రీవా
దులు దృఢ శాఖలు గాగన్
బొలిచెడు రామ క్షితిరుహముం గూల్తు వెసన్.

1332. అనినన్ సూతుండు రథం
బును దోలె ద్రుతగతి ద త్సముద్ధుర ఘోష
మ్మున సంచలించె ధారుణి
వన శైల నదీ నద ద్వీప వరాహంబై.

1333. అసురపతి నిర్దహించె గ
పి సైన్య యోధ నికరంబు విధి దత్త రిపు
గ్రసన ప్రభావ పటు తా
మ సాస్త్ర సంయోజనమున మన్యు వశుండై.

1334. కపిబలముం జెందుచు బో
యి పలాశి విభుండు కాంచె నిందువదను నీ
ల పయోద గాత్రు నుజ్జ్వలు
నపరాజితు దీర్ఘ చాప హస్తున్ రామున్.

1335. దివిజేశ్వరు గూడిన వి
ష్ణువు బోలెం దమ్ము లక్ష్మణుం గూడిన రా
ఘవు బద్మ దళ విశాలా
క్షు విస్ఫుర ద్విక్రమాభి శోభితు గాంచెన్.

1336. దశరథ సూనుల శరపథ
ము సమీపించి దశముఖుడు బోరన మ్రోయిం
చె శరాస జ్యా రవమున్
దశదిశలం గ్రమ్మకొన రణ స ముద్ధురతన్.

1337. అన్న యనుమతిం గొని దీ
వ్య న్నారాచమ్ము లేసె బటు చాపమునన్
సన్నద్ధుండై లక్ష్మణు
డ న్నిర్జర వైరి నాథు నదలించి వేసన్.

1338. దానవ నాథుండు సుమి
త్రానందను లెక్క గొనక ద చ్ఛరపాళిన్
వే నడుమనె త్రుంచి పఱపె
నానావిధ తీవ్ర మార్గణమ్ము లురవడిన్

1339. ఆ రీతి లక్ష్మణు శరా
సారమ్మున ముంచి కవిసె జంచద్గర్వుం
డై రావణుండు రామున్
మేరు నగ సమాన ధీరు మిత్ర కుల విభున్.

1340. జల ధారలం గురిసెడు మొ
యిలు తెఱగున దనుజనాథు డెడతెగక శరం
బులు గురిసె రాము పయి సం
చల ద్గుణ ధ్వని విహాయసము మ్రోగన్.

1341. రాముడు ఖండించె దదు
ద్దా మాశీ విష సమ ప్రదర జాలంబున్
వ్యోమంబు నంద భల్ల
స్తో మమ్ము న్బఱపి దర్ప దుర్వారుండై.

1342. ఇరువురు శస్త్ర విశారదు
లిరువురు నస్త్రవిదులున్ మహేష్వాసులు ని
ర్వ్వరు రామ రావణులు బో
రి రనాసాద్యముగ నింద్ర వృత్రుల బోలెన్.

1343. ఒరు నొరు గూల్పగ నయ్యి
ద్దరు బఱపిన దీప్త శర వితతి నంబర మ
త్తరి శంపాయుత వర్షా
బ్దర జాల సమాకులంబు భాతిం దోచెన్.

1344. అవిరత శర ప్రయోగము
న విరోధి ప్రదర ఖండన పటుత్వమునన్
బవరం బొనరించిరి రా
ఘవ రాముడు దనుజుడు బహుకాలము కడకన్.

1345. ఆ రామ రావణులకున్
బోరాటము వర్తిలె గ్రమముగ గడు దీవ్రం
బై రుద్ర దండ హస్తుల
పోరాటము వోలె నఖిల భువన భయదమై.

1346. దశకంధర ప్రయుక్త శి
త శరంబులు వచ్చి దశరథ తనూభవు నె
న్నొ సటం దాకి పడె సుమ స
దృశంబు లై త చ్చరణ ధరిత్రిం గుములై.

1347. రామ ప్రయుక్త శాత శి
లీముఖ జాలంబులు శకలీకృతములు గా
భూమిం బడె దశకంధరు
పై మణువుం దాకి ధాతృ మహిత వరమునన్.

1348. అసురాస్త్ర మేసె గుపిత వి
ష సర్ప మట్టు లసురుడు బుసలు గొట్టుచు వ్యా
ఘ్ర సృగాల పిశాచ వరా
హ సింహ సర్ప ముఖములు బయల్వడె నిషువుల్.

1349 అసురాస్త్ర సంజనిత వివి
ధ సాయ కోత్కరము గాంచి దశరథ సుతు డ
గ్ని సమోగ్ర తేజుడు బఱపె
వెస నాగ్నేయాస్త్రము రిపు వీరుడు కలగన్.

1350. అనలాస్త్రంబున శరములు
గన ద్దహన ధూమ కేతు గ్రహ నక్షత్రా
ననములు సూర్య ముఖంబులు
జనించి దహియించె నసుర సాయక తతులన్.

1351. అసురాస్త్రం బా రీతి ను
నిసి పో రావణుడు క్రోధ నిర్భర మతి దా
మసుడై రౌద్రాస్త్రం జే
సె సర్వ భూత ప్రభూత చింతావహమున్.

1352. వివిధాయుధ సంతతులు ప్రబ
భవించె నద్దాన పరశు పట్టిస చాపా
సి విశిఖ శూలాదులు ప్రళ
య వాయు వేగోద్ధతంబు లశని సమంబుల్.

1353. అమర ద్విషు డేసిన య
స్త్ర మడంచె రఘూద్వహుండు జయ్యైన బరమా
స్త్రము గాంధర్వంబున హ
ర్షమున నుతించిరి వియచ్చర వరుల్ రామున్.

1354. అతి సంరంభంబున దై
వతారి సౌరాస్త్ర మేయ బటుసాయక సం
హతి దున్మె రాముడు ద దు
ద్గత చక్రాయుధ తతి భుజ దర్ప మెలర్పన్.

లక్ష్మణుడు రావణునిచే మూర్ఛితుడగుట

1355. రాముని కొకింత యుద్ధ వి
రామం బొదవంగ ఘన పరాక్రమ నుతు డా
సౌమిత్రి యేసె వడి సు
త్రామాయుధ సన్నిభ శరతతి రావణు పై.

1356. కఱకుం దనంపు శరమే
సి రాల్చె నేల నరశీర్ష చిత్ర ప్రవిభా
సుర త ద్రథ ధ్వజంబున్
మఱియొకటం గూల్చె సూతు మస్తకము ధరన్.

1357. అంతట నిల్వక విక్రమ
వంతుడు సౌమిత్రి తున్మె బాణాసన మిం
తింతలుగ విభీషణు ద
య్యంతరమున వచ్చి కూల్చె హయముల గదచే.

1358. విరథుం డై రావణు డు
ర్వ్వరకు న్వడి డిగ్గి తమ్ము పై పటుశక్తిన్
బఱపంగ జూచి దానిన్
శర త్రయమున నుఱుమాడె సౌమిత్రి వెసన్.

1359. రావణుడు క్రోధ మూర్ఛితు
డై వైరి విదారణ పటు వన్యము శక్తిన్
వైవగ బూన బొదివె రా
మావరజుడు జేతు లాడ నట్లు శరములన్.

1360. దుర్వార క్రోధమున సు
పర్వారి పఱపె నమిత్ర బాధావహమున్
దుర్వార్యము శక్త్యాయుధ
ముర్వర వడక దిశలద్రువ నుగ్రధ్వనితోన్.

1361. సౌమిత్రికి స్వస్తి యనుచు
రాముడు శుభ మాడుచుండ లక్ష్మణు వక్ష
స్స్థమున్ దాకె నమోఘం
బై మయకృత మద్ది పిడుగో యన భీమముగన్.

1362. తొఱగు నస్ర ద్ధారలతో
ధరణీ తలమున బడె విగత స్పృహ రామా
వరజుడు లయ కా లాహ
స్కరోగ్ర నేత్రుడయి రామచంద్రుం డంతన్.

1363. జీవింప నీయ నింకి
రావణు వజ్ర నిభ శరపరంపర చేతన్
వైవస్వతు జేర బనుతు
నే వంకకు బాఱె నేని యిప్పు డటంచున్.

1364. బలితంపు టుగ్ర సాయక
ముల విలస త్తప్త హేమభూషిత పుంఖం
బుల దనువు గాడ బారెన్
బలలుండు మరు ద్విధూత వారిదము గతిన్.

1365. దశకంఠు డట్లు పాటు వి
వశుడై ధరబడిన తమ్ము వంకం గని చా
ప శరమ్ము లైవ్రచి ప్రభూ
త శోకభారమున గుంఠితాత్ముం డగుచున్.

1366. విలపించె నిట్లు రాముడు
పలలాశను డిట్టు లయ్యె పడవైచె మహీ
స్థలి నా యెట్ట యెదుట శు
భలక్షణున్ లక్ష్మణు జయవర్ధను దమ్మున్.

1367. ఏటికి దశాస్యుతో బో
రాటము నా కింక సంగరంబున విజయం
బేటికి రాజ్యమ్మున్ బ్రదు
కేటికి బ్రాణాధికుండు హితు డిట్లు వడన్.

1368. తలపంగ దేశ దేశ
మ్ములన్ లభింతురు గళత్రములు బాంధవులున్
గలదే భ్రాత లభింపం
గల దేశం బియఖిల జగంబుల నెందున్.

1369. కనుమో సుషేణ నా యీ
యనుజుండు దశాస్యు నాయుధాహతుడై ధా
రుణి శోణి తార్ద్రి కాయ
మ్మున పాముం బోలె నెట్లు పొరలాడెడినో!

1370. తనువున కంపం బొదవెడు
దను శ్శరమ్ముల గరముల దాల్పం జాలన్
రణ మెట్లు సేతు శోకం
బనుక్షణమ్మును ప్రవృద్ధ మగు చుండె మదిన్.

లక్ష్మణుడు స్వస్థుడగుట

1371. వ్యాకులి తేంద్రియు డగుచున్
దేకువ సెడి రాము డట్లు డీన స్వరుడై
శోకింప భిషగ్వరు డ
య్యాకులతన్ మాన్ప నిట్టు లనె రామునకున్.

1372. మృతి నంద లేదు రామ
క్షితీశ! నీ యనుజుడు ముఖచిహ్నంబులు ద
ద్గతి దోప వెట్లు వదనం
బతిప్రసన్నముగ గాన నగు సుప్రభమై.

1373. కన్నులు నిమీలితములై
యున్నను గాంతి న్వెలార్చు చున్నవి హృదయం
బు న్నిరత స్పందన సం
పన్నంబగు గరతలములు బద్మారుణముల్.

1374. కన రా పీ గతి శుభల
క్షణముల్ మృతు నందు జీవ సంయుక్తుం డౌ
ట నిజంబు స్పృహం గోల్పో
యె నంతియ విషాద మొంద నేమిటికి బ్రభూ!

1375. అనుచు సుషేణుడు హనుమం
తున కిట్లనె దెల్పియుండెను గదా నీహా
ర నగ స్థితౌషధి చయం
బును భల్లూకపతి నీకు ము న్వాయుసుతా!

1376. కొనితెమ్ము విశల్యకరణి
యును మఱి సంధానకరణియును నల సంజీ
వనకరణియున్ సువర్ణక
రణియు ననం బఱగు నవ్వి రయమున హనుమా!

1377. అనినన్ బవన జవంబున
హనుమానుం దేగి తెచ్చె నంసతలమునన్
గొని ఫల పుష్ప భరిత తరు
గణ శోభిత మౌషధాద్రి ఘన శృంగంబున్.

1378. మూలిక నొక దానిం గొని
వాలాయుధవైద్యు డంత వాసన జూపం
గా లేచె గత వ్యథుడై
యా లక్ష్మణు దలుగు లెల్లయవి రాలి పడన్.

1379. పరితోషంబున రాము డ
వరజుం గని కనుల బాష్ప వారి తొఱగ స
త్వర గౌగిలించి యిట్లనె
సురక్షితుండవుగ నిన్ను జూడం గంటిన్.

1380. నీ కొం డొక విధ మైనన్
నా కేటికి బ్రదుకు రావణ వధం బై సీ
తాకాంత చెంత చేరియు
నాకు సుఖం బౌనె ని న్గనం జాలని చో!

1381. అనినన్ లక్ష్మణు డిట్లనె
వినయమ్మున, నిట్టు లాడ వీరున కుచితం
బె! నెఱప వలె న్గద విభీ
షణు లంకాపతిగ జేయ నల్పిన ప్రతినన్.

1382. బ్రతుకండు భవ చ్ఛరపథ
గతుడైన రిపుండు జచ్చు గంఠీరవ మ
ర్దిత మత్తగజంబున్ బలె
బ్రతివీర భయంకర ప్రభావ! మహాత్మా!

1383. అవితథముగ బ్రతినం దీ
ర్ప వలతు వేచిన్ జనకజ వడయంగ దలం
తువ యేని గూల్పు మిను డప
ర వార్థి గ్రుంకకయ మున్న రావణు నాజిన్.

1384. అనుచున్ దమ్ముఁడు వచియిం
ప నమే యోత్సాహ మూని బాణాసనమున్
గొని సజ్యము సేసి రిపు మ
థనమున కాయత్తుఁ డయ్యె దాశరథి వెసన్.

**రావణుడు మఱల రామునితో బోరుట**

1385 ఆవిధి రాముడు నిల్వన్
రావణుడు రథాధి రోహణ మొనర్చి యపూ
ర్వావేశమున నెదిర్చె ది
శావళి మ్రోగెడు ధను ర్మహానాదము తో.

1386. అరుణ ద్యుతి భాసుర మై
పరగెడు నరదంబున దశవదనుం డుండన్
దుర మొనరింపన్ రాముడు
ధరణిన్ నిల్చుట యసంగతం బగు నంచున్.

1387. తలపోసి దేవపతి మా
తలి సారథి గాగ నిజ రథంబున్ బంపన్
వలగొని రాముడు వినయము
దలిర్ప గా నెక్కి సమర తత్పరు డయ్యెన్.

1388. అలఘు పరాక్రము లిర్వురు
దులారణము సేయ దొడగి దోర్బల మొప్పన్
జ్వలిత శర పరంపర చే
నలయింపన్ సాగి రంత నన్యోన్యంబున్.

1389. పరమాస్త్రవిదుడు రాముడు
హరించె గాంధర్వ దైవ తాస్త్రమ్ముల దై
వ రిపు ప్రయుక్తముల స
త్వరుడై దర్పించి త త్త దస్త్రంబుల చే.

1390. అసురుండు క్రోధమున రా
క్ష సాస్త్ర మేయగ నెగసె విషాగ్ని జ్వాలల్
ప్రసరింప జేయుచున్ స
ర్ప సాయక ప్రతతి సంగర క్షితి నెల్లన్.

1391. గరుడాస్త్రంబున నడగిం
చె రాము డద్దాని బంక్తిశీర్షుడు క్రోధో
ద్ధురుడై యంబుదము గతిన్
శరధారల గుఱిసె రామచంద్రు పయి వడిన్.

1392. శిత మార్గణావళిన్ దై
వత సారథి నొవ్వ జేసి భంజించె నిడం
బతులోదగ్రత రథ్య
ప్రతతిన్ జొత్తిల్ల జేసె రక్తౌఘమునన్.

1393. దను జేశ్వర రాహు గ్రగ
స్తుని రాము గని వ్యధ బడిరి సుగ్రీవ విభీ
షణులు విషణ్ణు లయిరి చా
రణులున్ సిద్ధులు ఋషులు సురలు గంధర్వుల్.

1394. అశుభంకర భీషణముగ
గ్రసించె నంతట బుధుండు ప్రాజాపత్యం
బు శశి ప్రియంబు రోహిణి
దిశలన్ ధూమ మెగసె రవిదీప్తు లడంగెన్.

1395. ధూమ సహితాగ్నిభాసుర
మై మండుచు నుద్ధతోర్మి మాలాతతితో
వ్యోమమ్మున కెగసె జలధి
ధామనిధి గ్రహింప జూచు తాత్పర్యమునన్.

1396. అమరేంద్రానల దైవ
త్యము విస్పష్ట ప్రకాశ మైశ్వాకుల తా
ర మహా ద్విశాఖ దా నా
క్రమించె నంగారకుండు గగనం బందున్.

1397. పది తలల తోడ మఱి యి
ర్వది చేతుల తోడ నిల్చె రావణు డంతన్
గదనస్థలి జాపము చే
త దాల్చి మైనాక పర్వతంబున్ బోలెన్.

1398. విలయోగ్ర భాను తేజో
జ్జ్వల దృక్తతి జూచె రామభద్రుడు శైలం
బు లదరె ధాత్రి చలింపన్
దలలు పదియు గంప మొందె దానవ పతికిన్.

1399. సుర సిద్ధ సాధ్య చారణ
వర గంధర్వులు గరుడుడు బన్నగులున్ గి
న్నర యక్ష సురర్షులు జే
రి రంబరంబున సమర దిదృక్షాపేక్షన్.

1400. అసురుండు గెల్వ వలె నం
చసురులు రాఘవునకున్ జయం బగునని యె
ల్లసురలు దపసులు స్వేచ్ఛా
ను సారముగ నాడ రావణుడు క్రోధమునన్.

1401. ఇదిగో శూలము బరగిం
చెద దుస్సాధ్య మగు నిద్ది సిద్ధము గ మ్మో
యి దశరథాత్మజ! యిప్పుడ
హృదయము లగలంగ జత్తు రీవు ననుజుడున్.

1402. అనుచు రిపు దురాసదమున్
గన చ్ఛిఖి శిఖోజ్జ్వలంబు ఘంటారవ భీ
షణమున్ శూలము వైచెన్
దనుజుడు భుజశక్తి యెసగ దాశరథి పయిన్.

1403 అచల స్థిరుడై భల్ల
ప్రచయం బడరించె రామభద్రుడు ప్రళయా
గ్ని చయ ప్రశమన రత మఘ
వ చోది తోద్ధుర జల ప్రవాహం బనగన్.

1404. రామ ప్రయుక్త భల్ల
స్తోమంబు హరించి పోయె శూలాగ్ని జ్వా
లా మాలికలన్ గ్రీష్మో
ద్దా మాది త్యాంశు జాల తప్తాంబువు లై.

1405. కను లెఱ్ఱ జేసి యింద్రుం
డనిపిన శక్త్యాయుధంబు నంది కొని రయ
మ్మున రాము డేయ శూలం
బును ఖండించె నది దివిజ మోదావహ మై.

1406. శూలము వితథం బైనన్
గాలాంతకు మాడ్కి బంక్తికంఠుడు గ్రోధో
ల్లోలాక్షుండై శితశర
జాల క్షత దేహు జేసె జయ్యన రామున్.

1407. అసురేశ్వర బాణాహతి
నసృక్పరీతాంగు డయ్యు నతిధీరుండై
యసమ క్రుధ రాముడు రా
క్షసు జర్జరితాంగు జేసె సాయక వృష్టిన్.

1408. ధనువున్ జాఱ విడిచి చ
చ్చిన గతి రథకూబరమున జేరగిల బడెన్
దనుజుడు సిడంబు బడ నే
సి నొంచె రాముడు హయముల శిత బాణములన్.

1409 ప్రధనము సేయం జాలక
రథికుడు జేట్పడుటయున్ దురంగములు శర
వ్యథ నొందుటయుం గని సా
రథి దూరమ్ముగ గొని చనె రయమున రథమున్.

1410. పరిచర్యల పిమ్మట దే
రి రావణుడు దూల నాడ హృదయమ్మున దు
ర్భర బాధ వడియు మృదు వా
క్సరణి న్సూతు డనె నిట్లు సవినయు డగుచున్.

1411. రిపు వశవర్తిని గాను భ
య పీడితుడ గాను రాజ! ఆశించెద నె
ల్లపుడున్ హితంబు నీకు బ
ల పరాక్రమ హీను గా దలంపను నిన్నున్.

1412. అని రథిక చిత్త వృత్తం
బు నకుం దగు మార్గమున రిపు వ్యూహ విధం
బు నెఱిగి కడప వలె రథం
బును సూతుం డదియ ధర్మము జయావహమున్.

1413. రథ రథ్య సూతులం గా
వ ధర్మము రథికున కట్లె పర పీడల చే
రథికుం డాపద పడ ద
ద్రథికుం గాచుటయు సూత ధర్మంబ యగున్.

1414. వివశుడ వైతివి రామ శ
రవిద్ధత రథమున నీవు రథ్యములున్ శ్రాం
తి వడె రిపుం డుత్సాహము
న విజృంభించి గుణరవ మొనర్చుచు నుండెన్.

1415. నిను రక్షించుటకున్ స్యం
దనంబు రామ శర పథము దప్పించి యిటుల్
గొని వచ్చితి దానవ నా
థ! నెఱప వచ్చు సమరము గతశ్రాంతుడ వై.

1416. తురగములు సేద దీరిన
వి రామ బాణ వ్యథ నిను పీడినచో సం
గర సన్నద్ధుండవు గ
మ్మరదము దోలెద ద్వ దాశ యానుగుణముగన్.

417. అనినన్ బ్రీతుం డై రా
వణుం డలఘు రత్న మయ సువర్ణాభరణం
బును మెచ్చి యిచ్చి తోలిం
చె నుద్ధతుం డగుచు రాము చెంత కరదమున్.

1418. ఇక నాజిన్ రాము వధిం
పక మఱలం బోవడు దశవదనుం డనుచున్
వికట స్వరమున నాడి ద
శకంఠు డేగె వడి రామచంద్రు నెదుటకున్

1419. రణ సన్నద్ధుం డై రా
వణు డా గతి నెదుర నిల్వ బరికించి జయం
బొనరించు విధానము యో
చన సేయు రఘూద్వహునకు సంతస మొదవన్.

1420. ఎదుటన్ బ్రసన్న ముఖుడై
ముదమున నావిర్భవించి మునిసత్తముడున్
విదితాత్ము డగస్త్యు డనె శు
భదంబు విను మిద్ది రామ! పాప హరంబున్.

1421. గెలుతువు రణంబున న్శ
త్రుల నెల్ల జయంబు వడయుదు వఖిల కార్యం
బులలో జింతాశోకం
బులు నశియించు నిది గుహ్యము సనాతనమున్.

1422. విమల స్వాంతమున జపిం
పుము దీని న్రామచంద్ర! ముమ్మాఱులు పం
క్తిముఖున్ గూల్తువు నే డని
యమివరు డాదిత్య హృదయ మన్మంత్రంబున్.

1423. క్రతువులు క్రతుభోక్తయు ద
త్క్రతు ఫలమున్ రవియె దైవత విభుం డీతం
డితడే యగ్నియు లోక
స్థితికిన్ మూలం బని యుపదేశించి చనెన్.

1424. ఆమ్మొయి దాపసు డేగిన
పిమ్మట రాముడు జపించె విధ్యుక్తము గా
నమ్మంత్రము విమల స్వాం
తమ్మున ముమ్మాఱు రావణ వధార్థం బై.

**రావణ వధ**

1425. శర చాపంబులు గొని దా
శరథి రథారోహణంబు సల్పి నిలువగా
సురసారథి తోలె రథము
ఒరవీరున కెదురుగ జయ బంధుర లీలన్.

1426. మాతలి కిట్లనె రాముడు
చేతేయుం దడుగుదెంచు దర్పోద్ధతు డై
ధాతు ప్రభా విభాసిత
మై తగ నొప్పు గిరి వోని యరదంబు పయిన్.

1427. అపసవ్య గతి న్వచ్చెడు
రిపుండు వీ డాత్మ నిధన కృతమతియై చూ
డు, పవన సముత్థితం బై
న పయోదము మాడ్కి వీని నాశ మొనర్తున్.

1428. కలగకుము రిపు విజృంభణ
కలితాహవశక్తికి రథగతి సేయుము ని
శ్చల హృదయేక్షణుడవుగా
బలభి త్సారథివి చెప్ప వలయునె నీకున్.

1429. ఈ దుర్వినీతు గూల్చుట
కై దర్పించి యని సేతు ననిదం పూర్వ
ప్రాదుర్భూత ధను ర్వి
ద్యోదయమున లోక విస్మ యోద్వేలము గన్.

1430. అనిన గడు రయమ్మున దో
లె నరదము స్ఫీతి మాతలి, త దుద్ధత ధా
రుణి రజము పెల్లుగ నెగసి
కనులం గ్రమ్మ గన జాలక దశాస్యుండున్.

1431. భగభగ మని మండు కనుల
బ్రగాఢ మన్యు కనదంతరంగంబున జూ
చి, గృహీత చాపు డై మొయి
లు గతిన్ గురిసె శరవృష్టులు రఘూద్వహు పై.

1432. ఎన్నెని శరము లేసిన
నన్నియు వ మ్మయ్యె గాని హరిదశ్వము లా
పన్నత నొందవు నొవ్వం
ద న్నిర్జరనాథు సూతు డణుమాత్రంబున్.

1433. తన శరముల రాముడు ద్రుం
ప నాతని శరప్రతతుల ఖండించున్ దా
నన లాని ఐంద్ర వారుణ
ధన దాహి ము ఖాస్త్రములు వితథము లయి పడెన్.

1434. ఎడ జూచి రాము డంతన్
బడ నేసె ధరిత్రి రావణ రథ ధ్వజమున్
గడు నిశితాంబకమున, గన
బడె దుశ్శకునమ్ము లప్డు పంక్తి ముఖునకున్.

1435. పలలంబు గురిసె నంబర
తలంబు విపరీత మారుతము వీచె, శివా
వళి మ్రోసె రథము నలువం
కల, హయ పృష్ఠంబు లనల కణములు రాల్చెన్.

1436. ఘోర కలహా నిష్ఠము లై
తేరున బడె శారికలు విదీర్ణాంగము లై
వారక గృధ్ర శ్రేణి మ
హారవముల సంచరించె నాకాశమునన్.

1437. మరణము తథ్యము తన కం
చెఱిగియు వెనుకంజ వేయ కే రాముని తో
దుర మొనరించె విజృంభిం
చి రావణుం డద్భుతముగ స్థిర చిత్తుండై.

1438. ముసల ప్రాసాసి గదా
విశిఖాద్యాయుధ చయంబు వెస వర్షింపం
గ సురేంద్ర సారథి విచి
త్ర సరణి తప్పించి తోలె రాము రథంబున్.

1439 కడు వేగంబుగ రాఘవు
డడరించె నిశాత శర సహస్రములు, దశా
స్యుడు నట్టు లె రాఘవు పై
విడిచె శితాంబకము లలఘు వేగా న్వితుడై.

1440. అన్యోన్య వధార్థులయి య
నన్యాదృశముగ రణం బొనర్చిరి రఘురా
జన్యుడు రావణుడున్ దమ
సైన్యంబులు పోరు దక్కి సస్మయత గనన్.

1441. జ్వలన ప్రదీప్త బాణం
బు లిర్వు రుద్ధతి నసంఖ్యముగ నేయ వియ
త్తల మా వరించి యయ్యవి
వాలిచె ద్వితీయాంబరంబు వోలిక నచటన్.

1442. తుములం బయ్యె రణంబు గ్ర
మముగా సవ్యాప సవ్య మండల వీథీ
భ్రమణము లొనర్చి చాతు
ర్యమునన్ సూత ద్వయంబు రథములు గడపన్.

1443. ఎదురెదురుగ డీకొను రీ
తి దరియ గా నేగు ద్రుతగతిన్ దేరులు రెం
డు దివిన్ మేఘంబు లనం
గ దత్క్షణంబ గురియు వెనుక కరిగి శరముల్.

1444. సాగరమునకున్ బోలిక
సాగరమె నభమ్ము నకును సాటి నభంబే
యా గతి దనకుం దా నీ
డౌ గరిమన్ రామ రావ ణాహవ మెసగెన్.

1445. జయ మగునని రాముండు ని
రయంబు తథ్య మని దశశిరస్కుఁడు సమర
క్రియ సేసి రలఘు భుజ శ
క్తి యుక్తి విక్రమము లెల్ల దెల్లము గాఁగన్.

1446. ఆ విధముగం జెలగి రో
షావేశములన్ దురంబు సల్పిరి ధాత్రీ
గ్రావ వ్యోమ పథములన్
రావణుడు న్రాముడు భువన భయద లీలన్.

1447. కోప కషాయిత నేత్రుం
డై పురుషోత్తముడు రాము డతి తీక్ష్ణ శరం
బేపున నేసి తునిమె లం
కాపతి మణి కుండల ప్రకాశిత శిరమున్.

1448. రామ శర నికృత్తం బై
భూమిం ద్రెళ్ళిన శిరంబు మున్నుం బలె బూ
ర్వామరు దేహమున బొలిచె
నేమి విచిత్రం బని సుర లెల్లరు జూడన్.

1449. మఱియొక బాణంబున ను
త్తరించె దచ్చిరము గూడ దాశరథి రయ
స్ఫురితగతి, మహాద్భుత మై
పరగుచు నింకొకటి యుద్భవం బయ్యె వెసన్.

1450. ఒక శిరమున్ ద్రుంచిన వే
ఱొక శిరము న ముద్భవ మగుచుండె సురారా
తి కపుడె, యట్టు లౌదవె మ
స్తకంబు లష్టోత్తర శత సంఖ్యాకము లై.

1451. ఎంతకు జావడు వీ డసు,
రాంతకుడు రఘు ప్రవీరు డాహవ మేలా
యంతము సేయం డంచు హృ
దంతర మం దెంచి యిట్టు లనె మాతలియున్.

1452. ఈ తులువ తోడ బోరెద
వే తీరున బెద్ద కాల మీ డెవ్వరు? నీ
కో తరణితేజ! రూపఱ
డే తోయజ సంభవాస్త్ర మెక్కుడి తేనిన్.

1453. అనుచున్ మాతలి విన్నప
మొనర్ప నాలించి రాము డుత్సాహంబున్
గొని సంధించె సమంత్రము
గ సీరజ భవాస్త్రము దశకంధరుని పయిన్.

1464. విలపింప జూచి యనునయ
మలరారగ రాముడు దరి కరిగి పలికె ని
ట్టులు శోకింతురె ధర్మమ
తులు వీరులకైౖ, విడువుము దుఃఖం బింకన్.

1465. మహిత ప్రాభవమున బో
ల్చి హతుం డయ్యె సమరస్థలిన్ శాత్రవ దు
స్సహముగ బోరాడి యితం
డహా! శత్రుత్వం బది మరణాంతము గాదే?

1466 ఇకి తడు నీ యట్టిడె నా
కు కలంత న్మాని యన్నకున్ సుగతి ప్రా
ప్తి కొనర్పుము శాస్త్రోక్తాం
త్యకర్మలు విభీషణా! స దమ లాత్ముడ వై.

1467. ఊరడుము రావణానుజ!
ధీరుండవు గ మ్మని యుపదేశించె మహో
దారుడు రాముడు, దుఃఖ వి
కార ముడిగి చిత్తశాంతి గనె నాతండున్.

## రావణ స్త్రీ జన విలాపము

1468. నాథుడు హతుం డగుట నవ
రోధజనంబులు బరుగు పరుగునం జని యా
యోధన ధాత్రిం జెల్లుగ
రోదించిరి భర్తృ గుణ నిరూపణ నుతులన్.

1469. వినవైతి వెందఱు వచిం
చిననున్ శ్రీ రాఘవు నవిచింత్య ప్రభావం
బు నహంకరించి ధర్మం
బును వీడి చరించి పతనముం జెందితి వే.

1470. నవ లావణ్య విలాసము
న వినుతి కెక్కిన సతీగణము ని న్ననుర
క్తి వరించి యుండ దుర్మో
హ వశమ్మున బ్రాకులాడి తవనీ సుతకై.

1471. దేవతలన్ భక్తి తనర
సేవించి వరంబు లెన్నొ చేకొంటివి గా
నీ పీడ వైతి దుష్కా
మావేశమ్ము బరనారు లందు న్నాథా!

1472. ఎంత తపంబొనరించియు
నెంతటి యైశ్వర్య మనుభవించియు లోకం
బంతయు గెల్చియు వృథ పర
కాంతా వ్యామోహ రూప కలుషము చేతన్.

1473. నిను సప్త జలధుల న్మిం
చిన యింద్రజు గూల్చి వార్ధి సేతువు నిర్మిం
చిన వీరుడు పరమాత్ముం
డని నాడె యెఱింగితి విన వస్మద్భోధన్.

1474. రాముని తత్త్వం బెఱిగిన
నా మఱది విభీషణుం డొనర్చిన బోధ
ప్రాముఖ్యంబున్ జేర్చవు
పో మది వైధవ్య యోగము న్నా కొదవెన్.

1475. హర పూజా నిరతుండవు
పరమ తపః ప్రీత జలజభవుడవు నయ్యున్
హరితో బగగొంటివి హరి
హరాజుల కభేద మెఱుగ కజ్ఞానమునన్.

1476. నరుడని వనాటు డనియున్
దిరస్కరించితివి రాము నీరజ గర్భే
శ్వరనిభు బరమపదము స
త్వర జేర్చు పథం బటంచు భావించితి వో!

1477. సురకాంతల దల దన్నిన
సురుచిర భోగంబుల రుచి జూపి యిటు శ్రీ
వరిగితివి నాథ! ని న్నను
సరింప నైతి సహధర్మచారిణి నయ్యున్.

1478. ఆశ్రితులన్ బోషించితి
వశ్రాంతము నాథ! అతులి త్రైశ్వర్యోపే
త శ్రేయమ్ముల గూర్చి సు
ర శ్రీ మౌళి మణి రాగ రంజిత చరణా!

1479. హరితో వైరంబును నని
తరసాధ్య వర ప్రభూత తత గర్వంబున్
బర మానినీ మణీ సం
గరతియు జేకూర్చె నీ కకాల మరణమున్.

**విభీషణుడు రావణున కంత్యక్రియ లొనర్చుట**

1480. అనుచున్ బహుభంగుల న
వ్వనితా జన మేద్వ రాఘవ విభు డనె, విభీ
షణ! పురికిం బంపుము వీ
రి నెల్ల, గడగుము తదుపరి కృత్యంబునకున్.

1481. అనినన్ విభీషణుం డి
ట్లనె రామునకు న్మహాత్మ! యనుచిత మీ దు
ష్టున కే నంత్య క్రియలన్
బొనర్చుట తెగడుదురు నను భూమిజనంబుల్.

1482. అనవుడు రాము డనె విభీ
షణ! యీతండు భవ దగ్రజన్ముండు తపో
ధనుడున్ దేజశ్శాలియు
ననారత శివాంఘ్రి సేవ నైకాత్ముండున్.

1483. తన చేసిన కర్మ ఫలం
బు ననుభవించి మరణించి ముక్తిం గనె గా
రణ మేమి లేదు మనకి
తనితో వైరమున కింక దార్మిక చరితా!

1484. గణియింప బోల దిప్తి
తని పూర్వ కృతాఘము లవి తద్దయు మెండై
నను సలుపు మంత్య కర్మలు
ఘనముగ నని బోధ సేయగ విభీషణుడున్.

1485. అవరోధ జనంబు సగౌ
రవంబు గా ననునయించి రావణున కొన
ర్చె విధి విహిత గతి దహనా
ది వివిధ కర్మంబులు సుగతి ప్రాపకముల్.

1486. సురపతికి గృతజ్ఞుండై
కరములు జోడించి యనిపె గాకుత్స్థుడు త
త్సుర సారథి ప్రీతి పుర
స్సర సమ్మానం బొనర్చి స్వఃపురమునకున్.

1487. అభిషేకించె ముదంబున
విభీషణున్ లక్ష్మణుండు వేదోక్త విధిన్
శుభద ప్రక్రియ లంకా
ప్రభువుగ రాము పనుపున సురల్ వినుతింపన్.

**సీతాదేవి రాముని చెంతకు వచ్చుట**

1488. పవన తనూజు బిలిచి రా
ఘవు డిట్లనె హనుమ! క్రూర కర్ముం డగు వై
శ్రవసున్ గూల్చితి నే నని
యవనిజ కీ వేగి తెల్పు మయ్య రయమునన్.

1489. అరయము త దభిప్రాయపు
సరళి యటం చనువ నేగి సత్వరు డగుచున్
మఱలి చనుదెంచి రఘుభూ
వరునకు వచియించె నిట్లు పావని యెలమిన్.

1490. అమితానందంబును జెం
దె మహీసుత లక్ష్మణుండు నీవున్ గుశలం
బు మెయిన్ బొల్తు రనియు బం
క్తి ముఖున్ సమయించి తీ వనియు నే దెలుపన్.

1491. నిను సత్వరంబ దర్శిం
ప నాస వడుచున్న దా యమ కడున్ దీనా
ననయై యున్నది రాక్షస
వనితా జన మధ్యమున ప్రసవద్బాష్పములన్.

1492. తన్నుం బెక్కు విధంబుల
బన్నంబుల బా లొనర్చు పలల స్త్రీలన్
దన్నుదు ముక్కలు సేయుదు
నన్నన్ వారించె నను దయాపూరితయై.

1493. వైరంబు కలదె నాతో
వారికి వర్తించి రట్లు ప్రభు నానతి యే
కారణముగ దాసులు ధి
క్కారము సేయ గలరె! ప్రభు కార్యం బనుచున్.

1494. అని తెల్ప, సగౌరవముగ
జనకాత్మజ దోడితెమ్ము సత్వరమ విభీ
షణ! యని రాము డనగ జ
య్యన నేగి యతండు తత్ప్ర యత్నము సేయన్.

1495. సుర నారుల బోలెడు వర
పురంధ్రు లభ్యంగనంబు మున్నుగ విమలాం
బర భూష ణాదుల నలం
కరించి యంచిత మగు శిబికం గొనితేరన్.

1496. ముందు నడచుచు విభీషణు
డందలమున్ రామభద్రు నంతికమున ని
ల్పం దిగి జానకి పతి మో
ముం దిలకించె ననురాగ పూర్ణేక్షణ యై.

సీత శపథము సేయుట

1497. నును సిగ్గున మోమున్ వం
చిన చిరదుఃఖిత యగు సతి జీరక కఠిన
స్వనమున రాము డనె మనం
బున రోష విషాద భావములు తీంద్రింపన్.

1498. ఓ మంగళ స్వరూపిణి!
ఓ మైథిలి! శత్రునిధన మొనరించుటచే
నా మది నిండిన క్రోధం
బామూలము దీరి ప్రతిన సార్థక మయ్యెన్.

1499. జలధికి సేతువు గట్టి క
పులతోడం దండు వెడలి పోకార్చితి మ
ల్లలనాపహారు రావణు
గళంకము న్బాపుకొంటి గాకుత్స్థులకున్.

1500. చేసిన ప్రతినం దీర్చితి
నాసుర నాథు న్వధించి యనిలసుతాదుల్
భాసుర పరాక్రమ నిధులు
బాసట యై పడిన శ్రమము ఫలియించె నొగిన్.

1501. ఆ నాడు నీ కయిన యవ
మానము బాపితి బరాక్రమ యశోపేతుం
డైన పతికి దగినట్లుగ
నీ నాడు స్వతంత్రు రాల వీవు జనకజా!

1502. నివసింపు మింక నీయి
చ్చ వచ్చి నెడ బ్రాణరక్ష సల్పుకొనగ, దా
నవ రాజాంక పరి భ్ర
ష్ట వగుట నిను స్వీకరింప జాలను సతిగాన్.

1503. సందేహమ్మున కెఱయ
య్యెం దరుణీ! నీదుచరిత మెదుట నిలిచి నా
కిందుం బ్రతికూలవు మా
డ్కిం దోచెదు నేత్రరోగి కి న్దీప మటుల్.

1504. ఒక వత్సరకాలము వం
క్తి కంతు నింటన్ మెలంగితివి నిజ మెవ్వా
రి కెఱుక నిన్నైకొన దూ
ఱకున్నె లోకము విమోహి రాఘవు డంచున్.

1505. అవమతి బాపు కొనంగా
బవరము చేసి దశకంఠు వధియించితి గా
ని వనిత! నీపై వ్యామో
హ వశమ్మున గాదు తెలియుమా స్పష్టముగాన్.

1506. మనసిజ వికార దుష్ట మ
గు నిశాచరు దృష్టి యలముకొనె నీపయి భా
మిని! నిన్నెవడు సుహృల్లే
ఖనబుద్ధి బరిగ్రహింప గలడో చెపుమా?

1507. అలఘు జగద్భోధన గురు
ఫలోదయం బైన సూర్య వంశంబు యశో
నిలయంబు మాది తద్వం
శ్యుల కిడగు నట్లు సేయ నొప్పదె నాకున్!

1508. అనినన్ మధుర ప్రియ భా
షణ శ్రవణ సక్త మానస లతాంగి మహీ
తనయ వడంకె వడవడ బ
వన ధూతం బైన కుసుమ వల్లిం బోలెన్.

1509. ప్రకృతి సుకుమారి యగు జా
నకి మనమున దల్లడిల్లి, నాథు తిరస్కా
రకృ తోరు దుఃఖమున్ గ్రమిం
గుకొనుచు గద్గద మగు నెలుగున ని ట్లనియెన్.

1510. అనరాని మాట లంటివి
నను బామర జనుని బోలె న్యాయమె? నాథా!
మనమున నిను దప్ప నెఱుం
గ నన్యు నేనాడు నెట్టి కాలంబుననున్.

1511. దనుజాంక పరిభ్రష్ట వ
ని నింద సేసితివి నన్ను నిర్మల చరితన్
దనుజుడు బల ప్రయోగ
మ్మున న్గొనడె ని స్సహాయముగ నున్న తఱిన్.

1512. ఎదిరింప నశక్యంబ
య్యె దనుజు, వారించితి, నిరసించితి, నే న
య్యది దైవకృతంబగు, దూ
ఱదగున్ దైవంబు, ద దపరాధంబునకున్.

1513. కలుషం బింతయు నే సలు
పలేదు మ దధీన మైన భావంబున, ని
శ్చలమై యున్నది నీయెడ
దల పప్పుడు దేహ మస్వతంత్రము గాగన్.

1514. పెరిగితి మా బాల్యమ్మున
నిరువురము న్గలసి మెలసి యెఱుగుదు వస్మ
చ్చరితంబు బూర్ణముగ న
ట్లెఱుగని చో నెఱుగ జాల విక నెన్నటికిన్.

1515. జననము ధరణీ గర్భం
బున నందిన దాన, పెంచి పోషించిన దా
జనకుడు రాజర్షి, సుశీ
లను, శపథం బేమి కావలయునో చెపుమా!

1516. పలికితివి కష్టపుం బలు
కులు నా స్త్రీత్వమె కతముగ గుజనుం బోలెన్
దలపంగ వైతి వయయో!
యిలా సుతన్ నాదు పూర్వ వృత్తంబు మదిన్.

1517. మనమున గణింప కుంటివి
మన పెండిలి నాటి సత్ప్రమాణం బైనన్
గణియింప వింత నీపై
పెనగొన్న మదీయ భక్తి విశ్వాసములున్.

1518. హనుమన్ లంకకు బంపిన
దినమ్మునెనె నిన్ను వీడితి నటంచుం దె
ల్పిన, బ్రతుకు ద్యజించెడి దా
నను, నీకు రణశ్రమం బనావశ్యముగన్.

1519. హతమయ్యె జీవితం బది
బ్రతు కేమిఫలము భవత్తిరస్కృతి కెజయై
బ్రతుకున్ ద్యజింతు ననుచున్
జితి చేర్పింపు మిక నా కనియె లక్ష్మణు తోన్.

1520. అతడున్ రాము దెసం జూ
చి తన్ముఖ ద్యోతమాన చిహ్నంబుల నీ
ప్సిత మెఱిగి యేర్పరించెన్
జితి గపులు రాక్షసులు విచేష్టులు గాగన్.

1521. జనకజ యవనత మూర్ధం
బున రామునకున్ బ్రణామము ల్సేసి ప్రద
క్షిణ మాచరించి ప్రార్థిం
చె నిట్లనలదేవు శుద్ధ చిత్తము తోడన్.

1522. నిరతమ్మున్ బతి చరణ
స్మరణమ్మున్ బాయ కున్కి సత్యం బేనిన్
బరిశుద్ధ వర్తనమునన్
బరగుదు నేని హుతవాహ! నను బ్రోవు మొగిన్.

1523. మనసున వాకున గర్మం
బున రాముం దప్పక సతము జపించెడి దా
నన యేని లోకసాక్షివి!
యనల మహాదేవ! కావు మన్ని విధములన్.

1524. తరణియు శశియు ద్రిసంధ్యలు
వరుణుడు వాయువు దిశల్ దివారాత్రములున్
ధరణియు నను బతివ్రత
కరణిన్ భావింతు రేని కావుము నన్నున్.

1525. అంతన్ జానకి దేహ
భ్రాంతిన్ విడనాడి చొచ్చె జ్వలనంబున సు
స్వాంత యగుచు, మ్రోసె దివిజ
కాంతల హాహా రవములు గగనం బందున్.

1526. చెలరేగెం గలకల మ
వ్వలముఖ రాక్షస భట ప్రవరులన్ నిట్టూ
ర్పులు రామచంద్రు డింత ద
య లేని వా డయ్యె నేల యను వాక్యములున్.

1527. ఆ పలుకులు వ్యాఖ్యాన వి
లాపంబులు నాలకించి లవకాలము చిం
తాపరు డయ్యెన్ రాముడు
భూపుత్రిక యగ్ని హోత్రము బ్రవేశింపన్.

**దేవతలు రామునకు నిజస్థితి దెలుపుట**

1528. ఆ సమయమ్మున దోచిరి
వాసవ ముఖ దిక్పతులు సుపర్వులు నాళీ
కాసన వృషభ ధ్వజులున్
భాసుర యానమ్ముల గగన పథం బందున్.

1529. రాముడు ఘటించె శర్వపి
తామహ శక్రానల ముఖ దైవత తతికిన్
గైమోడ్పులు వా రెల్లరు
రామున కని రిట్టులు మధుర వచః ఫణితిన్.

1530. దివిజ శ్రేష్ఠుండవు రా
ఘవ! విజ్ఞానివి సకల జగత్కర్తవు భ
ర్తవు సర్వ శక్తి మంతుం
డ వెఱుగ వెట్లు నిను నీవు నాశికాక్షా!

1531. ఋతుధామ నామక ప్రజా
పతి వరయంగ నెనమంద్రు వసువుల లోక
త్రిత యా ద్యంత సమయ సం
స్థితుండ వీ వొక్కరుడవె శ్రీరామ విభూ!

1532. శివమూర్తుల నష్టమ మూ
ర్తివి ద్వాదశసాధ్యులం దరిందమ! నీ వై
దవవాడ నశ్వినులు నీ
శ్రవణంబులు నేత్రము లిన శశి యుగ్మకమా.

1533. సకలేశ్వరుడవు రామా!
సకలజ్ఞుండ వకలంక సజ్జన నుత జా
నకి యగ్ని జొఁబ నివారిం
ప కె ట్లుపేక్షించి తయ్య! ప్రాకృతు బోలెన్.

1534. అని సుర లడిగిన రాముం
డనె నే మేమొ యనుచుండి రమరులు మనుజుం
డ ననియు దశరథ పుత్రుం
డ ననియు మాత్రమె తలంతు నాదు మనమునన్.

1535. ఏ నెవ్వండనొ! యేమిటి
కీ నరరూపంబున జనియించితినో యా
వైనము దెల్పం దగు జతు
రానను డెంతయు ముదావహంబుగ నాకున్.

1536. అనిన జతుర్ముఖు డిట్లనె
దనుజవధార్థముగ దశరథ తనూజుడవై
జనియించిన శ్రీ నారా
యణుండ వఖిల భువ నావ నై కాత్ముడవున్.

1537. పరుడవు పరాత్పరుండవు
పురుషోత్తముడ వజితుడవు ముని మానస గో
చరుడవు నిత్యుడ వాద్యం
తరహితుడవు నీవు చక్రధరుడవు రామా!

1538. అరయ నోంకార వష
ట్కారమ్ములు నీవ, నీవ క్రతువులు జగదా
దారుడవు నీదు రసనయె
శారద హృదయంబు నేను సర్వేశ హరీ!

1539\. జనకజ సాక్షాత్ శ్రీల
క్ష్మి నీవు విష్ణుడవు మానుషీకృత రూపం
బున నిర్వహించితివి రా
వణ వధ సేసితివి ధర్మపరిరక్షణమున్.

## శ్రీరాముడు సీతాదేవిని స్వీకరించుట

1540\. కమలభవుడు రాముని త
త్త్వ మీ గతి నుతింప వహ్ని దైవము ప్రభవిం
చి మహీసుత ము న్నున్న వి
ధమున నిజాంకంబున గొని దాశరథి కనెన్.

1541\. అమలిన శీలంబున వెల
యు మాననీయగుణ యి య్యయోనిజ కడు దై
న్యమునం బడి యుండ హరిం
చె ముష్కరుడు రావణుండు శ్రీ రామ విభూ!

1542\. మనమున నిన్నె తలంచుచు
దినమ్ములు గడపె ననిశము దితిజ స్త్రీ ధ
ర్షణమున గడు నడలియు, జే
కొను మీ యమ నాదు నాన గూరిమి తోడన్.

1543\. ఇది ధర్మము లోక శుభ
ప్రదంబు రామ యని హవ్యవాహను డనగా
నుదుటన్ గరములు జోడిం
చి దాశరథి పల్కె వినయ శీలుం డగుచున్.

1544. ఎఱుగుదు ని య్యవనీసుత
వరశీలంబు ననవద్య వర్తనము తెఱం
గెఱుగుదు నీ సాధ్వీ నిశా
చరు చేతం బడిన పాట్లు సాకల్యముగన్.

1545. ధరణీ విభుండ నగుటన్
బరీక్ష గావింప వలసి వచ్చె జనకజన్
నరతతి కాదర్శమ్ముగ
జరించు నృపధర్మ మూని జగతి నిలుపగన్.

1546. పరు డపహరించిన సతిన్
మఱల గ్రహించె స్మరవశుడు క్ష్మావిభు డని దూ
ఱరె లోకు లెట్లు సేతు జ
న రంజనం బట్టి దూఱునకు లో నైనన్.

1547. అమలిన పాతివ్రత్య మ
హిమంబునన్ భూమి తనయ యే బామున క
గ్గము గాక కాచుకో గల
సమర్థు రా లం చుపేక్ష సల్పితి నట్టుల్.

1548. జనకజ పతివ్రత యటం
చు నిరూపిత మయ్యె నిన్ను జొచ్చియు వెతతే
కనపాయ త న్వెడలుట భు
వనత్రయం బెఱిగె నిద్ది పావక దేవా!

1549. దఱి జేర రాని యనలం
బు రీతి ని య్యమ మెలంగె బూర్వామర రా
ట్పురి నంచు రాము డవనిజ
కరంబు గొనియె ననురాగ కలితేక్షణుడై.

**రామలక్ష్మణులు దశరథుని దర్శించుట**

1550. శివదేవుం డి ట్లనె రా
ఘవ! పొలి యించితివి లోక కంటకు డగు దై
త్య విభున్ రావణు మా భా
గ్యవశంబున, మోద మందె నఖిల జగంబుల్.

1551. భరతు డెదురు సూచెడు నీ
దు రాకకై దిగులు పడుచు, ద్రుతగతి జని ము
వ్వురు తల్లులకున్ మోద మొ
నరించి పితృ రాజ్య పాలనము సేయు మికన్.

1552. కుల వర్ధను లయ్యెడు పు
త్రుల గని హయ నవ ముఖ క్రతు శతంబు న్ని
స్తులముగ గావించి యశో
జ్జ్వలుండ వై చేరు మపల వైకుంఠంబున్.

1553. అడుగో! మీ తండ్రి దశర
థుడు దివ్య విమాన సంస్థితుండై శోభిం
చెడు నాతనికిన్ గావిం
పు డీవు ననుజుండు భక్తి పూర్వ ప్రణతుల్.

1554. అన నచ్చెరువున గని రా
మ నృపాలుడు లక్ష్మణుండు మస్తకము ల్వం
చి నమస్కృతి సేసిరి స
ద్వినయమ్మున దండ్రి కసమ తేజో నిధికిన్.

1555. మోద ప్రఫుల్ల నేత్రుం
డై దశరథు డగ్రతనయు నంతికమునకున్
రా దిగిచి శిరము మూర్కొని
ఆదరమున బల్కె గించి దార్తియు దోపన్.

1556. తనయా! నిను బోల్వాని గ
హనమ్ముల జరింప బంచి నట్టి దురాత్మం
డను, సుర లెంతగ బూజిం
చిననున్ జిత్త ప్రశాంతి చేకుర కుండున్.

1557. వనవాస దీక్ష బూర్ణ
మ్మొనరించి ప్రబల దశాన నోన్మథనము సే
సి నిలింప ప్రస్తుతి గ
న్న ని న్నిటుల్ జూడ గంటి నా భాగ్యమునన్.

1558. అరుణోదయంబున నిరుల
తెలుంగున న్నమసి పోయె దివ్య తేజో
భరితు న్నిను గన దుఃఖం
బు రామ! హర్షమున బొంగి పొలులున్ మదియున్.

1559. నిను యౌవరాజ్య పట్టం
బున కభిషిక్తుం బొనర్చు పూనికకున్ రా
వణ వధ గోరి సుర లొన
ర్చిన విఘ్నము లెల్లను దెలిసితి ని ప్డిపుడే.

1560. అమలాత్మలు కౌసల్యా
సుమిత్రలుం గైకయు గడు సుఖ లౌదురు స్వాం
తము లలర, సతీ సోదర
సమేతముగ నిన్ను జూచి, చను డిక, పురికిన్.

1561. ఇల బరిపాలించుచు స
ల్లలి తైశ్వర్యమున భరత లక్ష్మణ శత్రు
ఘ్నులతో నీవు సుఖంబుగ
విలసిల్లుచు నుంట జూడ వేడుక వడుదున్.

1562. అని బహ్వాశీస్సు లొసం
గిన జనకునకు న్నయమున గే ల్మోడ్చి స్మితా
ననుడై విన్నప మొనరిం
చె నిట్లు రాముడు ప్రసన్న చిత్తము తోడన్.

1563. వనవాసము సేయగ నే
జనునాడు వచించితిరి విషణ్ణస్వాంతం
బున గైకేయిని వీడితి
నని, గృప నుపసంహరింపు డ వ్వచనంబున్.

1564. ఈ వరముం దయసేయుము
ప్రోవుము న న్నని కరములు ముకుళింప ప్రియం
బావహిల నట్ల యని రా
మావరజుం గాంచి యిట్టు లనె, దశరథుడున్.

1565. నిరతము సద్భక్తిన్ బరి
చరించితివి రామభద్రు సంతస పడితిన్
వర పురుషార్థంబు లభిం
చెర! పుత్రక! నీకు, నేను చెప్ప వలయునే.

1566. సమకూరు సర్వ ధర్మ ఫ
లములున్ నిస్తుల యశంబు లక్ష్మణ! యీ లో
కమునన్ బిమ్మట స్వర్గా
సము రాముడు నీ యెడల ప్రసన్నుండైనన్.

1567. పరగును దైవత హృదయాం
తరవర్తియు నాశన రహితంబును నై పు
త్ర! రహస్యంబుగ బ్రహ్మం
బెఱుంగ రా దాత్మశుద్ధి హీనుల కెందున్.

568. ఆ యవిచింత్య బ్రహ్మం
బీ యరి నిర్మథన తేజ మెసగన్ రాముం
డై యవతరించె భువి నీ
వీ యెఱుకం గల్గి కొల్వు మెప్పుడు వానిన్.

1569. అని జానకిం గని వచిం
చె నిట్టు లమ్మ! భవదీయ చేత శ్శుద్ధిన్
జన విదితము సేయగ న
ట్లొనర్చె రాము నెడ గోప మూనకుము మదిన్.

1570. నిరతము పతి సేవా త
త్పర వౌదువు నీకు చెప్ప దగునే పతియే
పరదైవతంబు సుమ్మని
యరిగె దశరథుండు దివ్య యానంబు పయిన్.

ఇంద్రుడు రామునకు వరమిచ్చుట.

1571. సురపతి రామున కిట్లనె
బరమ ప్రియ మావహిల్లె వ్యర్థము కా రా
దరయగ మా యాగమనం
బు రామ! యొసగుదు నభీష్టముం గోరు మొగిన్.

1572. అనిన, సహస్రాక్షున కి
ట్లనె రాముడు, మీ మదికి ప్రియం బొదవుట కం
టెను గావలసిన దొం డుం
డునె! నైన, మ దీప్సితం బడుగుదు సురపతీ!

1573. రణమున గూలిరి నాకై
వనచర లాంగూల ఋక్ష భటు లగణిత సం
ఖ్య, నిలింపపతి! పునర్జీ
వనము ప్రసాదింపు మట్టి వా రెల్లరకున్.

1574. క్షతతనులు యథాపూర్వ
స్థితి నందన్వలె, సమృద్ధి జేకూర వలెన్
క్షితిరుహ మూలంబులు ఫల
తతులున్ జల మెల్లవుడు సుధా మధురములై.

1575. బహు దొడ్డ వరము లియ్యవి
మహనీయము నీదు మాట మన్నింతు నటం
చు హసన్ముఖు డై శుభ మని
సహస్రనేత్రు డరిగె దివిజస్తోమము తో.

1576. మృతులు బునర్జీవితులై
క్షతతను లై పడిన వారు గాయంబుల బా
ధ తొలంగి, లేచిరి సము
ద్ధతులై వానర చమూ కదంబము నందున్.

శ్రీరాము డయోధ్యకు బయన మగుట

1577. అమితానంద భర స్వాం
తమునన్ శ్రీ రాఘవు డభినందించె సుహృ
త్తములు యశో భాస్వరు ల
ర్యమాత్మజ విభీషణుల నుదార చరితులన్.

.578. మై దాప కుద్ధతిం బో
రాడితివి జయావహముగ రవినందన! యీ
రేడు జగంబులలో నీ
కీ డెవ్వరు పేర్కొనగ సుహృల్లోకమణీ!

1579. ఏ విధముగ గొనియాడుదు
నీ వొనరించిన సహాయ మిప్పట్టున లం
కావిభు! సుగుణ విభూషణ!
రావణు గూల్చి పడసితి దరాసుత నెలమిన్.

1580. ఇక మీ మీ రాజ్యములన్
సుకముగ నేలుకొను డెదురు సూచెడు నాకై
వికలాత్మన్ భరతుడు, తడ
య కేగుదు నయోధ్య కొసగు దనుమతి నాకున్.

1581. అనినన్ విభీషణుం డి
ట్లనె, ప్రభు! యీ యొక్కనాటి కస్మ న్నిలయం
బున నాతిథ్యము గొని యవ
ల నేగుమయ్య! కృత మంగళ స్నానుడవై.

1582. ధనపతి దివ్య విమానం
బు నుంచితి భవ న్నిమిత్తముగ నాకడ, రా
మ నరేంద్ర! సర్వ సిద్ధము
గ, నిరాలస్యముగ జేర్ప గల దది పురికిన్.

1583. ఈ యొక్క వరంబు న్దయ
సేయుము మన్నింపు మను నిశచరాధిపు నా
ప్యాయమ్ముగ గని యిట్లనె
నా యాజితనూజు డెల్ల రాలింపంగన్.

1584. వినుతం బగు సాచివ్యం
బొనర్చితివి నాకు విక్రమోదార! విభీ
షణ! మన్నించుట కర్జం
బు నాకు నీ మాట ధర్మము సమంచితమున్.

1585. జనను నిలువం జాలను
నే నయ్యోధ, దమ్ము భరతునిం జూడం గా
మానసము తత్తఱంపడు
ప్రాణమ్ములు నిల్పు నెట్లొ వా డిందనుకన్.

1586. వనవాసము దీర్చి మరు
క్షణంబ వత్తు నని నమ్మకం బొదవం గా
ననిపితి రాజ్యంబున్ గొను
మని న న్నానాడు వాడు ప్రార్థింపంగన్.

1587. ఆమాట నిల్పుకోవలె
మా ముప్వురు తల్లు లమలమానసలు పుర
గ్రామణు లమాత్యు లస్మత్
క్షేమం బెఱుగక కృశింత్రు చిత్తక్షోభన్.

1588. త్వర నేగు టవశ్యమగుట
నరిగెద క్షణదాచరపతి! అనుపుము న న్నం
బరయానము నాయత్తము
నరించి, కృపసేసి యొం డనగ బోకు మికన్.

1589. అనుడున్ మారు వలుక లే
క నిశాచర విభుడు పుష్పకమ్మున్ రావిం
చిన నెక్కె రాము డభివం
దనమున భార్యానుజ సహితంబుగ నెలమిన్.

1590. సవినయముగ మ్రొక్కి వనా
ట విభుం డనె నిట్లు, మిక్కుటం బయ్యెడు రా
ఘవవిభు! భవ దభిషేకో
త్సవ దర్శన వాంఛ మాదు స్వాంతంబులలో.

1591. అనుకంపా మతి వై యిడు
మనుజ్ఞ ని న్ననుసరింప, నలఘుమతులు పు
ణ్యనిధులు నీ తల్లుల సే
వనమున ధన్యమ్ము లగును భవములు మాకున్.

1592. ఎవనిం జూడ ద్వరపడుదు
వెవండు నీ మన్ననన్ గడించె మునిజన
స్తవనీయ భవ్య చరితుం
డెవ డట్టి భరతు గనుట లభించును మాకున్.

1593. అనినన్ గపిపతి వచన
మ్మున కుత్సాహమ్మున గపిపుంగవులున్ దై
త్య నృపతి యున్ బల్కిరి దా
మును వత్తు మయోధ్య కంచు ముక్త స్వరులై.

1594. అమిత ప్రియ మయ్యె సతీ
సమాగమంబున, మఱియు ప్రసన్నంబగు చి
త్తము భరతుం గన బోవుట
విమలము మీ మాట నద్ది ద్విగుణం బయ్యెన్.

1595. కపి వీరుల తో నీవుం
దపనతనూజ! సచివ సహితమ్ముగ లంకా
నృప! నీవు రండు సాకే
తపురికి మా వెంట సమ్మదం బెసగంగన్.

1596. అని రాము డనుజ్ఞ నొసం
గ నలఘు తేజుంబు పుష్పకం బెక్కిరి చ
య్యన సూర్యనందన విభీ
షణు లెల్ల వనచర రాక్షస ప్రముఖులతో.

1597. ఉల్లము లెల్లరకున్ రం
జిల్లగ నాసీను లయి రుచిత పీఠములన్
ఫుల్లేక్షణముల రాఘవ
వాల్లభ్య స్తుతిప రైక భాషణు లగుచున్.

1598. పయనము సాగించె గుబే
రయానము వియత్తలమున రాముడు వందిం
చి యనుమతి సేయ ద్రుతగతి,
నయోనిజం గాంచి రాము డనె ప్రియ మెసగన్.

### శ్రీరాముడు సీతాదేవికి మార్గమున విశేషములు తెలుపుట

1599. చను నీ పుష్పకము ద్రుతగ
తి నయ్యదె త్రికూట శిఖరి దివ్య న్నవ ర
త్న నిభృత సౌధోపేతం
బు నిశాచర సార్వభౌమ పురముం గనుమా!

1600. జనకజ! చూడు మదియె రా
వణుండు దుష్కృత ఫలానుభవమున్ ప్రాపిం
చిన రణభూమి హృదయ భే
దనముగ విలపించి రచటె తత్సుతు లెల్లన్.

1601. ఇదె లవణాంబుధి తీరం
బదృష్ట పూర్వ మిదె సేతు వంబుధి కోసన్
బదిలముగ గట్టి నట్టిది
త్వదర్థమై జానకీ! మన వానర తతిచే

1602. ఇది సేతు బంధ మనగా
విదితం బిచ్చో గలసె విభీషణుడు ననున్
ఇది పుణ్య తీర్థ మై పా
ప దళన మొనరించు స్నాన ఫలముగ సీతా!

1603. అదె రమణీ యోప వనా
స్పదంబు సుగ్రీవ రాణ్ణివాసము కిష్కిం
ధ దివిజ నాథాత్మజు నే
చదిపిన తా వదియె చూడు సారస వదనా!

1604. అనినన్ దరస్మితంబున
జనకజ యర్థింప రామచంద్రుడు రావిం
చె నయోధ్యకుం గొని చనగ
నినతనయుం బంపి వానరేశ్వర సతులన్.

1605 తారా రుమాది వానర
వీరుల భార్య లరుదెంచి ప్రియ భావనతో
నారోహణం బొనర్ప గు
బేరు విమానంబు సాగె వియ దధ్వమునన్.

1606. మఱల వచింప దొడగె ని
ట్లరుసమ్మున రాము డవ్యయ తపః ఫల సం
భరితుండు మతంగ మునీ
శ్వరు పుణ్యాశ్రమము జనకజ! కనుము దీనిన్.

1607. ఇచటె శబరకాంత పవి
త్ర చిత్తమున మా కొసంగి దద్దయు ప్రేమన్
రుచిరం బగు నాతిథ్యము
శుచి ప్రవేశమ్మున జనె సుగతి పథములన్.

1608. విమల జలోపేతంబున్
రమణీయ శకుంత గీత రవమున్ ఫుల్లా
బ్జ మనోజ్ఞ గంధ బంధుర
సమీర మి ద్యదియె పంప జానకి! కనుమా!

1609. అదె మేము కబంధు దనం
గ దనుజునకు శాపమోక్షణము గూర్చిన తా
వు, దినేశ్వర సుతుతో మా
కొదవిన సఖ్యంబు త ద్దితోక్తి ఫలంబే.

1610. నిను దొంగిలించి కొని పో
యిన రాక్షసు న ద్దశాస్యు నెదిరించి మహా
రణముం బొనర్చి యిచ్చో
టనె హతుడయ్యె ఖగపతి జటాయువు సీతా!

1611. అదె పంచవటి కుటీరము
చదిపితి దనుజుల జతుర్దశ సహస్రముగా
నదె గోదావరి కను మ
ల్లదె సురసన్నుతు డగస్త్యు నాశ్రమ భూమిన్.

1612. వినుత తపోధనులు సుతీ
క్షణ శరభంగులు ప్రవిమల చారిత్రులు పు
ణ్యనిధానుల యాశ్రమముల్
కను మవె శరభంగు డందె గైవల్యంబున్.

1613. అత్రి మహాముని యున్న ప
విత్రాశ్రమ మయ్యదె, యదె వెలయున్ బహుధా
తు ప్రవిల జిత్రకూటము
నేత్రోత్సవమై ద్రవిజ ధునీ తీరమునన్.

1614. విమలాత్ముండు భరద్వా
జ మౌని పుణ్యాశ్రమ మదె జానకి! శుద్ధా
త్మ మహాప్రభావు డమ్ముని
నమింత మని నిల్పె వాహనంబ చ్చోటన్.

### భరద్వాజ ముని సందర్శనము

1615 రాముడు చొచ్చె న దాశ్రమ
భూమి సపరివారముగ ప్రమోదమున ముని
స్స్వామి నెఱపె స్వాగతము, ప్ర
ణామంబు లొనర్చిరి రఘు నాథ ప్రభృతుల్.

1616. మునిచంద్రుం డిట్లనె, రా
మ నరేంద్ర! యెఱింగితి దశమస్తక పలలా
శన సంహార నాంశమ్ముగ
ఘనంబగు భవచ్చరిత జగ చ్ఛోభనమున్.

1617. సత్య పరాక్రమ! రామా!
ప్రీత్యావహ మయ్యె నాకు పితృవాక్యము సం
స్తుత్యముగ దీర్చుటన్ గృత
కృత్యుడ వౌ నిన్ను జూడ నెంతయు మదికిన్.

1618. వర మిచ్చెద నొం డడుగుము
మఱియున్ నేటికి మ దాశ్రమమున సతీ సో
దర పరివార యుతుండవు
నరప్రవర! నీ కొసగెద నాతిథ్యంబున్.

1619. అనుకు మధుర ఫల భరిత ధ
రణీరుహ కలితముగ దనరం జేయును ప
త్తన మార్గమున వని నం
చును రాము డడుగ నొనర్చెను మునీంద్రు డటుల్.

**రాముడు హనుమను భరతు నొద్ద కనుచుట**

1620. హనుమం గని పిమ్మట ని
ట్లనె రాముడు, భరతు నాదు ననుజన్ముం జూ
డ నరుగు మయోధ్య కీ వో
హనుమా! తెల్పు మతనికి మ దాగమనంబున్.

1621. పదునాల్గేడులు గా రా
ట్పదవిన్ వహియించు చున్న వా డిపు డే రీ
తి దలంచునొ చిత్తమున వి
శదంబు గా నెఱిగి రమ్ము శర వేగ గతిన్.

1622. భరతుండు దానె ధరణీ
భరమ్ము బూన న్మనమున భావించు నెడన్
బరమ ముదమ్మున నంగీ
కరింతు బూర్ణానురాగ కలితుం డనుగా.

1623. ధరణిన్ త్రికరణ శుద్ధిగ
భరతుడు నా కొసగ సిద్ధపడి పల్కిన చో
మఱలి చనుదేర వల్వదు
మరుత్తనయ! నిల్వు మచటె మా కొఱకుం గాన్.

1624. హనుమ! అయోధ్యా మార్గ
మ్మున నలదు శృంగిబేర పురి, గుహు డ ప్ప
త్తనమున పతి నాకు సఖుం
డనామయం బడుగు మస్మ దభ్యర్థన గాన్.

1625. పయనం బై వత్తుము మే
మయోధ్యకున్ రే పుదయము నందు, చను మనన్
వియదధ్వంబున నేగెన్
రయమ్మున మరుత్సుతుడు భరతు దర్శింపన్.

**హనుమ భరతునకు రామాగమును దెల్పుట**

1626. చనె శృంగి బేర నగర
మ్మున రామాగమన వార్త పురపతి కెఱిగిం
చి సభస్వదాత్మజుడు చ
య్యన నందిగ్రామము భర తాశ్రమమునకున్.

1627. నంది గ్రామమున మరు
న్నందను డీక్షించె రామ నామ ధ్యానా
నందు, జటావల్కల ధా
రిం దాంతు గృశాంగు భరతు దృఢనియమ పరున్.

1628. ఫలమూలాశను బ్రహ్మ
ర్షి లసత్తేజో విభవ భరితు భరతుని, గే
వల రామ దర్శ నేచ్ఛా
కలితాత్ముం గని పులకిత గాత్రుం డగుచున్.

1629. హనుమం డిట్లనె నంజలి
యొనర్చి బాష్పములు గ్రమ్ము చుండు కనులతో
వినయమ్మున, దేవ! భరత!
వినిపింతు శుభప్రదంబు విను మీ వార్తన్.

1630. వనవాస క్లేశ వ్యధి
తు నెవ్వనిం జూడ నీవు తొందర పడుదో
యనఘచరిత్రుం డా రఘు
జనపాలు డడిగె భవ త్కుశలముం బ్రీతిన్.

1631. తన దేవేరి నపహరిం
చిన రావణు సంహరించి శ్రీరాముడు భా
ర్యను దమ్ము లక్ష్మణుం గొని
చనుదెంచుచు నుండెనయ్య సమ్మద మెసగన్.

1632. అన న త్యుత్కట హర్ష
మ్మో నోప లేక భరతుండు మూర్ఛిల్లి క్రమం
బున దెల్విం గని యి ట్లనె
హనుమంతుం గౌగిలించి సాశ్రు నయనుడై.

1633. ఘన గ్రీష్మాతప తప్తా
వనికిన్ దొలిజల్లు వోలె వచ్చి శ్రుతి రసా
యనముగ రాము కుశల వా
ర్తను దెల్పితి వెవ్వడవు సురవా మనుజుడవో!

1634. ఎనలేని మోదముం గూ
ర్చిన నీ కొసగుదు ననర్ఘ చీనాంబర గో
ధన రత్న హారములు మో
హనాంగు లగు కన్యల బదునార్వుర ననఘా!

1635. ఎపు డెపుడు రాము డేతెం
చి పుడమి భారంబు బూన సేవింతు దదీ
య పధాంబురుహంబు లనుచు
విపిన నివాస వ్రతాంత వేళ న్వేతున్.

1636. వినిపింపుము రామ ప్రభు
వనవాస విశేషములు క్షపాచరపతి గూ
ల్చిన తీ రనుచు బ్రసి యొసగ
ననిలజు డాసీను డై మహానందమునన్.

1637 సుమధుర వచః ఫణితి డెం
ద మలర గా జిత్రకూట ధాత్రీధర ని
ర్గమన ప్రభృతి ధరణిజా
సమాగ మాంతముగ రామ చరితం బెల్లన్.

1638. వినిపించి వాయుజుం డి
ట్లనె, సుగ్రీవాది వానరావళియు విభీ
షణుడు న్వెనుకొన రాముడు
చనుదెంచు న్పుష్పకమున జానకి తోడన్.

1639. ముని తల్లజుడు భరద్వా
జుని దర్శించి మఱునాడు సూర్యోదయ వే
ళ నిచటికిన్ రా గల డా
యనఘాత్ముడు రాముడు భరతా! నిన్జూడన్.

**శత్రుఘ్నుడు శ్రీరామునకు స్వాగత సన్నాహములు సేయుట**

1640. పరమానంద వికచ హృ
త్సరోరుహుం డై భరతుడు దద్రామకథా
భిరతుం డగు శత్రుఘ్నున్
బరికించి వచించె నిట్లు నయ మొప్పారన్.

1641. చాటం బంపుము తమ్ముడ!
వీటన్ రామాగమనము విస్ఫార ధ్వ
న్యాటోపంబున దీర్పుము
హాటక మణి రత్న తోర ణాలంకృతులన్.

1642. పురి దేవాలయము లలం
కరించి కుసు మోపహార గంధ ద్రవ్యం
బర ధూప దీపములతో
సురలం బూజింపుడు కొలుచుడు భూసురులన్.

1643. కవి గాయక నర్తక సూ
త వంది మాగధ పురోహిత సచివ మౌని
ప్రవర చమూనాథ ప్రము
ఖ వివిధ పౌరజన కన్యకా నివహంబుల్.

1644. చేరి నిలువ వలె బారులు
గా రాముని స్వాగతింప గనక చ్ఛవి మ
ట్రీచ్చి రుచిర పతాకాళియు
బోరన మ్రోయు శుభ వాద్యములు నొప్పారన్.

1645. అనినన్ శత్రుఘ్ను డరిగి
యొనర్చె సన్నాహములు మహోత్సుకత, స్ఫుర
న్మణి తోరణ జాదుల బురా
తన వైభవ దీప్తి కల్మి దనరెం బురియున్.

భరతాదులు శ్రీరాముని కెదురు నేగుట

1646. రవి యుదయించుటకు న్మ
న్నవరోధ జనంబు లెల్ల నరుదెంచి రమా
త్య వశిష్ఠ కాశ్యపాది బు
షివర్యులుం దండపతులు సేనలు తో రాన్.

1647. భరతుండు రామ పాదుక
లరుసమ్మున దల నిడికొని యనుజన్ముండున్
గరువలి సుతుండు దో రా
బుర ప్రజావళులకు మునుముందుగ నడిచెన్.

1648. అరుణు డుదయించె దృగ్గో
చరుండు కాడేమి రామచంద్రుం డనుచున్
భరతుండు సూచె శంకా
భరిత స్వాంతుం డగుచు బవనసూతి దెసన్.

1649. భరతున కిట్లనె నంతట
మరుత్సుతుండు, వన మెల్ల మధుర ఫల జలా
కరముగ నెసంగ నొసగిరి
వరము భరద్వాజుడు సురపతియున్ భరతా!

1650. చాపల్యము చే నయ్యవి
సొపడ మా వానర తతి చరియింపం బో
నీపగి దిం జాలము గా
నోపు నిజముగ నరుదెంచు వ్యోమ పథమునన్.

శ్రీరాముడు నందిగ్రామమునకు వచ్చుట

1651. అనుచుండ నంబరంబున
వినవచ్చె న్వానర చయ విపు లారవముల్
కనవచ్చె బుష్పకంబున్
వన భూమిం డిగ్గుచు నయన మనోజ్ఞముగన్.

1652. రాముడు పుష్పకమున్ డిగి
భూమీస్థలి మోపె బాదములు జనకసుతా
సౌమిత్రులతో జై జై
రామా యను రవము లంబరమ్మున నిండన్.

1653. భరతుండు హర్ష పులకిత
శరీరు డై కనుల బాష్ప జలము లురలగా
నరిగి ప్రసన్నముఖుం డై
న రాము పాదముల కెఱగి నయము దలిర్పన్.

1654. పాదుకలు మోదమున ద
త్పాదాబ్జ ద్వయికి గూర్చి భరతుం డనె నా
మీదన్ సకాలమునకున్
నీ దర్శన మిచ్చి తయ్య! నిర్భర కరుణన్.

1655. పితృవా క్పాలన మనమ
ప్రతిభన్ జెల్లించి రిపుల భంజించి సుఖ
స్థితి నరుదెంచితి వర్పిం
చితి నీ రాజ్యంబు నీకు జేకొనుము ప్రభూ!

1656. మోసితి బదునాల్గేడులు
గా సర్వంసహ ద్వదీయ కారుణ్యమునన్
నీ సరి వత్తునె యన్నా!
యీ సామ్రాజ్య మిక నీవ యేలుము చిరమున్.

1657. అనుటయు సాదరముగ భర
తు నెత్తి గౌగిట గొనె నవ తోయరుహ విశా
ల నయను డా రాముడు ల
క్ష్మణు సంభావించె దగిన గతి భరతుండున్.

1658. సరవిన్ గొనె గౌగిట వా
నర పుంగవులన్ గుముద పనస ఋషభ గవా
క్ష రభస నీ లాంగద గవ
య రంభ మైం దాదుల బర మాదర మెసగన్.

1659. భరతుం డనె వానర రా
జ్యరమాధీశ్వరున కిట్టు లభివాద పుర
స్సరముగ మా భ్రాతలు న
ల్వుర కైదవ వాడ వైతి పుణ్య చరిత్రా!

1660. ఆపదలు బెరసి నప్పుడు
ప్రాపై తోడుపడు వాడె పరగును మిత్రుం
డై పగవాడ యగుం జు
మ్మీ, పెఱవా డంచు గౌగిలించె నినసుతున్.

1661. దైవ వశంబున జేపడె
నీ వంటి మహాత్ముడు రఘునేతకు జెలియై
యే విధి నందు విభీషణ!
యీ వొనరించిన సహాయ మింత యటంచున్.

1662. అని కౌగిటం గొనె విభీ
షణు భరతుం డంజలించె శత్రుఘ్నుడు భూ
తనయా రాములకున్ ల
క్ష్మణునకు మో దాశ్రు పూర్ణ చక్షుం డగుచున్.

1663. క్రమమున మ్రొక్కిరి భక్తియు
ప్రమోదము న్వెలయ రామభద్రుడు సీతా
రమణియు లక్ష్మణుడున్ గుశ
ల మరసి తల్లులకు గోసలసు తాదులకున్.

1664. గురుదేవులకున్ సంయమి
వరులకు బాదమ్ము లంటి వందన మొనరిం
చిరి మువ్వురు సదమల భ
క్తి, రహి యెనగ వారును బహుదీవన లొసగన్.

1665. పురజను లెల్లరు నుద్దవి
డి రామునకు స్వాగతం బిడిరి మంగళ వా
ద్య రవములు జయ ధ్వను లం
బరంబు ముట్ట సుమవృష్టి బద్ధాంజలులై.

1666. దరహాసాంచితముఖు డా
దరించె రాముడు పురోహితామాత్య వనే
శ్వర మిత్ర దండనాథుల
బురముఖ్యుల నమ్రత గరములు మోడ్చి యొగిన్.

1667. కనుసన్న విభీషణ విభు
ననుమతి గైకొని ప్రదక్షిణ నమస్కృతులన్
బొనరించి కుబేరుని కడ
కనిపెన్ రాఘవుడు పుష్పక విమానంబున్.

1668. క్షురకులు రిపుఘ్ను నానతి
సరగున నేతెంచి రామ సౌమిత్రులకున్
భరతునకు దీర్చి దిద్దిరి
మురువుగ నిపుణముగ గడ్డములు మీసములున్.

1669. తొలుత భరతుండు నా పై
న లక్ష్మణుండు రవినందన విభీషణు ల
వ్వల రామవిభు డొనర్చిరి
లలిన్ సుగంధ జల మంగళ స్నానములన్.

1670. కనకాంబరంబులున్ జం
దనములు మై పూతలు సుమదామములున్ గాం
చన భూషణావళియు నిం
పెనయ ముదంబున నలంకరించిరి రామున్.

1671. జానకికిం జేయించిరి
రాణులు ముప్వు రమలాంతరంగముల శుభ
స్నా నాద్యలంకరణము ల
నూనమ్ముగ నవ వధువున కొప్పెడి రీతిన్.

1672. తారా రుమాది వానర
వారిజ నేత్రల కమూల్య వస్త్రా భరణ
శ్రీ ర మ్యాలంకృతు ల
వ్వారిగ నిప్పించె రామభద్రు జననియున్.

శ్రీరాము డయోధ్యఁ జేరుట

1673. కన కాలంకృత రథమున
మణిమయ పీఠము లమర్చి క్ష్మాతనయా రా
మ నరేంద్రుల నాసీనుల
నొనర్చి కొనిచనె భరతు డయోధ్యాపురికిన్.

1674. భరతుడు పగ్గమ్ములఁ జే
దరించి యరదమ్ము దోల దమ్ములు వింజా
మరలన్ వీవగ రాత్రిం
చరపతి ఛత్రంబు బట్టె శశి సన్నిభమున్.

1675. హరిదశ్వంబుల బూన్చిన
యరదమ్మున నేగు దైవ తాధిపు బోలెన్
మెఱయుచు జేరె నయోధ్యా
పురి సంకుల రాజ మార్గమున రాముండున్.

1676. ధాత్రీధ రోన్నతం బగు
శత్రుంజయ నామ మదగజ శ్రేష్ఠము పై
మిత్రాత్మజు దేగె జన
స్తోత్రమ్ముల నాలకించుచు రథము వెంటన్.

1677. వినవచ్చె నంతట నభ
మ్మున దేవ మరుద్గణ ముని ముఖ్య సుకృత వే
ద నిరూపి తార్థ రామా
వనిపాల స్తోత్రములు శ్రవః పేయములై.

1678. అరదంబునకున్ మున్నుగ
నరిగెన్ గోచయము గన్యకావళియు శుభం
కర పుష్పాక్షతలం గొని
వర భూసుర కోటియు బహు వాద్యంబులతో.

1679. పురి నింటింటన్ ముంగి
ళ్ల రంగవల్లికలు పరమ రమ్యంబుగ దీ
ర్చిరి మి న్నొరయు ధ్వజము లె
త్తిరి చెలువార బహువర్ణ దీప్తమ్ములుగన్.

1680. లలి రమ్య సౌధపాళిన్
విలస ద్రాజముఖ భామినీ వితతులు సే
సలు జల్లి కప్పురపు మం
గళహారతు లిచ్చు చుండ గా రాము డొగిన్

1681. పురి జొచ్చి రాజసౌధాం
తరమున దల్లులకు వందనములు సమర్పిం
చి రవిజు విడియింప బనిచె
భరతున్ నిజ పూర్వ వాస భవనం బందున్.

శ్రీరామాభిషేకము

1682. భరతుం డభ్యర్థింప ది
న రాట్సుతు డనుప మరుక్షణంబున జని తె
చ్చిరి భర్మ కలశముల స
త్వర జతు రబ్ధుల జలంబు వానర వీరుల్.

1683. మణి ఖచిత రత్న సింహా
సనమున నాసీను జేసి జానకితో రా
మున కభిషేకము సేసిరి
మునీంద్రులు వశిష్ఠ మౌని మున్నుగ నెలమిన్.

1684. నరవిన్ బుత్విక్కులు భూ
సురవరులున్ గన్నెలు వణిజులు యోద్ధలునున్
బురజనులు రాముని కొన
ర్చి రొగి సుగంధిల జలాభిషేకము బ్రీతిన్.

1685. సురలు మహర్షులు దిక్పా
లుర గూడి ప్రహర్షభావు లుద్గీతిన్ స
ర్వౌ రసౌషధు లభిషేకిం
చిరి లో కావనరతుండు శ్రీ రామునకున్.

1686. ఉవిజపతి ప్రోత్సహింపగ
బవనుం డర్పించె రామభద్రునకున్ హే
మ విలసిత రత్నహారము
ప్రవిమల రోచిస్ఫుట శత పద్మోజ్జ్వలమున్.

1687. అనిలుం డొసంగె రాముని
కనర్ఘ రత్న మణి మౌక్తికాలంకృత కాం
చన దివ్య హారమున్ శో
భనయుక్తి మణుల నిలింప పతి వచనమునన్.

1688. భరతుడు ఛత్రము బట్టన్
దరుచరపతియున్ విభీషణ విభుడు వింజా
మరలం బూనిరి చేతుల
శర దిందు సమోజ్జ్వల రుచి సంపన్నములన్.

1689. సురం వాద్యత్రములు మొఱసె
సుర కిన్నరు లాడి పాడి సుమవృష్టి వెలా
ర్చిరి రామచంద్రుదు పై నన
వరతమ్ముగ ద న్మహోత్స వావసరమునన్.

1690. తరువులు పూచి ఫలించె మ
ధురముగ విమల జలయుక్తి ధునులున్ బాఱెన్
బరమ సుగంధము వీచెం
గరువలి త త్కాలమున సుఖ తను స్పర్శన్.

1691. ధేను శత సహస్రంబున్
గానుక గా నిచ్చె బ్రాహ్మణ తతికి రామ
క్ష్మానాథు డాభరణ వ
స్త్రానీకముతో హయ వృష భావళి తోడన్.

1692. జానకికిన్ బహుమానము
గా నొసగె న్రాము డలఘు కాంచన మణి ము
క్తా నద్ధ రత్న హారము
దానిన్ దరహాస భాసిత వదన యగుచున్

1693. కొని జనకాత్మజ తరశే
క్షణముల గన సాగె రామచంద్రుని వంకన్
హనుమన్ముఖ కపి వీరా
గ్రణుల దెసన్ బల్మఱు, రఘురాము డనె నిటుల్.

1694. ఏ వాని బుద్ధి బలముల
నీ విశ్వము నీవు నేను నెల్లరమున్ సౌ
ఖ్యావిర్భూతి దనర్తుము
యా వీరున కిమ్ము రత్నహార మవనిజా!

1695. అనినన్ జానకి మోద
మ్మున బావని కిచ్చె హారము, ధరించె నతం
డును దాని నణుత వినయ
మ్మున, జే జే లిడి సభికులు మోదము తెల్పన్.

1696. తరువాత నాదరం బొ
ప్ప రాఘవుండు దనిపె గపిపల్లవులన్ భా
స్కర తనయాదుల దానవ
వరులను ద త్త దనురూప బహుమానములన్.

1697. పరితుష్ట స్వాంతములన్
దరణి సుతుండున్ విభీషణ విభుండును నే
గిరి నిజ రాజ్యమ్ముల కను
చరులం గూడి కృతకృత్య సంభావను లై.

1698. అనఘ సభాంతరమున ల
క్ష్మణు జూచి వచించె రామచంద్రుదుడు భూ పా
లనమున నాకుం దోడై
యొనర్పుము సహాయ మీవు యువరాజువు గాన్

1699. అనుడు భవ త్పద సంసే
వనంబు దక్క నితరంబు వాంఛింపను నే
ననె లక్ష్మణుండు రాము డ
తని మెచ్చుచు నిల్పె ద త్పదంబున భరతున్.

1700. క్రతువులు పెక్కొనరించెన్
శతాశ్వమేధములు సేసె శాస్త్రవిధిన్ దే
వతలం బూజించె జన
ప్రతతిన్ రంజించె ధర్మ రక్షణ నియతిన్.

1701. ఎఱుగరు దుష్ట మృగ భయం
బెఱుంగరున్ జోరభీతి యే కష్ట మెఱుం
గ రెఱుగరు రోగ భయ మె
వ్వ రెఱుంగరు కాంతలు విధ వాయోగంబున్.

1702. ఆ రామ రాజ్యమున ప్రజ
వారక ధర్మంబె నెఱపి వదలిరి పర హిం
సా రతి స త్సంతానం
బారోగ్యము కల్మి నెసగి రాయుష్మంతుల్.

1703. ఏ యది చేసిన శ్రీరా
మా యని వ్రాయుచు బలుకుచు మానక సతముం
జేయుదురు రామ నామం
బాయొుదయడు దైవమయ్యె నవని ప్రజకున్.

1704. తరుణమ్మున బర్జన్యుడు
గురియు మహీరుహ తతి యెసగు గుసుమ ఫలసం
భరితంబై యెక్కాలము
సురుచిర సంపదల బొంది సుఖియింత్రు జనుల్.

1765. ఆ రీతి రాము డఖిల ప్ర
జారంజకముగ ధరిత్రి శాసించె గుణో
దారు లనురక్తు లనుజుల
కూరిమి పదియు నొక వే యగు వసంతంబుల్.

## ఫలశ్రుతి

ఏ నరు డేనియు నీ యా
ఖ్యానము భక్తి కలితాత్మ నాలించినను న్
బూని లిఖించిన జదివిన
నా నరు డొందు నిహ పర సుఖాళి ననఘుడై.

## అంకితము

ఇది రాముడు వ్రాయించిన
తదీయ మైన కథ వ్రాయ దగుదని నన్నుం
పురిరిచె, భక్తిన్ వ్రాసితి
త దర్పణంబుగ సుజన హిత రస స్ఫూర్తిన్.

—: o :—

మంగళం కోసలేంద్రాయ
మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ
సార్వభౌమాయ మంగళం
శ్రీరామచంద్రార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



యడవల్లి వీరరాఘవస్వామి

తల్లిదండ్రులు : కీ. శే. అనంతలక్ష్మి వేంకటాచలపతిగారలు.
జననం : అక్షయ మార్గశిర కృష్ణ చతుర్దశి భానువాసరము 2.1.1927 నందివాడ, కృష్ణాజిల్లా.
వృత్తి : సహకారశాఖలో డిప్యూటీ రిజిస్ట్రారుగా పదవీ విరమణ.
అభిరుచి : సంస్కృతాంధ్ర సాహిత్యములు.
ముద్రిత రచనలు : భక్తిమాల - శ్రీరామచంద్ర ప్రభుస్తవ రూపశతకం శ్రీరామకథ (శ్రీరామకథాకందము) సుందరకాండ. (1985) శ్రీరామ కథాకందము - బాల (1939) అయోధ్య (1989) అరణ్య (1990) కిష్కింధ (1991) యుద్ధకాండ (1993).
అముద్రితము : శ్రీరామ కథాకందము - ఉత్తరకాండ.
ఇతర రచనలు : రెండు వరాలు (పద్యనాటిక) ఆకాశవాణి విజయవాడ కేంద్రం నుండి ప్రసారితము.